# మొదటి అధ్యాయము

## 1

నౌగఢ చక్రవర్తియైన సురేంద్రసింహుని కుమారుడు వీరేంద్రసింహునికీ విజయగఢ చక్రవర్తి జయసింహమహారాజు పుత్రిక అయిన చంద్రకాంతకు వైభవోపేతంగా వివాహం జరిగింది. పెండ్లి పెద్దలు తేజసింహుడు శివదత్తునిబంధించినందుకు చాలా సంతోషించారు. శివదత్తుని మనస్సులో ఇంకా దురాలోచనలు మెదులుతూనేఉన్నాయి కనుక అతన్ని చెఱసాలలో ఉంచటమే మంచిదని అందరూ అభిప్రాయపడ్డారు. కాని సురేంద్రసింహుడు మాత్రం అందుకు అంగీకరించలేదు. "శివదత్తుని విడిచిపెట్టాం. అతడు తేజసింహునితో తలపడటం మనమీద తిరగబడటంగా భావించరాదు. క్షత్రియుడైన కారణంగా సరివారిలో తేజసింహుడు అవహేళన చేస్తుంటే చూస్తూ ఊరుకోనలేక తిరగపడ్డాడంతే! అయితే నేనుకూడా శివదత్తునిప్రవర్తనలో మార్పు వచ్చిందని భావించటంలేదు. అతను నిజంగానే వైరాగ్యాన్ని స్వీకరించి ఉంటే ఇక్కడికి చాటుమాటున రావలసిన అగత్యం కనిపించటంలేదు. అయినా ఇతనిని విడిచిపెట్టేస్తున్నాం. ఒక వేళ నిజంగానే శివదత్తుడు మనపై తిరగబడదలచుకుంటే, యిక్కడ గాజులుతొడుక్కొని కూర్చున్నవారుమాత్రం యెవరున్నారు అన్నాడు.

శివదత్తమహారాజు విడుదలైన తర్వాత యెక్కడికి వెళ్ళి

పోవాలో తెలియదు. వీరేంద్రుని వివాహం జరిగిపోయిన తర్వాత జయసింహుని అభిప్రాయంప్రకారం సురేంద్రుడు చపలను తేజసింహునికీ, చంపను దేవీసింహునికీ ఇప్పించి వివాహాలు చేశాడు. చంప చపలకు దూరపుచుట్టరికాన చెల్లెలు వరుస అవుతుంది.

మిగిలిన ఐంద్రజాలికులవివాహాలుకూడా జరిగిపోయాయి. వాళ్ళ కుటుంబాలు చునార్‌గఢంలో స్థిరపడ్డాయి. వివాహం జరిగిన కొద్దిదినాలకు చునార్‌గఢానికి వీరేంద్రసింహుడు రాజుగా పట్టాభిషేకమహోత్సవం జరిగింది. అప్పటినుంచీ యువరాజుపేరు పోయి వీరేంద్రుడు మహారాజుగా పేరు పొందాడు. వీరేంద్రసింహమహారాజుకు తేజసింహుడు మంత్రిగా నియుక్తుడయినాడు

సురేంద్రుడు తనకుమారుణ్ణి చూడకుండాఉండలేక రాగ్యాన్ని జీతసింహునికి అప్పగించి తానుకూడా చునార్‌గఢానికి వచ్చాడు. పరిపాలనాభారం మోస్తున్నా వీరేంద్రుడే వహించాడు. తండ్రిమాత్రం అప్పుడప్పుడూ సలహాలిస్తూ వుండేవాడు. తేజసింహుని తండ్రి జీతసింహుడుకూడా చునార్‌గఢంలోనే హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. సురేంద్రసింహుడు రోజురోజుకీ అతన్ని అధికాధికంగా అభిమానించసాగాడు.

వివాహమైన రెండుసంవత్సరాలకు చంద్రకాంతకు కుమారుడు జన్మించాడు. అదేసంవత్సరం చపలకూ చంపకూ కూడా కుమారులే జన్మించారు. తరువాత మూడుసంవత్సరాలకు చంద్రకాంతకు మరొకపుత్రుడు జన్మించాడు. చంద్రకాంత

మొదటికొడుకుపేరు ఇంద్రజిత్‌సింహుడు. రెండవవాని పేరు ఆనంద సింహుడు. చివరికొడుకు పేరు భైరవసింహుడు, చంపకొడుకు పేరు తారాసింహుడు

ఈ నలుగురుపిల్లలకు విద్యాభ్యాసానికి తగిన ఏర్పాట్లు జరిగాయి. ఈ పిల్లలయొక్క బాధ్యతను సురేంద్రసింహుడు జీతసింహునికి అప్పగించాడు.

భైరవసింహుడు. తారాసింహుడు మాయాజాలంలో అత్యంత నిపుణులైనారు. జీతసింహుడు వారిని తండ్రులను మించిన కుమారులను చేశాడు. ఈ కుమారులు వన్యాలాలు వగైరా ఐంద్రజాలికులను తలదన్నేవారు. భైరవసింహుడు, తారాసింహులలో ఎవరూ అత్యధిక ప్రతిభావంతులో తెలియ జెప్పలేకంటె భైరవసింహుడు ఇంద్రజేతసింహునికి తారా సింహుడు ఆనందసింహునికి ముఖ్యమైన స్నేహితులుగా ఏర్పడ్డారని చెప్పవలసి ఉన్నది.

ఇప్పుడు ఇంద్రజేతసింహునికి, భైరవసింహునికి పద్దెనిమిది సంవత్సరాల వయస్సు వచ్చింది. ఆనందసింహుడు పదహారు సంవత్సరాల వాడయ్యాడు. శివదత్తుడు కల్పించిన కష్టాల పరంపరలు ఒక స్వప్నంగా మారి యిప్పుడందరూ శాంతి సౌఖ్యాలతో కాలం గడుపుతున్నారు.

ఇంద్రజితసింహునికి వేటంటే చాలా ఇష్టం అతడు సాధ్యమైనంతవరకు రోజూ వేటకు వెళ్ళుతుండేవాడు. ఒకనాడు అడవిలో వేగులవాడొకడు వచ్చి ఫలానా అడవిలో వేటాడ టానికి జంతువులు సమృద్ధిగా వున్నాయని, ఒక మాసంరోజుల పాటు అక్కడవున్నా ప్రతిదినమూ వేటాడటం జరుగుతుందని

తెలియజెప్పాడు. ఆ వార్త సోదరులిద్దరికీ ఆనందకారణమైంది. ఎనిమిది పదిరోజులపాటు అడవికి వేటాడటానికి వెళ్ళి ఉంటా మని తండ్రియైన వీరేంద్రసింహుని అనుమతిని కోరారు. 'ఇన్ని రోజులపాటు అడవిలో మకాం వెయ్యటానికి నేను మాత్రం ఒప్పుకోను. ఒకవేళ మీ తాతగారు అనుమతిస్తే నా అభ్యంతరం ఏమీలేదని చెప్పాడు వీరేంద్రసింహుడు.

సోదరులిద్దరూ తాతగారి దగ్గరికి వెళ్ళి వేటకు అనుమతించవలసిందిగా కోరారు. అతడు మనుమల కోరికను అంగీకరిస్తూ వేటాడే అడవిలో ఒక శిబిరాన్ని నిర్మింపించవలసిందిగానూ, ఐదువందలసైన్యం రక్షణకోసం తీసికొని వెళ్ళవలసిందిగానూ చెప్పాడు. ఆ ప్రకారం చునార్‌గఢకు ఇంద్రజీసింహుడు, ఆనందసింహుడు ఐదువందలసైన్యంతో వేటకై చునార్‌గఢనుండి ప్రయాణమైపోయారు.

చునార్‌గఢకు దక్షిణంగా ఐదుకోసులదూరంలో ఉన్న ఒక భయంకరమైన అడవిలో శిబిరం వేశారు. ఆనాటికి ప్రొద్దు కూకింది. గనుక మఱునాటినుంచి వేట ప్రారంభించవచ్చు నని ఆ నాడు విశ్రాంతి తీసుకోదలచారు. జంతువులజాడలు తీసేవారిని పెద్దపులిజాడ తెలుసుకోవలసిందిగా ఆ నాడే పంపించారు. ఆ జాడలు తీసేవారికి పెద్దపులులకు ఎఱలుగా మేకలను కట్టవలసిన అవసరంకూడాలేదని తెలియజెప్పాడు. కాలినడకనే వేటాడటం జరుగుతుందని ప్రకటించారు.

రెండవనాటి ఉదయం జాడలు తీసేవారువచ్చి ఆ రాత్రి చీకటి కారణంగా పెద్దపులిజాడ కనుగొనలేకపోయా

మనీ ఆ నాటి వేట విరమించినట్లయితే పెద్దపులిజాడ తెలు సుకోగలమనీ చెప్పారు.

ఈ నాడుకూడా వేటాడటం జరగలేదు. ఒక జాము ప్రొద్దున్నదనగా ఇంద్రజీతసింహుడు ఆనందసింహుడు గుఱ్ఱాల నెక్కి తమ ఐంద్రజాలికులతో కలిసి శిబిరానికి దూరంగా వినోదవిహారానికి వెళ్లారు. వీరందరూ ముచ్చటలతో కాల క్షేపం చేస్తూ తిరుగుతున్న సమయంలో ఎడమదిక్కుగా సింహ గర్జనం వినపడ్డది. ఆ ధ్వనివిని వలుకుగా ఆగిపోయారు. సింహం గర్జించిన దిక్కుగా పరికించసాగారు.

రమారమి రెండువందలగజాలదూరాన ఒక సాధువు సింహంపై ఎక్కి స్వారిచేస్తూ వెళ్ళటం కన్పించింది. అతని తల నుండి జటాజూటాలు వెనుకకు వ్రేలాడుతున్నది. ఒకచేతిలో త్రిశూలం, మఱొకచేతిలో శంఖం ఉన్నాయి. అతడు సవారి చేస్తున్న సింహం చాలా పెద్దది. దానిమెడపై కేసరములు భూమిని తాకుతున్నాయి. ఆ సింహానికి ఎనిమిది పదిచేతుల దూరములో వెనకదిక్కున మఱొక సింహం నడుస్తోంది. దానివీపుమీద సామానులు ఉన్నాయి. బహుశా ఆ సామా నులు ముందున్న సాధువు అయిఉండవచ్చును.

అది సాయంకాలమయి కనుచీకటికావటంచేత ఆసాధువు స్పష్టంగా కనబడలేదు. అయినా సోదరులిద్దరూ ఆ సాధువును చూచి ఆశ్చర్యపడ్డారు.

ఇంద్రజీత్తుడు:— సింహంమీద స్వారి చెయ్యటం మానవ మాత్రులకు సాధ్యమా ?

దిగారు. ఐంద్రజాలికులు గుఱ్ఱాలను చెట్లకు కట్టివేశారు. ఆ తర్వాత నలుగురూ యోగిని సందర్శించారు.

దూరాననుండే సాధువు "రాజకుమారులారా! రండి! కుశలమేనా?" అని ప్రశ్నించాడు.

ఇంద్ర:- నమస్కరించి, మీ దయవల్ల అందరమూ క్షేమమే.

సాధువు:- ఆహా భైరవ సింహులారా! ఏమిటి విశేషం?

ఐంద్రజాలికు లిద్దరూ సాధువుకు నమస్కరించారు.

సాధువు:- రాజకుమారా మీరు ఈ అడవిలో వేటాడటానికి వచ్చారని తెలుసుకొని స్వయంగా మీ దగ్గరకు రాదలచుకొన్నాను. నేను 'గిరినార్' వెళ్ళబోతున్నాను. తిరుగుతూ తిరుగుతూ యీ అడవిలోకి వచ్చాను. ఈ అడవి అందంగా ఉన్న కారణంచేత రెండుమూడురోజులు యిక్కడ ఉండాలని అనుకొన్నాను. వసతిఅయినచోటు చూచి ఆగుతాను. నా వెంట ప్రయాణం చెయ్యటానికీ సామానులు మొయ్యటానికి అనేకసింహాలు ఉన్నాయి. అందుచేత నీవు సింహాలను వేటకోసం హరించవద్దు. ఆ విధంగా చేశావంటే వందలకొద్ది సింహాలు చెలరేగి మీ సైన్యాలను తుదముట్టిస్తాయి. నీవు ప్రతాపవంతుడవైన సురేంద్రసింహ మహారాజు పుత్రుడివి. అందుచేత మొట్టమొదటే నీ కేవిధమైన కష్టం కలగకూడదని ముందుగానే తెలియజేస్తున్నాను. సాధువు పొరపాటున వీరేంద్రసింహుని పుత్రుడనబోయి సురేంద్రసింహుని పుత్రుడని రాజకుమారుణ్ణి సంబోధించాడు.

ఇంద్ర:- మహాత్మా! ఈ సింహాలు మీవని మాకేం తెలుసు. మీవే అయితే వేటాడటం మానేస్తాం.

సాధువు:- వేట మానుకోవద్దు. నా సింహాలను మాత్రం చంపవద్దని చెబుతున్నాను.

ఇంద్ర:- ఫలానాసింహం మీదని నే నెట్లా గుర్తించ గలను?

సాధువు:- అయితే నా సింహాలని పిలుస్తాను. చూచి యిప్పుడే గుర్తుపట్టుకో అని శంఖం ఊదాడు.

ఆ శంఖారవానికి అరణ్యమంతా ప్రతిధ్వనించింది. ఆ వెనువెంటనే నాలుగుదిక్కులనుండీ గర్జనలు వినిపించాయి. కొద్దిసేపట్లో మరొక ఐదుసింహాలు పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చాయి. అక్కడ ఉన్న నలుగురూ ధైర్యశాలురు గనుక నిలబడగలిగారుగాని మరెవరైనా పిరికివారైతే ప్రాణాలువిడిచేవారు, సోదరులిద్దరి గుర్రాలు సింహాలను చూచి బెదిరి గంతులు వెయ్యసాగాయి. ఆ వచ్చిన సింహాలు ఇంద్రజీతసింహుని అతని సహచరులను చూచి గర్జిస్తూ ఎగురుతూ విచిత్రగతుల అల్లరి చెయ్యసాగాయి. కాని సాధువు అదలించటంతోనే సింహాలు శాంతించి వంచినతలలతో గొర్రెలవలె నిలబడిపోయాయి.

సాధువు ఇదిగో ఈ సింహాలను గుర్తుంచుకో. ఇంకా రెండుమూడు సింహాలు ఉన్నాయి. బహుశః శంఖధ్వని వినిపించక ఇక్కడికి రాలేదు. నేను ఈ అడవిలోనే ఉంటాను గనుక మిగతావాటిని ఇంకొకప్పుడుచూపిస్తాను. రేపుకూడా పూర్తిగా వేటాడటం నిలిపివెయ్యండి.

భైరవసింహుడు:- మీ మకాం ఎక్కడో? మిమ్మల్ని ఎక్కడ కలుసుకోవచ్చునో చెప్పగలరా?

సాధు:- నాకు యీ చోటే నచ్చింది. కనుక ఇదే నా బస. మీరు నన్నిక్కడే కలుసుకోవచ్చు.

సాధువు సింహాన్ని దిగాడు. అక్కడకు చేరిన సింహాలు సాధువుచుట్టూ తిరుగుతూ అతనిని నాకుతూ విశ్వాసాన్ని ప్రకటించసాగాయి. అక్కడచేరిన నలుగురూ కొంచెంసేపు ఆ దృశ్యాన్నిచూచి సాధువుదగ్గర శెలవుతీసుకొని వెళ్లారు.

శిబిరం చేరుకొన్నారు. ఇంద్రజీతసింహునితో భైరవసింహుడు "నాకిప్పుడు ఎన్నో ఆలోచనలు కలుగుతున్నాయి. మనం నలుగురం ఒకచోట కూర్చుండి మన కార్యక్రమాన్ని స్పష్టం చేసుకోవటం మంచిది" అన్నాడు. ఇంద్రజీతసింహుడు ఆనందసింహుణ్ణీ తారాసింహుణ్ణీకూడా పిలిపించాడు.

ఆ సమయంలో ఆ నలుగురూ తప్ప ఆ శిబిరంలో ఇంకెవరూ లేరు. భైరవసింహుడు తనమనస్సులోనున్న విషయాన్ని స్పష్టంగా బైటపెట్టాడు. అందరూ అతనివాదాన్ని శ్రద్ధగా విన్నారు. ఆ తర్వాత ఒక జాముకాలం నలుగురూ బాగా ఆలోచించి ఏమిచెయ్యాలో నిశ్చయించుకొన్నారు.

మఱునాటి ఉదయాన నలుగురూ శిబిరంనుండి బైటికి వచ్చారు. తమ సైన్యాధికారి కాంచనసింహుణ్ణి పిలచి ఏవో విషయాలుచెప్పి సాధువువున్నదిక్కుగా ప్రయాణమైపోయారు. తమసైన్యానికి దూరంగా వెళ్ళిపోయినతర్వాత ఆనందసింహుడు తారాసింహుడు అతిత్వరగా చునార్ గడ్ దిక్కుకు మరలారు.

ఇంద్రజిత్సింహుడు మాత్రం ఒంటరిగా సాధువును కలుసుకోవ టానికి వెళ్ళాడు.

సాధువు సింహాలమధ్య పీఠం వేసుకొని కూర్చున్నాడు. రెండు సింహాలు చుట్టూ తిరుగుతూ పహరా యిస్తున్నాయి. ఇంద్రజిత్సింహుడు ప్రవేశించి నమస్కరించాడు.

సాధువు అతనిని ఆశీర్వదించి కూర్చున్నాడు. ఇంద్రజిత్సింహుడు గతదినంకంటె అక్కడ మరొక రెండుసింహాలు అధికంగా ఉండటం చూచాడు.

సాధువు:— మిగతావారు రాలేదేం!

ఇంద్ర:— నా తమ్మునికి జ్వరం రావటంవల్ల రాలేక పోయాడు. అతనికి సహాయంగా ఐంద్రజాలికుల నిద్దరినీ అక్కడ ఉంచి మీ దర్శనంకోసం వచ్చాను.

సాధువు:— సాయంకాలానికి మీ తమ్ముడు బాగుపడ తాడు గాని మీ రాజ్యం సంక్షేమంగా ఉందా?

ఇంద్ర:— మీ దయవల్ల.

సాధువు:— పాపం సురేంద్రసింహుడు చాలా కష్టాలు పడ్డాడు. ఏది ఏమైనా ప్రపంచంలో అతనికీర్తి చిరస్థాయిగా నిల్చింది. వెయ్యిసంవత్సరాలమధ్య ఇంద్రజాలాన్ని భేదించ గలవాడు జన్మించలేదు. దానిని వీరేంద్రుడు భేదించగలిగాడు. ఇప్పుడు మళ్ళీ యింద్రజాలం వున్నది. నిజానికి పూర్వందాని కంటె యిప్పుడున్నదే చాలా ఘనమైంది.

ఇంద్ర:— మా తండ్రిగారు నా చేత ఆ యింద్రజాలం భేదనం జరుగుతుందని చెప్పారు.

సాధువు:- అవును నిజంగానే. నీ చేతిలోనే ఇప్పుడున్న యింద్రజాలం ఛేదించబడుతుంది.

ఇంద్ర:- ఇంతవరకూ నాకు తాళంచెవి దొరకలేదు. ఎప్పుడు దానిని ఛేదించగలుగుతానో తెలియకుండా ఉన్నది.

సాధువు:- భగవంతుడు దయకలిస్తే రెండుమూడు రోజుల్లో ఆ యింద్రజాలాన్ని ఛేదించటంద్వారా ప్రారంభమవుతుంది. ఆ యింద్రజాలానికి తాళంచెవిని నేను. ఎన్నో తరాలనుండి మేమే ఆ యింద్రజాలానికి సంరక్షకులం. మా ముత్తాతనుండీ తాతకూ, తాతనుండి తండ్రికీ, మా తండ్రి నుండి నాకూ ఆ సంరక్షణబాధ్యత సంక్రమించింది. ఇప్పుడు ఇంద్రజాలాన్ని ఛేదించటానికి నా ద్వారా తాళంచెవిని నీకు అప్పగించే సమయమాసన్నమైంది. ఆ యింద్రజాలం నీ పేరు మీదనే నిర్మితమై ఉన్నది. నీవు తప్ప ఆ యింద్రజాలానికి యజమాని మరొకడు లేడు.

ఇంద్ర:- ఆలస్యమెందుకు?

సాధువు:- ఏమీలేదు. రేపటినుంచి పని ప్రారంభించు. అయితే ఒక విషయం నీ మంచికోసం చెబుతున్నాను. నీవు ఈ కార్యక్రమంలో నీ తమ్ముణ్ణికూడా సహాయం తీసుకో. ఆ విధంగా అయితే సంపద రెట్టింపుదొరకటమే గాక ప్రపంచంలో సోదరులిద్దరూ చిరకీర్తిని సంపాదించుకో గలుగుతారు.

ఇంద్ర:- అతని ఆరోగ్యం బాగా లేదుకదా?

సాధువు:- నీవిప్పుడు వెళ్ళి అతనిని నా దగ్గరకు తీసుకొని రా. క్షణకాలంలో అతనిజబ్బు నయంచేస్తాను. నేడే

మీరు నా వెంట రండి. నేను ఇంద్రజాలాన్ని భేదించే పని ప్రారంభం కాకపోయితే మరోసంవత్సరందాకా ఆ పని ప్రారం భించటం జరగదు.

ఇంద్ర:- మహాత్మా నిజానికి నాకు మా తమ్ముడు అభివృద్ధి చెందటం యిష్టంలేదు. నా తోపాటు అతడు చిరకీర్తిని సంపాదించకలగటం నా కిష్టమైన పనికాదు.

సాధువు:- ఆ విధంగా నీవు భావించటం తప్పు. ప్రపం చంలో సోదరునికి మించిన అమూల్యవస్తువు మరొకటి లేదు

ఇంద్ర:- మీరు చెప్పినది నిజమే కాని సోదరునివంటి శత్రువుకూడా ఈ ప్రపంచంలో ఉండబోడు. ఈ విషయం నా హృదయంలో చిరకాలంనుంచీ తిష్ఠ వేసుకొని కూర్చున్నది. నా నమ్మకాన్ని తొలగించటం బ్రహ్మతరంకూడా కాదు.

సాధువు:- నీ సోదరునివెంట తీసుకొనివెళ్ళందే నీవు ఇంద్రజాలాన్ని భేదించలేవు.

ఇంద్ర:- అయితే నాకు ఇంద్రజాలాన్ని భేదించవల సిన పనిలేదు.

సాధువు:- అయితే నీ కీ పట్టుదల ఎందుకు ?

ఇంద్ర:- నా పట్టుదలను మార్చటం ఎవరివశం కాదు.

సాధువు:- అయితే నీవే పద. కాని యిప్పుడే వెళ్లాలి.

ఇంద్ర:- నేను సిద్ధంగా వున్నాను పదండి.

సాధువు వెంటనే లేచాడు. తన సామానులన్నిటినీ మూటలుగట్టి ఒకసింహంమీద వేసి కట్టాడు. మరొకదానిమీద ప్రయాణానికి సిద్ధమయినాడు, ఒకసింహాన్నిచూచి "గంగా రామ్ ఇటు రా" అన్నాడు. అది వెంటనే సాధువుదగ్గరకు

వచ్చింది. ఇంద్రజీతసింహునితో ఆ సింహంమీద ఎక్కమని సాధువు చెప్పాడు. ఇంద్రజీతసింహుడు ఆ సింహాన్ని ఎక్కి సాధువువెంట దక్షిణదిక్కుగా ప్రయాణమయినాడు. మిగతా సింహాలు కొన్ని ముందు దిక్కుగా మరికొన్ని వెనుకభాగాన నడుస్తూ పోసాగాయి.

సాధువూ, ఇంద్రజీతసింహుడూ ఎక్కిన సింహాలు రెండూ ముందుబడ్డాయి. మిగతావి వెనకాల ఉండిపోయాయి. మధ్యాహ్నమయేసరికి ఇద్దరూ వెళ్ళిపోయారు. సూర్యుడు అస్తాద్రిని చేరుకున్నాడు. సాధువు 'ఇక్కడాగి భోజనంచేసి వెడదాం' అన్నాడు.

ఇంద్ర:- మహాత్మా ఇప్పుడు భోజనం చెయ్యవలసిన అవసరంలేదు. మనం ఏమాత్రం ఆలస్యంచెయ్యకుండా తలచుకొన్నపనిని పూర్తిచెయ్యటం మంచిది.

సాధువు:- నీవు చాలా సమర్థుడివి. నీవింత సమర్థుడవు కాకపోతే ఇంద్రజాలం నీ చేతిలో నేభిన్నఛిన్నామౌతుందని పెద్దలు ఎందుకు చెప్పివుంటారు. సరే నడు.

సాయంకాలమయ్యేసరికి ఇద్దరూ ఒక కొండదిగువ భాగానికి చేరుకొన్నారు. సాధువు శంఖాన్ని ఊదాడు. కొద్ది సేపటిలో నలుదిక్కులనుండీ వందలకొలది దారిదోపిడీగాండ్రు చేతిలో బల్లాలు పుచ్చుకొని రాసాగరు. తూర్పుదిక్కుగా ఒక యిరవైమంది మనుష్యులను వెంటబెట్టుకొని శివదత్తమహారాజు రావటం కన్పించింది. అతనిని ఇంద్రజీతసింహుడు చూడటంతోనే ఇలా అనుకొన్నాడు. "ఇతనిని నేను గుర్తుపట్టగలిగాను. ఇతడే శివదత్తమహారాజు. ఇతని చిత్రపటం నాగదిలో

కొని స్వయంగా 'చునార్‌గఢ్'కి వెళ్ళి అడవిలో దొరికే వస్తుసామగ్రులను అమ్ముకొని డబ్బు చేసుకోసాగారు. శివదత్తుడు కూడా బాగా స్థిరపడిపోయినాడు. 'బాకర్ ఆలీ' మొదలైన ఇంద్రజాలికులు తమవెంట ఉన్నవారిని మాయాజాలంలో తర్ఫీదు యిచ్చారు. ఈ మధ్యకాలంలో శివదత్తుని ఒకకుమారుడు ఒక కొమార్తె జన్మించారు. శివదత్తుడు తనవర్గంవారితో కలసి వీరేంద్రసింహునిపై దెబ్బతీయ్యాలని చాలాకాలనుంచీ వేచి ఉన్నాడు.

ఇంద్రజీతసింహుడు బంధితుడైన తర్వాత కృత్రిమ సింహాలు తమతమ నిజస్వరూపాలను ప్రకటించాయి. ఆ సింహాకృతులు ఇంద్రజాలికులే వారిలో 'యార్ ఆలీ', 'బాకర్ ఆలీ', 'ఖుదాబక్ష్' ముఖ్యులు. శివదత్తమహారాజు తనకు అదృష్టకాలం సమీపించిందని సంతసించసాగాడు.

ఇంద్రజీతసింహుని బంధించి 'శివదత్తగఢ్'నికి తీసుకొని పోయారు. ఇంద్రజీతసింహుడు నిశ్చలంగా ప్రశాంతంగా ఉండటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. అతని కంటివెంట ఒక కన్నీటి బొట్టుకూడా రాలలేదు.

## 3

చునారగఢ్ కోటలోని ఒక గదిలో సురేంద్రసింహుడూ, వీరేంద్రసింహుడూ, జీతసింహుడూ, తేజసింహుడూ కూర్చొని నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు.

జీతసింహుడు:— భైరవసింహుడు ఇంద్రజీతసింహుని వేషం వేసుకొని శివదత్తుని ఇంద్రజాలికులను చిత్రంగా మోసగించాడు.

సురేంద్ర:- శివదత్తుని మాయావులు తెలివిగానే ప్రవర్తించారు గాని...

ఇంద్ర:- ఏదియేమైనా ఇప్పుడు భైరవసింహుని విడిపించే మార్గం వెదకాలి.

జీత:- రాజకుమారా! భయపడకు! నీ మిత్రుడికి ఎటువంటి ప్రమాదమూ జరగబోదు. ఇప్పుడతను శివదత్తునిదగ్గర బందీగా ఉండటమే మంచిది. అతనేమీ తెలివితక్కువవాడు కాదు. ఎవరి సహాయంలేకుండానే అతడు బైటపడగలడు. అయినా మన పన్నాలాలూ, రామ్‌నారాయణా, చున్నీలాలూ, బదరీనాథుడూ, జ్యోతిషికుడూ అతనికి సహాయులుగా వెళ్ళనే వెళ్ళారు. ఇన్నాళ్ళనుంచి ఆగి శివదత్తుడు తిరిగి తన దుశ్చేష్టితాన్ని బైటపెడుతున్నాడు. ఏమి జరుగుతుందో చూదాం.

దేవ:- రాజకుమారులవెంట వెళ్ళిన సైన్యాన్ని ఇప్పుడేం చేద్దాం?

జీత:- ఇప్పుడు సైన్యాలను అక్కడినుంచీ తరలించటం మంచిది కాదు.

తేజ:- అవును వేటాడే అడవిలో డేరా ఆ విధంగానే ఉంచటంవల్ల మనం బలేతమాషా చేయవచ్చు.

సురేంద్రుడు:- శివదత్తగడంనుంచీ మన ఐంద్రజాలికు డెవరైనా తిరిగివస్తే బాగుండును.

తేజ:- ఎల్లుండికి బహుశః ఎవరైనా రావచ్చును.

నాటికి సమాలోచనలు సమాప్తమయినాయి.

గంగానదిఒడ్డున ఎత్తైనభవనంలో ఇంద్రజిత్‌సింహుడూ ఆనందసింహుడూ కూర్చుని నదీజలాల రామణీయకం అవలోకిస్తున్నారు. అది వర్షాకాలం, గంగానది వరదలతోనిండి కోటదరులను ఒరుసుకొంటూ ప్రవహిస్తోంది. చిన్నచిన్న తరంగాలు కోటగోడలను ఢీకొంటున్నాయి. అస్తమయసూర్యుని ఎఱ్ఱదనం గంగానదీజలాల తరంగాలకు ద్విగుణీకృత సౌందర్యాన్నిస్తున్నది. ఆ భవనంలో సోదరులిరువురు తప్ప ఎవరూ లేరు.

ఇంద్ర:- ఇప్పుడు నీళ్ళు యింకా పెరగవచ్చు.

ఆనంద:- అవును. నిరుడు గంగ యీ యేటికంటె ఎక్కువగా పొంగింది. అప్పుడు మనల్ని తాతగారు ఈదుకుంటూ అవతలిగట్టుకు వెళ్ళమన్నారు కూడా.

ఇంద్ర:-ఆరోజు బలేతమాషా అయింది. భైరవసింహుడు అందరికంటే వేగంగా ఈదాడు. బదరీనాథుడు అతనికంటె ముందువెళ్ళాలని చూచాడుగాని వెళ్ళలేకపోయాడు.

ఆనంద:- మనమిద్దరం ఒకక్రోసెడుదూరం మన వెంట వచ్చినబోటు రక్షణవెంట వెళ్ళాం.

ఇంద్ర:- అదే మన ఆఖరిపరీక్ష అయింది. తిరిగి అందరం కలిసి ఈతకొట్టే అవకాశం దొరకకుండా పోయింది.

ఆనంద:- నిన్న నేను తాతగారితో గంగానది నిండుగా వస్తోంది. ఈతకొట్టటానికి అనుమతించవలసినదని అడిగాను.

ఇంద్ర:- అందుకాయన యేమన్నాడు ?

ఆనందు:- ఇప్పుడు మీరు ఈతకొట్టకూడదు. అందరూ నవ్విపోతారు. మీరు ఈతకొట్టటంలో ప్రవీణులయ్యారు గనుక

ఇంకా ఈదవలసినపనిలేదు. కావలిస్తే బోటుమీాద షికారుకు వెళ్ళండని అన్నాడు.

ఇంద్ర:- ఆయన నిజమే చెప్పాడు. నిజంగా మనం బోటుమీాద షికారుకు వెడదాం. మనకు రక్షణగా ఇతరులను తీసుకువెళ్ళవలసిన అవసరంకూడా లేదు.

ఇంతలో నగలవర్తకు డొకడు వచ్చాడని తెలిసింది.

ఆనందు:- ఇది ఈసమయంలోనా?

కావలావాడు:- నేను అతన్ని ఇప్పుడు రానీదలచుకో లేదు. కాని అతడు చిన్ననాటినుండీ ఈ ప్రభుత్వానికి విశ్వాసపాత్రుడు. అతనంటే మహారాజుకుకూడా చాలాఇష్టం. రెండవది ఎనభైసంవత్సరాల వృద్ధుడు. మూడవది అతనికి మొట్టమొదట మహారాజును దర్శించి ఆ తర్వాత ప్రభుత్వంవారితోకూడా కలిసి ఊళ్లో మకాంవెయ్యటం అనాదినుంచి ఒక ఆచారమట. అందుచేత అతనిరాకవిషయం మీాకు తెలియజెప్పక తప్పదు.

ఇంద్ర:- అలా అయితే అతన్ని రానీయుటమే మంచిది.

ఆనందు:- అయితే ఇవాళ పడవమీాద పయనం పడదేమో?

ఇంద్ర:- పోనీలే, రేపు వెడదాం.

కావలావాడు వ్యాపారస్తుణి తీసుకొనివచ్చాడు. నిజాని కతడు చాలా ముసలివాడు. ఆతనిముఖంలో కృతజ్ఞతాభావం తొణికిసలాడుతున్నది. రావటంతోనే రాజకుమారులకు నమస్కరించి వారికి ఫ్రుంగరాలను బహూకరించాడు. రాజకుమారులు ఆజ్ఞాపించినమీాదట అతడు నేలపై కూర్చున్నాడు. రాజకుమారులు ఆ ముసలి నగలవర్తకుని కుశలసమాచారాలు

అడిగి తెలుసుకొని అతనిని జేరాలోనికి వెళ్ళవలసిందిగా చెప్పి తిరిగి మరునాడురమ్మని కోరారు. వ్యాపారస్థుడు వెళ్ళి పోయాడు.

ఆ వర్తకుడు బహూకరించిన ఉంగరాలలో ఆనంద సింహుని ఉంగరంలో నీలిరంగు వజ్రం పొదిగారు. ఇంద్రజీతుని ఉంగరంలో ఒకచిన్నబొమ్మ పొదిగారు. ఆ బొమ్మను ఇంద్ర జీతుడు పరానంగా పరికించాడు.

నాటిరాత్రి ఏకాంతంగా అతను దీపపువెలుగులో ఉంగ రాన్ని చూచాడు. అందులో పాముపడగ ఉండేచోటున ఒక మందస్మితవదనారవిందయైన నవయౌవనాంగి చిత్రపటం పొదిగి ఉన్నది. కావటానికి ఆ బొమ్మ చిన్నదైనా కంసాలి, దానిని అతినిపుణత్వంలో తయారుచేశాడు. ఇంద్రజీతుడు ఆ బొమ్మను చూచినకొద్దీ తన్నుతాను మర్చిపోసాగాడు. ఎవరో నవమోహనాంగి స్వయంగా అతనిఎదుట కూర్చొన్నట్లు భావిం చుకోసాగాడు. ఆమె ఏదో చెప్పబోతున్నట్లున్నదిగాని సిగ్గు దొంతరలతో వివశురాలైనట్లు కన్పించసాగింది. అతను వెంటనే ఇంద్రజీతుడు తన మూర్ఖత్వానికి విస్మయంచెందసాగాడు. కాని ఆ చిత్రం ఒక్కసారిగా అతన్ని బాల్యదశనుండి యౌవనదశ లోనికి విసరివేసింది. అతనిఎదుట శూన్యంలో నవమోహనా కారం ఒకటి లీలగా సాక్షాత్కరించసాగింది. క్షణకాలం ముందున్న వేటా ఈతా మొదలుగాగల విభిన్నసమస్యల డోలాందోళన త్రుటిపాటులో మటుమాయమై ఆ స్థానంలో ఒకానొక అమూల్యవస్తువును చేరుకోవాలనే ఆతురత ప్రతిష్ఠాపిత మైంది. అతనికి శివదత్తుని మాయాజాలచేష్టలగురించి గాని

భైరవసింహుని విడుదల విషయాన్ని గురించిగాని శివదత్తగర్వాన్ని బదరీనాథ వగైరా మాయావులు ఏమిచేయగలరనే దానిని గురించిగాని, వేటనుగురించిగాని ఒకేఒక్క దెబ్బతో సింహాన్ని నేలకూల్చే విషయాన్నిగురించిగానీ ఆలోచనే లేదు. అతని కిప్పుడు వర్తకునిచేతికి ఈ ఉంగరం ఏ విధంగా వచ్చిందా? అనే ఆలోచనే ఎక్కువైంది. నిజానికి ఈ ప్రపంచంలో ఈ చిత్రం లోని స్త్రీవంటి మూర్తి ఉన్నదా? లేక ఊహాచిత్రమా? అని ఆలోచించుకోసాగాడు. ఈ బొమ్మలో పొదిగిన సౌంద ర్యానికి మించి వేరుసౌందర్యం ఒకటున్నదా? అనే సంశయం కూడా అతనికి కలిగింది. అటువంటి సౌందర్యరాశి ప్రేమను చూరగొనగలిగేది ఎట్లా?

యువరాజు ఇంద్రజిత్‌సింహుడు అప్పటికప్పుడే ఏవో వంకలుపెట్టటంకూడా నేర్చుకున్నాడు. కడుపునిండుగా ఉన్నది; భోజనం చెయ్యననీ, తలనొప్పిగా ఉన్నది; ఎవరితోనూ మాట్లాడనని మొదలైన వంకలుపెట్టి ఆ రాత్రి అంతా నిద్ర మంచంమీద దొర్లసాగాడు. ఉదయం కావటంతోనే నగల వర్తకుణ్ణి పిలచి ఏమైనా కొన్నిప్రశ్నలడిగి తెలుసుకోవాలను కున్నాడు. ఉదయాన భటుణ్ణి పంపి వర్తకునికి కబురంపించాడు. కాని అతడు మకాములో లేడని తెలిసింది. బహుశః మరెక్క డైనా ఉన్నాడేమోనని ఎన్నోచోట్లకు పంపి ఆరాతీసాడు. ఇంతలో ఆనందుడువచ్చి "ఇంకా మీరు స్నానం చెయ్య లేదా?" అని అడిగాడు.

ఇంద్ర:- ఇవ్వేళ కొంచం ఆలస్యమైంది.

ఆనందు:- ఆరోగ్యంకూడా బాగా లేనట్లుంది.

ఇంద్ర:- రాత్రిఅంతా తలనొప్పి తెగ బాధించింది.

ఆనంద:- ఇప్పుడెట్లా ఉన్నది ?

ఇంద్ర:- కొద్దిగా మేలే.

ఆనంద:- నిన్న మీ కిచ్చిన ఉంగరంలో ఏదో బొమ్మ ఉందనుకున్నాను.

ఇంద్ర:- అవును,

ఆనంద.- అ బొమ్మ ఎట్లాంటిది ?

ఇంద్ర:- నేనుకూడా సరిగా చూడలేదు. ఉదయాన చూదామని ఉంగరాన్నొక ట్రంకులో పెట్టాను. కన్పించకుండా ఉన్నది.

అంతకుమించి ఇంద్రజీతసింహుడు రహస్యం బయటపడి పోయే పనులేమీ చేయలేదు. చేసేదిలేక నాటికి తాతగారితో భోజనాదులు ముగించక తప్పలేదు. సాయంకాలానికి అతని వివశత్వం మరీ హెచ్చయింది. ఆ నగలవర్తకుడు ఎంత వెది కినా కన్పించలేదు. అతడు మహారాజుతోకూడా కలసివచ్చా నని చెప్పినమాట కూడా అబద్ధమైంది నిజానికి అతడెవరినీ కలవలేదు.

మూడవవాడు ఉదాసీనుడై కూర్చున్న ఇంద్రజేత సింహుణ్ణి ఆనందసింహుడు బలవంతంచేసి నౌకావిహారానికి తీసి కొనిపోయాడు.

వారెక్కిన నౌక చాలా అందమైనది. ప్రవాహవేగంలో రివ్వున పోయేనావలో ఇంద్రజీతసింహుడు సోదరునితో కలిసి కూర్చున్నాడు. వారివెంట వీరేంద్రసింహుని నాటినుంచీ ఆ రాజవంశంలో పిల్లలను కాపాడుతూవచ్చిన ముసలివాడొకడు

పడవ ఎక్క బోయాడు. సోదరులిద్దరూ అతనిని నివారించ బోయారుగాని మొండిపట్టుదలతో అతడు వారివెంట ఎక్కాడు. ఇంకా రెండుగంటలు పూర్తి వీ ప్రొద్దున్నది. అయినా వారు వెన్నెలరాత్రిలో కూడా విహరించాలనే ఉద్దేశంతో ఆలస్యమవు తుందనే జంకుకూడా లేకుండా ఆవలిబడ్డుకుకూడా వెళ్ళాడు.

చునార్ గఢం పశ్చిమదిక్కుగా రెండుకోసులదూరాన గంగానదిఒడ్డున ఒక చిన్న అడవి ఉన్నది. అడవిని సమీపించే సరికి వారికి మురళీరవంతో కలసి పాటపాడుతున్న శబ్దం విన బడింది. సంగీతం విచిత్రమైంది. దానినిగురించి తెలియనివారిని సయితం దానిపై ఆకర్షణ కలుగకమానదు. జంతువులు సైతం సంగీతం విని తమ్ముతాము మరచిపోతాయి. రెండుమూడు రోజులనుండీఇంద్రజీతసింహునిమనస్సు వికలమైఉన్నది.అందుచేత విహారంలోని ఆనందోత్సాహాన్ని అతడు అనుభవించలేకపోతు న్నాడు సరిగదా పైపెచ్చు తన్నుతానే మరచిపోయివున్నాడు. అతడు ఊహాప్రపంచంలో చిత్రపటంలోని ఊహాసుందరిని గూర్చి తీయనికలలుగంటూ నతవడనుడై ఉన్నాడు. మధుర మైన ఆ సంగీతతరంగాలు అతనిపరధ్యానస్థితిని భంగపరచాయి. అతను ఆ దిక్కుగా తలతిప్పాడు.

తీరప్రాంతంలో ఎంతగా దృష్టిని సారించినా అతనికి మురళిని వాయించి వారెవరో కన్పించలేదు. కాని వారు అతి సమీపాన ఉన్నారనిమాత్రం గ్రహించి సంతసించాడు. ఆ సంగీతం శ్రోతలను పరవశులను చేస్తున్నది.

ఇంద్ర :—ఆహా ! ఎటువంటి మృదుమధుర ధ్వని ?

ఆనంద :- ఎవరో పాడుతున్నారుకూడా. బహుశా స్త్రీ గొంతులా విన్పిస్తోంది.

ఇంద్ర :- వీళ్ళెవరో తమ సంగీత కార్యకలాపాలకు చాలా మంచిప్రదేశాన్నే ఎన్నుకున్నారు. పోయిచూద్దాం. పద.

కాని, వారివెంటఉన్న సంరక్షకుడు వారిని ఆటంకపరిచాడు. అయితే సోదరు లతనిమాట చెవినిపెట్టలేదు. పడవను ఒడ్డుకుచేర్చి సోదరులిద్దరూ ఆ ధ్వనివచ్చే దిక్కుగా వెళ్ళారు. అడవిలో కొద్ది దూరము వెళ్ళిన తర్వాత వారికి పదివది హేను మంది యువతీయువకులు గుంపుగా కూర్చుండి ఉండటం కన్పించింది. వారు రంగురంగుల దుస్తులు, విలువైన భూషణాలు ధరించి చెట్లకు ఊయలలువేసి ఊగుతూ పాడుతూ ఆనంద సముద్రంలో నిమగ్నులై ఉన్నారు. కొందరు మురళిని మరి కొందరు మృదంగాన్ని వాయిస్తున్నారు. ఇంకా కొందరు చేతితో తాళాన్ని వేస్తూ సంగీత రసవాహినులను జాలువారుస్తున్నారు. ఆ గుంపులోని ఒకే ఒక స్త్రీ గంగానదికి అభిముఖంగా కూర్చుని ఉన్నది. ఆమె తనసంగీతంతో భగవంతుణ్ణే మైమరపించి తన అందాన్ని ద్విగుణీకృతంచేసుకోవాలని అభిలషిస్తున్నట్లు కన్పిస్తున్నది. ఆ సుందరి ఆ రాజపుత్రులను చూచి పారిపోయింది.

ఆనంద :- అన్నయ్యా వారు పారిపోయారే ?

ఇంద్ర :- ఎక్కడికి వెళ్లారో చూడు.

ఆనందుడు వెళ్లాడు. అక్కడ ఒంటరిగా కూర్చున్న యువతిని ఇంద్రజీతసింహుడు గుర్తించాడు. ఆమె ఉంగరంలో పొదిగిఉన్న చిత్రపటంలోని సుందరీరత్నమే! అతడు ఎవరిని

గురించి ఆలోచిస్తున్నాడో, పరితపిస్తున్నాడో, ఆమె అతనికి సునాయాసంగానే గోచరించింది.

వెదకటానికి వెళ్ళిన ఆనందునికి ఎవరిజాడా కన్పించ లేదు. చివరికి చేసేదిలేక తిరిగివచ్చాడు. అతనికి సోదరుడుగాని ఒంటరిగాకూర్చున్న స్త్రీగాని కన్పించలేదు. అతడు భయ భ్రాంతుడై గట్టిగా అరిచాడు. అప్పటికి రాత్రిఅయింది. ఒక వేళ పడవదగ్గరకు వెళ్లాడేమోనని అక్కడికి వెళ్లాడు. అక్కడ ముసలివాడుతప్ప ఎవరూ లేరు. అతనికిభయం మరీ అధిక మైంది. సంరక్షకునికి జరిగినసంగతంతా చెప్పాడు. "నేను నా అన్న దొరకనంతవరకూ ఇంటికి రాను. నీవు తిరిగి వెళ్ళి యీ సంగతిఅంతా మనవాళ్ళకు చెప్పు" అన్నాడు.

సంరక్షకుడు ఎంత బ్రతిమాలినా ఆనందుడు తిరిగి ఇంటికి వెళ్ళటానికి అంగీకరించలేదు. సంరక్షకుడు చేసేదిలేక ఇంటికి మరలిపోయాడు.

## 4

ఆ వృద్ధుడు కోటలో ప్రవేశించి ఆనందసింహ, ఇంద్ర జీతసింహుల వృత్తాంతాన్ని వీరేంద్రసింహునికి ఎరిగించాడు. ఆ వార్త పిడుగుపాటుగా మహారాజును సంక్షోభపరచింది. అప్పటికి ఒక జాము ప్రొద్దుపోయింది. తండ్రినీ, జీతసింహుణ్ణి, తేజసింహుణ్ణి, దేవీసింహుణ్ణి పిలిచి వీరేంద్రుడు జరిగిన సంగతి చెప్పాడు.

తేజ :- ఆఅడవిలో ఆవిధంగా జరగటం ఆశ్చర్యంకాదు.

సురేంద్ర :- ఈ పనికూడా బహుశః శివదత్తునిద్వారానే జరిగి ఉంటుంది.

వీరేంద్రుడు:- పిల్లలిద్దరూ బలహీనులు మాత్రంకాదు.

సురేంద్రుడు:- అయినా ఆనందుడు అక్కడే ఉండిపోవటం అంతమంచిదిగా కన్పించటంలేదు.

తేజ:-ముసలివాడు మొండిగా వాళ్ళవెంట వెళ్ళకపోయినట్లయితే కనీసం రాకుమారు లేమైపోయినదీ కూడా తెలియకుండా ఉండేది. మీరు నా కిప్పుడు ఒకవేయిమంది సైనికులను ఒప్పగించండి. నేనిప్పుడు వెంటనే వెళ్ళి ఆ అడవి నలుదిక్కులా ముట్టడిస్తాను.

సురేంద్రుడు మీ అభిప్రాయమేమిటి ? అని జీతసింహుణ్ణి అడిగాడు. జీతసింహుడు తేజసింహుని అభిప్రాయాన్ని బలపరిచాడు. తేజసింహుడు వెంటనే కోటగుమ్మంపై ఎక్కి నగారా మోగించాడు. ఆ ధ్వని విని సేనాపతి వెయ్యిమంది సైనికుల్ని సంసిద్ధపరచాడు. తేజసింహుడు తనసామానులతో కోటవెలుపలికివచ్చి సైన్యంతో కలసి దివిటీలుపట్టుకొని ఆ అడవికి చేరుకొన్నాడు. కొద్దికొద్దిదూరంలో ఒకొక్కసైనికుణ్ణి నిలబెట్టి మొత్తం అడవిని ముట్టడించాడు. ఇంద్రజీతుడుకానీ ఆనందసింహుడుకానీ వారికి కన్పించలేదు. వారికి వెతకటంతోనే రాత్రి గడచిపోయింది. తెల్లవారిన తర్వాత తేజసింహుడు అడవిమొత్తాన్ని నరికివెయ్యవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ సమయానికి సురేంద్రసింహుడు జీతసింహునితో కలసి అక్కడకు వచ్చాడు. అడవిని నరికివేయటం వారికికూడా ఇష్టమైంది. సమస్తసైన్యం కార్యదక్షత అడవిని నరికివేయటంలో నిమగ్న

మైపోయింది. మధ్యాహ్నమయ్యేసరికి అడవి పూర్తిగా నాశన మైనది. కాని ఏమీ జాడ కన్పించలేదు. చివరికి ఇంద్రజీతుని తోబాటు ఆనందుడుకూడా అపహృతుడైనాడని నిశ్చయ మైంది. కాని ఆ అడవిలో ఖరీదైన దుస్తులు ధరించిన అంద మైన స్త్రీశవం ఒకటి కన్పించింది. కాని ఆ శవానికి తలమాత్రం లేదు. భటులు ఆ శవాన్ని సురేంద్రసింహునివద్దకు తెచ్చారు. అందరూ పరిపరివిధాల ఆలోచించసాగారు. చివరికి ఆ శవాన్ని తీసుకొని పట్టణానికి బయలుదేరినా జీతసింహుడు తేజసింహు నితో "మేము వెళ్ళుతున్నాం. తారాసింహుణ్ణి పంపి 'శివ దత్తగఢ'లో ఉన్న మన ఇంద్రజాలికులకు ఈ వార్త అందిస్తాం. నీవు మాత్రం ఏది సంభవించినా సరే ఆ విధంగా రాకుమారు లను వెదుకు" అని చెప్పాడు.

తేజసింహుడు తన సామానులతో సంసిద్ధుడై ఉన్నాడు. కనుక తత్క్షణం ప్రయాణమైపోయాడు. మిగతావారు శోక సంతప్తహృదయాలతో పట్టణాభిముఖులైపోయారు. కుమారు లిద్దరూ అపహృతులైనారనే వార్త చంద్రకాంతకు కూడా తెలిసింది. సుఖదుఃఖాలను అనుభవించినవ్యక్తి గనుక ఆమె తన గుండెను దిటవుపరచుకోగలిగింది. చంద్రకాంతపై గాఢాను రాగం గల చపలా చంపా రాకుమారులను ఏ విధంగానైనా వెదికిపట్టుకోవాలని నిశ్చయించుకొన్నారు.

సురేంద్రసింహుడు దేవసింహుణ్ణి పిలిచి అడవిలో జరిగిన సంగతిఅంతా చెప్పాడు. దేవీసింహుడు అడవిలో దొరికిన శవాన్ని తెప్పించమని అడిగాడు. మహారాజు ఆ ప్రకారం శవాన్ని తేవలసిందిగా భటులను ఆజ్ఞాపించాడు. కాని భటులు

తిరిగివచ్చి శవం పోయిందని చెప్పారు. నెయ్యిగుంది సైన్యంలో నుంచి శవం కన్పించకుండాపోవటం అందరినీ ఆశ్చర్యపరచింది. వీరేంద్రుడు "తిరిగి మనం అత్యంత జాగరూకతతో ఉండవలసిన సమయం అసన్నమైంది" అని హెచ్చరించాడు.

"అయ్యో శేషజీవితాన్ని విశ్రాంతిగా గడుపుకొందామంటే వీలుగాకుండా వచ్చింది" అని వాపోయాడు జీతసింహుడు.

సురేంద్రసింహుడు కర్తవ్యాన్నిగురించి జీతసింహుణ్ణి అడిగాడు. అతడు తన అభిప్రాయాన్ని రేపు చెపుతానని వాయిదా వేశాడు.

# 5

బదరీనాథపండితుడూ, పన్నాలాలూ రామనారాయణ జగన్నాథపండితుడూ, కలిసి భైరవసింహుణ్ణి వెదకటానికి శివదత్తగఢంవైపు వెళ్లారు. కాంచనసింహసేనాపతిని సింహాలసాధువు రహస్యం తెలుసుకోటానికి నియోగించారు. అతడు గూఢచారులను సింహాలసాధువును అన్వేషించటానికి పంపాడు. భైరవసింహుడు శివదత్తగఢ కోటలో చిక్కిఉన్నాడు. ఐంద్రజాలికులందరూ శివదత్తగడానికి వెళ్ళి మారువేషాలు వేసుకొని తిరగసాగారు. ఐదుగురూ ఎవరికి వారు విడివిడిగా పట్టణంలో తిరుగుతూ చివరికి ఫలానాచోట కలుసుకోవాలని నిశ్చయించుకొన్నారు.

ఆ పగలంతా తిరిగితిరిగి పట్టణం వెలుపలఉన్న ఒక పర్వతంమీద వారు సమావేశమయినారు. ఆరాత్రి అంతా కార్యక్రమాన్ని సిద్ధంచేసుకోటంలోనే గడచిపోయింది. మరు

నాడు మారువేషాలతో తిరిగి పట్టణంలో ప్రవేశించారు. రామనారాయణా, చున్నీలాలూ భైరవసింహుణ్ని ఖైదుచేసిన చోట కాపలా ఉన్న భటుల వేషంలో తయారయినారు. భైరవ సింహుడు తన మా మహాలు సౌధంలో ఒకగదిలో బందితుడై ఉన్నాడు. ఆ గదికి నాలుగువైపులా గోడలున్నాయి. ఒకవైపున ఇనుపకటకటాలు బిగించిఉన్నాయి. ఆ గదికిప్రక్కగానే మరో గది ఉన్నది. ఆ గదిలో ఒక ముసలివాడు పీఠంవేసుకొని ఉన్నాడు. బైట అనేకమంది భటులు కరవాలాలు చేతిలో పట్టుకొని పహారాయిస్తున్నారు. రామనారాయణ చున్నీలాలులు ఆ గదిద్వారందగ్గరకు వెళ్ళి నిలబడి ముసలికాపలా వాడితో మాట్లాడటం ఆరంభించారు.

రాము :— నిన్ను మహారాజు అడిగాడయ్యా.

ముసలి :— రండి లోపలికి రండి. ఏం పనుందబ్బా.

రామనారాయణ చున్నీలాల్ గదిలోకి వెళ్లారు.

రాము :— ఎందుకు పిలిచాడో తెలియదుగాని చాలా త్వరగా రమ్మన్నాడు.

ముసలి :— ఒక గంట కిందట మహారాజు స్వయంగా ఇక్కడకు వస్తున్నాడని ఎవరో చెప్పారు. అయితే అమాట అబద్ధం అన్నమాట.

రాము :— నిజమే! వచ్చేవాడేగాని ఇప్పుడు రాడు.

ముసలి :— సరే! మీరిద్దరూ ఖైదీని జాగ్రత్తగా చూస్తూఉండండి. నేను వెళ్ళివస్తాను.

రామనారాయణ చున్నీలాలులను గదిలో కూర్చుండ బెట్టి ముసలివాడు బైటకువచ్చి గభాలున వాకిలిమూసి

వేశాడు. "నేను మీ యిద్దర్నీ ఐంద్రజాలికులని గుర్తించాను లెండి. అయిందా మీ పని. ఎట్లా తెలుసుకున్నానో చూచారా? మహారాజు నన్ను రమ్మని కబురంపించినారన్నప్పుడే అనుమాన పడ్డాను. ఇప్పుడైనా నేనెవరో తెలుసుకున్నారా? నేను బాఖరాలీని. మీ సంగతి తెలుసుకొని నా తడాఖా చూపించాలని ఇక్కడ కూర్చున్నాను" అన్నాడు.

ముసలివానిమాటలకు బంధకృతులైన ఐంద్రజాలికులు సిగ్గుపడ్డారు. ముసలివాడు అక్కడనుంచి వెళ్ళిపోయి శివదత్త మహారాజుకు తాను ఐంద్రజాలికులను బంధించినవైనాన్ని తెలియజేశాడు. శివదత్తుడు బాఖరాలీ చాతుర్యానికి సంతసించి రామనారాయణను చున్నీలాలులను చూడటానికి వచ్చాడు.

బదరీనాథుడూ పన్నాలాలూ జ్యోతిషికుడు తమ సహచరులిద్దరు బంధితులయినసంగతి తెలుసుకొన్నారు. మొత్తం ముగ్గుర్నీ కలిపి విడిపించాలని ఆలోచించసాగాడు.

కొద్దిగా ప్రొద్దుపోయింది. ఐంద్రజాలికులు ముగ్గురూ పట్టణం వెలుపలభాగానికి పోతున్నారు. వారివెనుక నల్లని గుడ్డలు ధరించి ముఖాన ముసుగు వేసుకొన్న ఒకవ్యక్తి వారి దగ్గరకు వచ్చాడు. అక్కడ అతడు ఒక చిన్న కాగితం పడవేసి తనవెంట రావలసిందిగా వారిని సంజ్ఞ చేస్తూ ముందుకు నడిచాడు.

బదరీనాథుడు ఆ కాగితాన్ని తీసుకొన్నాడు. అక్కడే ఒక చిన్నదుకాణంలో వెలుగుతున్న దీపందగ్గరకు వెళ్ళి చదివాడు. దానిలో 'భైరవసింహుడు' అని ఉదాహరించిఉన్నది. బదరీనాథునికి భైరవసింహుడు విడుదలఅయినట్లు రుజువైంది.

అతనికి భైరవసింహుని చేతివ్రాత బాగా తెలుసు. భైరవ సింహుడు వారిని తమ వెంటరమ్మని పిలుస్తూ పదివన్నెండడుగులు ముందుకు వేసి అక్కడ ఆగాడు.

బదరీనాథుడు మొదలైన ఐంద్రజాలికులు సంతోషంతో ఆ దిక్కుగా వెళ్ళారు. అక్కడ భైరవసింహుడు నల్లనిగుడ్డలతో శరీరాన్ని కప్పుకుని గోడప్రక్కగా నిలబడివున్నాడు. వారికి మాట్లాడుకోటానికి వీలు లేక పోయింది. అక్కడనుండి భైరవసింహుడు ముందుగానూ వెనుక వెనుకను మిగతావారు నడుస్తూ పట్టణానికి మరికొంతదూరం వెళ్ళారు.

అది చీకటిరాత్రి. విశాలమైన ఒక ప్రదేశంలోకి వెళ్ళి భైరవసింహుడు తాను నల్లనిదుస్తులను వదలివేశాడు. అతన్ని ముగ్గురు గుర్తుపట్టగలిగారు. సంతోషంతో అతనిని కౌగిలించుకొని నలుగురూ ఒక గోతిమీద కూర్చుని మాటాడసాగారు.

బదరీనాథుడు:— భైరవసింహా నిన్ను చూస్తే మాకు చాలా సంతోషమైంది.

భైరవసింహుడు:—నేను ఏదోఒకవిధంగా బైటపడ్డాను గాని మనవాళ్ళిద్దరూ అనవసరంగా వెళ్ళి చిక్కుకున్నారు.

జ్యోతిష్కుడు :—రామనారాయణా, చున్నీలాలు అంత తెలివితక్కువగా వెళ్ళి చిక్కుకొన్నారేమిటి.

భైరవసింహుడు :- అయిందేదో అయింది వాళ్ళనిప్పుడు విడుదలచేయటానికి ప్రయత్నంచేస్తున్నాను.

పన్నాలాల్ :- ఏ విధంగా ?

భైరవసింహుడు :—ఆ సంగతిఅంతా యీ రాత్రికి తీరు

బడిగా చెప్పకొందాంగాని ముందుగాకు ఆకలితీరే మార్గం చూడండి.

బదరీనాథుడు :—రెండు మూటడు రొట్టెలున్నాయి. తింటే తిను.''

భైరవసింహుడు :—అవేమూలకుగానీ, ముందు దాహం అవుతుంది. మంచినీళ్ళు ఎక్కడ దొరుకుతాయి.

బదరీ :— ఎక్కడ దొరుకుతాయో !

భైరవ :— (చేయెత్తి చూపుతూ) అదిగో అక్కడ దీపం వెలుగుతోంది చూడండి ! అది హల్వా అంగడి. అక్కడ తాజా తాజాపూరీలుకూడా చేస్తారు. అక్కడ నీళ్లు తప్పకుండా దొరుకుతాయి.

పన్నాలాల్ :— అయితే నేను వెడతాను.

భైరవసింహుడు:— ఎందుకులే. అందరంకలిసే వెడదాం నిన్నెవ్వడైనా పట్టుకుంటే మళ్లా మేం వెదకవలసివస్తుంది.

పన్నాలాల్ :— పట్టుకోవటం అంటే ఆటలా ఏమిటి ?

భైరవ:— నీ వెనక మేము వస్తే. మాత్రం నష్టం ఏముంది. మేము దూరంగా నిలబడతాం. నీవు దుకాణంలోనికి వెళుదువుగాని.

బదరీనాథుడు:— అవును నిజమే. మనమంతా కలిసి వెళ్ళటమే మంచిది.

నలుగురూ పట్టణం వెలుపలఉన్న ఆ హల్వాదుకాణంవద్దకు వెళ్లారు. బదరీనాథుడూ, జ్యోతిషికుడూ, భైరవసింహుడూ దూరంగా నిలబడ్డారు. పన్నాలాల్ దుకాణంలోకివెళ్లాడు. అతడు దుకాణంలోనికి వెళ్ళటానికి ముందు భైరవసింహుడు

"ముందుగా నీళ్ళిచ్చే ఏర్పాటు చేసుకోలేకపోతే తర్వాత వాడు పేచీ పెడతాడు" అన్నాడు.

పన్నాలాల్ దుకాణంలోనికి వెళ్ళి రెండు సేర్ల పూరీలు ఒక సేరు మిఠాయి అడిగాడు. దుకాణదారుడు "నీళ్లు కావాలా?" అని అడిగాడు.

పన్నాలాల్:- అవును తప్పక కావాలి.

దుకాణదారుడు:- అయితే పాత్రయేది?

పన్నాలాల్:- ఉన్నదిగాని చాలా చిన్నది. నీవే ఏదైనా ఒకటి చూచి యివ్వు!

దుకాణదారు:- ఒక కడి వెడు నీళ్ళకు అదనంగా పైకం ఇవ్వవలసి ఉంటుంది.

పన్నాలాల్:- చాలా గిరాకీగా ఉన్నదే! సరే యివ్వు.

పూరీలు మిఠాయి ఒక కడి వెడునీళ్ళు తీసుకొని ఐంద్రజాలికులు నలుగురూ అచ్చటినుంచి వెళ్ళారు. కాని వాళ్ళకి వెనుకనే దుకాణదారుడు ఇద్దరు మనుష్యులను తీసుకొని రహస్యంగా వస్తున్న సంగతి వాళ్ళకు తెలియదు. ఒక విశాలప్రదేశంలో ఊతిమీద కూర్చొని నలుగురూ ఫలహారంచేసి ఏదో మాట్లాడుతూ కూర్చున్నారు. ఒక అరగంట గడచినమీదట నలుగురూ స్పృహ తప్పిపడిపోయారు. దుకాణదారుని వెంట వచ్చిన యిద్దరు మనుష్యులూ బదరీనాథుణ్ణి, జ్యోతిషికుణ్ణి పన్నాలాలుని గట్టిగా మూటకట్టారు. భైరవసింహునికిమాత్రం ఒక మందువాసన చూపించి స్పృహ తెప్పించారు. అతనితో "భలే

వని చేశావోయ్ సింహుడా. నీకు శివదత్తమహారాజువద్ద పెద్ద బహుమానం పొందే యోగం పట్టింది" అన్నారు వాళ్ళిద్దరూ.

# 6

అనేక కష్టాలుపడి చివరకు శాంతి లభించిందనుకుంటే నేడు తిరిగి సురేంద్రసింహుని సంతతికి కష్టకాలం దాపురించింది. నిజానికి సుఖదుఃఖాలు రెండూ పరస్పరం అనుసరిస్తూనే ఉంటాయి. చునారగఢంలో సురేంద్రసింహుడు వీరేంద్రుడు జీతసింహుడూ మొదలైనవారంతా చింతాక్రాంతులై కూర్చుని ఉన్నారు. అంతా నిశ్శబ్దం. అప్పటివఅకూ వాళ్ళేమిమాట్లాడు కున్నారో తెలియదు గాని సురేంద్రసింహుడు మాత్రం "చంపా చపలులు చెప్పేమాటలు వినటమే మంచిది" అని నిశ్శబ్దాన్ని భంగపరిచాడు.

జీత:- మీా యిష్టం. కాని దేవీసింహుణ్ణి ఏం చెయ్య మంటారు.

సురేంద్ర:- వేరే ఏమీా చెయ్యవలసిన అవసరం లేదు. ఎవరేది చేసినా యిప్పుడు చునారగఢాన్ని సంరక్షించే పని మాత్రం చెయ్యాలి.

జీత:- ఇక్కడ తారాసింహుడు ఒక్కడు చాలు. అవ సరమైతే ఈ ముసలితనంలో నేనుకూడా చేయగలిగింది చేస్తాను.

సురేంద్ర:- (కొద్దిగా చిరునవ్వునవ్వి) సరే మీాయిష్టం అన్నాడు. దేవీసింహునితో జీతసింహుడు "ఏమండోయ్ ఇక మీారుకూడా నడుం కట్టవలసినసమయం వచ్చింది. ఏం చేస్తారో

మటి" అని అనటంతో దేవసింహుడు దిగ్గున లేచి జీతసింహునికి నమస్కరించి బైటికి వచ్చేశాడు.

# 7

ఇంద్రజీతసింహుడు కనిపించకపోయేసరికిఆనందసింహుడు అతివ్యాకులచిత్తుడై ఆ అడవిని గడచి ఒక విశాలప్రదేశంలో నలుదిక్కులూచూస్తూ నిలబడిఉన్నాడు. అతనికి పడమటి దిక్కుగా ఇద్దరు స్త్రీలు గుఱ్ఱాలపై ఎక్కి వెళుతూఉండటం కన్పించింది. అతడు అతివేగంగా ఆ దిక్కుగా వెళ్ళాడు. రెండు కోసులదూరం వెళ్ళినతర్వాత ఆ స్త్రీలిద్దరూ ఒక పర్వతసమీప స్థలంచేరి వెనుదిరిగి చూచారు. వాళ్ళకు ఆనందసింహుడు కన్పించటంవల్ల అతివేగంగా గుఱ్ఱాలను అదలించి మాయమై పోయారు.

ఆనందసింహుడు చేసేదిలేక అక్కడే నిలబడి ఆలోచించ సాగాడు. ఇంతలో చంద్రుడుకూడా అస్తమించాడు. కటిక చీకటులు అలముకొన్నాయి. అతనికి మిక్కిలి దుఃఖం కలిగింది. ఏమి చేయటానికీ పాలుపోలేదు.

దూరాన చిన్న వెలుతురు కన్పించింది. పరీక్షించిచూడగా అది ఒక కుటీరం ముందు చలిమంట అని తెలిసింది. ఆనంద సింహుడు ఆ కుటీరందగ్గరకు వెళ్ళాడు. ఆ మంటదగ్గర పది మంది తివాచీ పరచుకొని కూర్చున్నారు. వాళ్ళు చూడ టానికి మహమ్మదీయులవలె కన్పిస్తున్నారు. అందులో ఒకడు పారసీక కవిత్వం ఉద్వేగపూరితంగా చదివి విన్పిస్తున్నారు.

ఒకపక్క ఇద్దరు . ముగ్గురు మనుష్యులు వంటలుచేస్తున్నారు. ఆనందుడు తివాచీదగ్గరకువెళ్ళి నిలబడ్డాడు.

ఆనందునిచూచి అక్కడివారంతా లేచి నిలబడి గౌరవ పూర్వకంగా తివాచీమీద కూర్చుండబెట్టారు. పారసీక కవిత్వం చదువుతున్నవాడు "చునార్‌గఢ యువరాజు దేవునిదయవల్ల మా దగ్గరకువచ్చి మమ్మల్ని కృతార్థులను చేశాడు. ఈ అడవిలో తమవంటివారిని ఎలా గౌరవించగలం ?" అన్నాడు.

ఆనందుని యెదుట ఏలకులను, అత్తరులనూ పెట్టారు. ఆనందుడు ఆ అత్తరు సువాసనచూచి ఏలకులను నోట్లో వేసుకొన్నాడు తిరిగి కవితాపఠనం ప్రారంభమైంది. మరొకడు ఆనందునికి ఇరువైపులా మెత్తనిదిండ్లు పెట్టాడు. ఆనందుడు కొద్దిసేపటిలో స్పృహ తప్పిపడిపోయాడు.

మరునాడు మధ్యాహ్నం కళ్ళుతెరచేసరికి ఆనందుడు తాను ఎక్కడో ఒకయింట్లోపడిఉన్నట్లు తెలుసుకొన్నాడు. అతనికయ్యకు దోమతెర ఉన్నది. అతను త్రుళ్ళిపడిలేచి అటూ యిటూ చూచాడు.

యౌవనవతులైన ఐదుగురు అందగత్తెలు అతనికి ఎదురుగా నిలబడిఉండటం కన్పించింది. వారిలో ఒక జవరాలు నాయకురాలివలె ముందుకువచ్చి నిలబడిఉన్నది. ఆమె దివ్యమోహనాకారం ఆనందునికి పరవశత్వం కలిగించింది. ఆమె చేతులు జోడించి ఆనందుని సమీపించి "మీకు నాపై కోపమా?" అన్నది. ఆనందునికి అన్నగారు కానరాకపోవటంగాని తాను ఐంద్రజాలికులచేత చిక్కిన సంగతిగాని మరచిపోయి ఆమెను తనదగ్గరకు తీసుకొన్నాడు.

ఆమె పానుపుమీదకూర్చుండి ఆనందుని మెడకు చేతులు చుట్టి "భగవంతునిసాక్షిగా ఒక సంవత్సరంనుంచీ నాకు మీపై ప్రేమ జనించింది. ఆ నాటినుంచీ నిద్రాహారాలుమాని మిమ్మల్నే ధ్యానిస్తూఉన్నాను" అన్నది.

ఆనందుడు ఉలిక్కిపడి "నీవుయవన యువతివా? దేవు నిపై ఒట్టుపెట్టుకొంటున్నావు" అన్నాడు.

ఆమె:- అవును మహమ్మదీయులు దుష్టులా ?

ఆనందసింహుడు లేచి నిలబడి "నీవు మహమ్మదీయ యువతివి కాకపోయినట్లయితే మనఃపూర్వకంగా నిన్ను స్వీక రించేవాడిని. కాని ఒక ఆడదానికోసం నేను నా మతాన్ని వొదులుకోలేను" అని అన్నాడు.

ఆమె:- నన్ను కాదనకండి. ఇక నేను మిమ్మల్ని విడిచి బ్రతకలేను.

ఆనంద:- నాపై నీవు ఏమాత్రం ఆశపెట్టుకోవద్దు.

ఆమె:-హృదయపూర్వకంగానే ఆమాటలంటున్నారా?

ఆనంద:- ప్రమాణపూర్తిగా.

ఆమె:- చివరకు పశ్చాత్తాపపడతారు. మీరిక్కడనుంచి వెళ్ళలేరు.

"నన్నెవరాపుతారో చూస్తాను" అని ఆనందసింహుడు ఆ గదిబైటికివచ్చాడు, ఆమెకూడా గదిబైటకు వచ్చింది. ఆనంద సింహునికి అక్కడనుండి బైటికి వెళ్ళటానికి మార్గం దొరక లేదు. ఆ యిల్లు అంత పెద్దదికూడా కాదు. ఒకగదీ మరొక వసారా తప్ప ఇంకేమీలేదు. నలుదిక్కులా ఎత్తైనగోడ లున్నాయి. ఆనందుడు చేసేదిలేక తిరిగి తనమంచంమీదికి వచ్చి

శయనించి ఆలోచించసాగాడు. అతనికి మహమ్మదీయకన్యతో ప్రేమకలాపం బొత్తిగా ఏహ్యమనిపించింది. మార్గాంతరం లేక నడుములో కత్తికొరకు వెదికాడు. కత్తిలేదు. ఆ వగలంతా వివశుడై ఆ గదిలో కూర్చుండిపోయాడు.

అప్పుడే చీకటిపడబోతున్నది. చిన్నకిటికీ తెరచుకొని నలుగురుస్త్రీలతో కలసి ఆమె తిరిగివచ్చింది. వారందరూ అతనికి భోజనపదార్థాలు తీసుకొనివచ్చారు. ఆనందసింహుడు తటాలున మంచంనుండిలేచి వారువచ్చిన కిటికీలో దూరబోయాడు. బైటికి వెళ్లాడు గాని అంతా కటికచీకటి. ఆ గదికి నాలుగువైపులా తిరిగాడు. కాని త్రోవ కన్పించలేదు. ఒకవైపున మూసినవాకిలి ఉన్నదిగాని దాన్ని తెరవలేక తిరిగి గదిలో ప్రవేశించాడు.

ఆమె నవ్వి "నన్నువిడిచి పోలేరని నేను ముందే చెప్పాను. ఆ భగవంతుడు మిమ్మల్ని నాకోసమే పుట్టించాడు. మీరు నామాట విన అనవసరంగా ప్రాణాలుపోగొట్టుకోవటం మంచిది కాదు ఆలోచనలుమాని భోజనంచెయ్యండి.

ఆనంద:- నీవు ముట్టుకొన్నవి నేను తినటమా?

ఆమె:- ఎందుకు తినకూడదూ? మనలనందరినీ ఆ భగవంతుడొక్కడే పుట్టించాడు. ఒక తండ్రి బిడ్డలమైన మనలో మనకు అంటుదోషమెందుకు!

ఆనంద:- మనలనేకాదు. ఆ భగవంతుడు అనేక జంతుజాలాలనుకూడా సృష్టించాడు. అయితే వాటికీ మనకూ భేదంలేదా?

ఆమె:_సరే మీయిష్టం. వినకపోతే మీరే చెడిపోతారు.

భోజనపదార్థాలూ దీపమూ అక్కడపెట్టి స్త్రీలందరూ వెళ్ళిపోయారు. ఆమెమాత్రం కిటికీలోనికి కాలు వ్రేలాడవేసి కూర్చుండి అతనివంక చూడసాగింది. అతడు ఆమె వెళ్ళేదారినే పోవాలని సంసిద్ధుడై ఉన్నాడు.

ఆమె "పోనీ మీ వెనుకనున్న హిందూయువతిని పెండ్లాడతారా?" అన్నది. అతడు వెనుకకు తిరిగిచూచాడు. ఇంతలో ఆమె కిటికీదాటి తలుపు మూసికొనిపోయింది. ఆనందసింహుడు ఆమెచేసిన మోసానికి సిగ్గుపడి మంచంమీద కూలబడ్డాడు. అతనికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. తన ఎదుటనే ఉన్న తినుబండారాలను ముట్టుకోనైనా ముట్టుకోలేదు. ఒక రాత్రివేళ ఇంటికప్పుపైనుండి ఎవరో క్రిందికి దూకినట్లు విన్పించింది. ఆనందుడు బైటికిచూచాడు. అతనికి ఒక వ్యక్తి ఎదురుగా రావటం కన్పించింది. అతనివయస్సు దాదాపు నలభై సంవత్సరాలు ఉంటుంది. ఆ నూతనుడు యోధవేషంలో ఉన్నాడు. ముఖాన పంగనామాలు పెట్టుకొనిఉన్నాడు. బొడ్లో చురకత్తి ఉన్నది. త్రాటిచుట్టా ప్రయాణపుసంచీ వ్రేలాడుతున్నాయి. చేతిలో పాలునిండిన చెంబు పట్టుకొని ఆనందసింహునికి ఎదురుగా నిలబడి అతడు "అయ్యో! మీరు రాజకుమారులై ఉండికూడా ఇంద్రజాలికులూ, బంటులూ చేయవలసిన పనిచెయ్యవచ్చునా? దాని ఫలితంగానే మీరు ఈ రాక్షసిచేతిలో చిక్కుకొన్నారు. నేను మీమిత్రుణ్ణి" అన్నాడు.

ఆ యోధుణ్ణిచూచి ఆనందసింహుడు ఆ సమయాన తనకు సహాయపడటానికి యెవరు వచ్చారా అని ఆశ్చర్యపడసాగాడు. ఎవరైనప్పటికీ మొత్తంమీద అతడు తనమిత్రుడనే

భావించి "ఇక్కడకు నేను రెండుదినాలక్రిందట వచ్చాను" అన్నాడు.

యోధుడు:- భోజన మేమైనా చేశారా?

ఆనంద:- లేదు.

యోధు:- అయ్యో! వీరేంద్రసింహుని పుత్రునికి ఎంత కష్టం వచ్చింది. ఇదిగో మీకు భోజనపదార్థాలు పెడతాను.

ఆనంద:- మొదట నేను మీ రేమతానికి చెందినవారో తెలుసుకోవాలి.

యోధు:- రామరామ. నేను మిమ్మల్ని మోసగించి మతభ్రష్టుల్ని చేస్తానా? మీరు అనుమానిస్తారని నాకు మొదటే తెలిసి మీ మతానికి భిన్నంకాని పదార్థాలే మీకు తినటానికి తెచ్చాను. బైటకు రండి. ఆనందుడు అతనితో బైటికి వెళ్ళాడు. యోధుడు చెంబుక్రిందపెట్టి సంచిలోనుంచి మిఠాయీలు తీసి "ఇవిగో పీటిని తిని పాలుత్రాగండి" అన్నాడు. వాటినిచూచి ఆనందునికి ప్రాణం లేచివచ్చింది. అప్పటికే అతనికి ఆకలిదప్పులతో ప్రాణం తేలిపోతున్నది. అటువంటి సమయంలో ఆహారపదార్థాలు లభ్యంకావటంతోనే పట్టరానిసంతోషంతో అతను వాటిని ఆరగించాడు. ఆ యోధుణ్ని ఏవిధంగానైనా తనను బైటికి తీసుకొని వెళ్ళవలసిందని అర్థించాడు.

యోధు:- నేను మిమ్మల్ని బైటికితీసుకొని వెడతాను కానీ, నాకు మీ రేమిస్తారు.

ఆనంద:- నీవు కోరిందిస్తాను

యోధు:- ఇప్పుడు మీ దగ్గర ఉన్నవాటిలో ఏమియిస్తారు?

ఆనంద:— ఇప్పుడైనా నా శరీరంమీంద వేల విలువచేసే నగలున్నాయి.

యోధు:— నాకవన్నీ అవసరం లేదు.

ఆనంద:— మరేం కావాలి ?

యోధు:— మిమ్మల్ని బంధించిన ఆ ఆడదాని నగలు కావాలి. ఆ పిదప ఒక వెయ్యివరహాలుకూడా కావాలి.

ఆనంద:— అదెట్లా సాధ్యం ?

యోధుడు:— ఆమెనడిగి తీసుకోండి !

ఆనంద:— నే నడిగితే యిస్తుందా ?

యోధు:— మీరడిగితే ఆమె ప్రాణాలుకూడా ఇస్తుంది.

ఆనంద:— అయితే నన్ను ఇవ్వేళ ఇక్కడనుంచి వదలి పెట్టవా?

యోధు:— లేదు. మీరేమీ భయపడకుండా ఇక్కడే వుండండి. ఆమె రేపువచ్చిన తర్వాత ఆమె నగలూ వెయ్యి వరహాలూ ఇస్తే ప్రేమిస్తాననండి. ఆమె తప్పకుండా ఇస్తుంది. ఆ తర్వాత ఆమెను రెండురోజులతర్వాత కలవమనండి.

ఆనంద:— సరే నీవు చెప్పినట్లే చేస్తాను.

యోధు:— మీరు నేను చెప్పినట్లు చెయ్యకపోతే విడిచి పెట్టను

ఆనంద:— ఆమె మూడునాల్గురోజులు రాకపోతే ?

యోధు:— అంతవరకు నేను మీకు ఆహారపానీయాలు అందిస్తుంటాను.

ఆనంద:— సరే అయితే.

ఆ యోధుడు త్రాటిచుట్ట విసిరి ఇంటిపైకి ఎక్కాడు. అక్కడనుంచే గోడదూకి బైటికి వెళ్ళిపోయాడు. అప్పటికింకా కొద్దిగా రాత్రి మిగిలిఉంది. ఆనందునికి తనకు సహాయపడటానికి వచ్చినవాడెవడో బొత్తిగా అర్థంకాలేదు. ఆ వచ్చినవాని ధనాశచూస్తే అతడెవడో మాయావిగా కన్పిస్తున్నాడు. అతడెవరైనా అతడు చెప్పినట్లు చేయటానికి ఆనందుడు సంసిద్ధుడయినాడు. తెల్లవారింది. ఆ స్త్రీలు తిరిగి అక్కడకువచ్చారు. వారు పెట్టిన ఆహారపదార్థాలు ఎక్కడివక్కడ ఉన్నాయి. ఆనందుడు మంచంమీాద పడుకొని ఉన్నాడు.

ఆమె:- మొండిపట్టుదలతో తిండి తినకుండా ప్రాణత్యాగం చేయదలచుకొన్నారా ?

ఆనంద:- ఆఁ! కాని-ఒకపద్ధతిమీాదైతే వీలుంటుందేమో చూస్తాను.

ఆమె:- (సంతోషంతో)మీారు చెప్పినట్లు చెయ్యటానికి సంసిద్ధురాలిని.

ఆనంద:-నీ శరీరంమీాద నగలతోబాటు వెయ్యివరహాలు తెచ్చి యివ్వు!

ఆమె సంతోషపూర్వకంగా "ఇవిగో తీసుకో" అంది. ఆ వెంటనే యిద్దరుపరిచారికలను వెయ్యివరహాలు తేవటానికి పంపించింది. కొద్దిసేపటిలో వారు వెయ్యివరహాలు తెచ్చారు.

ఆమె:- ఇవిగో తీసుకోండి. ఇప్పుడైనా నాపై దయగలిగిందా ?

ఆనంద:- ఒకరోజు ఆగు. రేపు ఈవేళకువస్తే నేను నీ వాడనై పోతాను.

ఆమె:- ఇదేమి షరతు! ఇవాళకూడా తిండి తినకపోతే మీ గతి యేమవుతుందో తెలుసా?

ఆనంద:- నీవా భయమేమీ పెట్టుకోవద్దు. నాకు రోజుల తరబడి ఉపవాసాలుండటం అలవాటు.

'సరే'నని ఆమె అక్కడినుండి వెళ్ళిపోయింది. ఒకగంట గడచినమీదట ఆనందుడు లేచి గదిబైటకువెళ్ళి అటూఇటూ వెదకసాగాడు. బైటగోడలకు చిన్నచిన్న అలమరాలున్నాయి. అతడు బహుశః వీనిగుండా బైటికివెళ్ళవచ్చు అనుకున్నాడు. ఆ పగలంతా ఏదోవిధంగా గడిపాడు. ఆ రాత్రికి తిరిగి యోధుడు పాలు మిఠాయితీసుకొని వచ్చాడు.

ఆనంద:- మీ కోరిక నెరవేగింది.

యోధుడు:- అయితే మీరు బైటికివెళతారన్నమాట. ఒకరోజు కష్టపడితే నా కింత ఆదాయం కలిగింది. యోధుడు నగలనూ వరహాలను మూటగట్టుకొని త్రాటిచుట్ట ఆధారంగా తానూ ఆనందునితో బైటికి వెళ్ళిపోయారు.

విశాలమైదానంలోని చల్లనివాయువులను పీల్చిన మీదట ఆనందునికి ప్రాణం లేచివచ్చినట్లయింది. బైటనుంచీ ఆ యింటినిచూస్తే అది ఒకకొండలో కట్టినట్లుఅర్థమైంది. ఆ యింటికి ఇరువైపులా సొరంగాలు కన్పించాయి.

ఆనందసింహుని తీసుకొని యోధుడు రెండుగుఱ్ఱాలను చెట్లకు కట్టినచోటుకు వచ్చి "మీ రొక గుఱ్ఱాన్ని ఎక్కండి. నేను మరో గుఱ్ఱాన్ని ఎక్కుతాను. మిమ్మల్ని ఇల్లు చేర్పిస్తాను"

ఆనంద:- ఇక్కడికి చునారగఢం ఎంత దూరం?

యోధు:- చునారగఢం ఇక్కడనుంచి యిరవైకోసు

లుంది. మనం తెల్లవారేసరికి అక్కడికి వెళతాం. మీరు ఇంద్ర జీతసింహునిగూర్చి విచారించవద్దు. అతడుకూడా త్వరలోనే వస్తాడు. మీ ఐంద్రజాలికులు ఇప్పుడు అన్వేషణలో మునిగి ఉన్నారు.

ఆనంద:- ఈ గుఱ్ఱాలెక్కడివి?

యోధు:- ఎక్కడో దొంగిలించి తెచ్చాను.

ఆనంద:- అదిసరేగాని నీ పేరేమిటి?

యోధు:- ఆ సంగతి నేనిప్పుడు చెప్పను.

ఆనంద:- సరే. ఇష్టంలేకపోతే చెప్పవద్దు.

ఇద్దరూ గుఱ్ఱాలపై వేగంగా పోతున్నారు. ఎదురుగా మబ్బురంగుదుస్తుః తో ఎవరో రావటం కన్పించింది. ఇద్దరూ చెట్లచాటుకు పోయారు. ఆతడు వారిని చూడకుండానే ముందుకుపోయాడు అతడేదో లోలోన గొణుక్కుంటున్నాడు. ఆ గొణుగులాటలో "ఇప్పుడు నా హృదయం చల్లబడింది. ఇక నేను ఇంటికివెళ్ళి హాయిగా నిద్రపోతాను. ఆ శవాన్ని కాకులూ గద్దలూ నిన్నటి దినమంతా తినివేసి ఉంటాయి. నన్ను వాళ్ళు స్త్రీ అనుకున్నారు. వాళ్ళకు నాసంగతి తెలియదు" అని అనుకుంటున్నాడు.

ఆనందసింహుడూ యోధుడూ అతనిని పరీక్షగా చూచారు. వారికి ఆవ్యక్తి స్త్రీయని తెలిసింది. ఆమె చూస్తూ చూస్తునే మాయమైపోయింది.

యోధు:-ఈమె యెవరో హంతకురాలులాగా ఉన్నది.

ఆనంద:-అదికూడా. ఈ దగ్గరలోనే ఇక్కడ జరిగినట్లుంది. వెదికితే కన్పించవచ్చు. ఇద్దరూ అటూఇటూ వెదకసాగారు.చాలా

సేవటికి వారికి తన్నుకొంటున్న మనుష్యకళేబరం ఒకటి కన్పిం చింది. యోధుడు సంచిలోనుంచీ క్రొవ్వువత్తితీసి వెలిగించాడు. అతన్ని ఎవరో కత్తితో గాయపరచినట్లు కన్పించింది. నెత్తురు ప్రవహిస్తున్నది ఆ మానవుడు ఇంకా మాట్లాడాలని ప్రయత్ని స్తున్నాడు. గాని మాటలు పెగిలిరావటంలేదు. యోధుడు సంచిలోనుంచి ఒకసీసా తీశాడు. అందులో ఏదో ద్రవం ఉన్నది. ఆ ద్రవాన్ని గాయపడినవాని నోట్లోవేశాడు. అది గొంతులో దిగేసరికి అతనికి మాట్లాడేశక్తి వచ్చింది. అతడు అతికష్టంమీాద "అయ్యో...ఈ అందమైన దయ్యం...తేజ సింహుని...ప్రాణం...అయ్యో! ఇంద్రజీతసింహుడు......!" అన్నాడు. ఆ మరణోన్ముఖ వ్యక్తినుంచి వచ్చిన మాటలు ఇద్దర్నీ అతిసంక్షోభ పరచాయి. ఆనందసింహునికంటే ఎక్కు వగా యోధుడు బాధపడసాగాడు.

యోధు:— రాజకుమారా మీారిక యింటికి వెళ్ళండి. ఇతని నోటినుంచి వచ్చినమాటలవల్ల ఇంద్రజీతసింహునితో బాటు మహా ఐంద్రజాలికమణి తేజసింహుడుకూడా ప్రమా దంలో చిక్కుకొన్నట్లు అర్థమవుతోంది. నేనిప్పుడు మనముందు నుంచీ వెళ్ళిన స్త్రీని వెదకటానికి వెడతాను. అది ముందు ముందు మనకు చాలాకష్టాలు తెచ్చేటట్టున్నది.

ఆనంద:— నీవు చెప్పింది నిజమే. కాని నేనుమాత్రం ఇంటికెట్లా వెళ్ళగలుగుతాను.

యోధు:— (కొంచెంసేపు ఆలోచించి) సరే మనం ఆల స్యం చెయ్యకూడదు. మీా దగ్గర ఆయుధంకూడా ఏమీాలేదు. ఇదిగో ఈ కత్తి మీాదగ్గర వుంచండి.

ఆనందసింహుడు ఆ కత్తిని నడుములో బిగించుకొన్నాడు. యోధునితో కలసి హత్యచేసి వెళ్ళిన ఆ స్త్రీ వెళ్ళినదిక్కుగా నడిచివెళ్లాడు. వాళ్ళిద్దరూ ఆమె వెళ్ళినత్రోవనే వెళ్లుతున్నారు. ఒక కోసెడుదూరం వెళ్ళినతర్వాత ఒకపర్వతం ఎక్కవలసి వచ్చింది. అక్కడ కొంచెంసేపు ఆగి నలుదిక్కులూచూచారు. వారికి నెమ్మదిగా ఒకగంట కొట్టిన శబ్దం విన్పించింది. ఆ గంట ఎక్కడో దగ్గర్లోనే గుహలో కొట్టినట్లుగా విన్పించింది. వారిద్దరూ గంటశబ్దం వచ్చినదిక్కుకు మరలారు. తిరిగి శబ్దం వచ్చింది. వారు ఒకగుహాముఖద్వారానికి వెళ్ళారు. ఆగుహ మార్గానికి ఎడమవైపుగా ఉన్నది. దానిలోనుంచే శబ్దం వినవచ్చింది. ఇద్దరూ నిర్భయంగా గుహలో ప్రవేశించారు. వారికి తిరిగి గంట కొట్టినశబ్దం వినిపించి, ఆ వెంటనే మెరుపులా వెలుతురు వచ్చింది. ఆ వెలుతురులో వారికి దారి సక్రమంగా కన్పించింది. ఆ వెలుతురులోనే దూరాన వారికి ఒక స్త్రీ కన్పించింది. ఆమె వెంటనే ఎడమవైపుకు తప్పుకొన్నది. అక్కడనుండి ఆ స్త్రీ ఒకగోతిలో దిగి ఇరుకైన త్రోవగుండా వెళ్లుతున్నది. వారిద్దరికీ ఆమె హత్యచేసివచ్చిన స్త్రీయే అని నిశ్చయం కలిగింది. వెలుతురుపోయినమీదట అతికష్టంమీద ఆనందుడూ, యోధుడూ ఆ గోతిదగ్గరకు వచ్చారు. ఆ గోతికి ఒకజాలి అడ్డంవేసిఉన్నది. ఆ జాలికి ఇరువైపులా సొరంగాలున్నాయి. వాటిగుండా ఆ గోతిలోని విశేషమంతా శ్రద్ధగా చూడవచ్చు.

ఇద్దరూ అక్కడ కూర్చుండి లోపలిదృశ్యాలను చూస్తున్నారు. అక్కడంతా వెలుతురు. ఎదురుగా జాలిమీద కూర్చున్న స్త్రీ ఇంకా ముసుగుతీయలేదు. ఆమె అలసిపోయి

నట్లు కన్పిస్తోంది. ఆమెకు పక్కగా మరొకయువతి చేతిలో కత్తి కొని నిలబడివున్నది. మరోకవైపున ఎవడో భూమిని త్రవ్వు తున్నాడు. వారికి మధ్యగా కప్పునుంచీ తలక్రిందులుగా ఒక శవం వ్రేలాడుతున్నది. మరొకవైపున మూలగా నీటితో నిండిన కుండా మరికొన్ని ఆహారపదార్థాలు ఉన్నాయి.

కొంతసేపైన తర్వాత ఆ స్త్రీ మునుగు తీసివేసింది. అరే! ఆమె ఎంత అందమైంది. గులాబి రేకులవంటి చెక్కిళ్లు. కోపోద్దీప్తమైన కండ్లు; ఆమె లేచి నిలబడి తనదగ్గరే నిలబడిన యువతి చేతిలో కత్తితీసుకొని వ్రేలాడుతున్న శవందగ్గ రకు వచ్చింది. ఆ కత్తిని ఆ శవం వెన్నున గట్టిగా గ్రుచ్చింది. వెన్నున పోటు తగలడంతోటే ఆ శవం ఇటు తిరిగింది. అప్పుడు ఆనందునికి మోఘునికీ ఇంకా ఆ వ్రేలాడుతున్న కళేబరంలో ప్రాణం పోలేదనీ చిత్రహింస జరుగుతున్నదనీ తెలిసింది. దెబ్బ తిన్న ఆ మనుష్యుడు గిలగిల కొట్టుకొంటున్నాడు. అతడు "నన్నెందుకు కష్టపెడతారు. నేనేమీ ఎరుగను" అంటున్నాడు.

హంతకురాలు:—'నీవు తప్పక చెప్పి తీరాలి. నీకు సంగ తులన్నీ తెలుసు' అని కత్తితో ఒకపోటు పొడిచి" "చెప్పు".

వ్రేలాడుతున్న మనుష్యుడు:— అయ్యో! ఒక్కసారే నన్నెందుకు చంపెయ్యకూడదు. నాకు ఎవరి సంగతీ తెలియదు.

హంత:— నీ కన్నీ తెలుసు. నీవు మోసగాడివి చెబు తావా లేదా? లేకపోతే నీ మాంసం ముక్కలుముక్కలుగా కోసి కాకులకూ గద్దలకూ వేస్తాను.

వ్రేలాడు:— అయ్యో! ఇంద్రజీతసింహుని మూలంగా నన్నెందుకు అవస్థపెడతారు.

ఇప్పటివరకూ ఆనందసింహుడు అతనివెంట వున్న యోధుడూ చాటుమాటునఉండి ఈ తమాషా చూస్తున్నారు. ఎప్పుడైతే ఆ వ్రేలాడుతున్న మనుష్యుడు ఇంద్రజీతసింహుని పేరెత్తాడో అప్పుడు వీరికి అమితమైనకోపం వచ్చింది. ఆతని తోలగించి ఇద్దరూ లోనికి ప్రవేశించారు. ఆనందసింహుడు ఆ స్త్రీకి ఎదురుగా నిలబడి "జాగ్రత్త! కత్తి తీసివెయ్యి" స్త్రీ "నీవిక్కడి కెందుకు వచ్చావు. ఈ తమాషా అయినా చూడు. నీ బెదిరింపులకు నేనేమీ భయపడేదాన్ని కూడా కాను."(యోధునితో)"నీ కళ్ళలో ఏం దుమ్ముకొట్టుకుంది. మీ వైద్యుణ్ణి గుర్తు పట్టలేక పోయావా" యోధుడు పరీక్షగా చూచి "నీ మాటలు విచిత్రంగా ఉన్నాయి" అన్నాడు.

హంతః- మీరిద్దరూ ఇచ్చటినుండి వెళ్ళిపొండి. నా పనికి మీరు ఆటంకం కలిగించవద్దు.

యోధుడు:-(ఆనందసింహునితో) "పదండి మనం వెళ్ళిపోదాం. వాళ్ళేమి చేసుకుంటే మనకెందుకు" అన్నాడు.

ఆనందసింహుడు మొలనుండి కత్తితీసి "నే నీ మనుష్యుణ్ణీ వీళ్ళబారినుండి విడిచిపెట్టకుండా ఇచ్చటినుండి కదలను."

ఆ స్త్రీ వికటంగా నవ్వి "అంత మొనగాడవా"అన్నది. వీరపురుషుని కడుపున పుట్టిన ఆనందసింహుడు ఒక ఆడదాని పరిహాసోక్తులను సహించలేక పోయాడు. అతడు తనకత్తితో ఆ మనుష్యుణ్ణీ వ్రేలాడగట్టిన త్రాటిని నరికివేశాడు. అతడు నేలపై పడిపోకుండా ఆదుకున్నాడు. యోధుడు "ఇదేమన్నా పిల్లతనం అనుకున్నావా?" అన్నాడు. అతని మాటలలో శత్రుత్వం తొణికిసలాడుతున్నది. ఆనందసింహుని వెంటవచ్చిన

యోధుడుకూడా చివరకు శత్రువుగానే మారిపోకూడదు. అక్కడ వున్న నలుగురూ ఆనందసింహుణ్ణి బంధించబోయారు. కాని ఆనందుడు వారిసందడిని దూరంగా విసిరికొట్టాడు. ఇంతలో బైటనుండి "ఆనందసింహా జాగ్రత్త నీ దుడుకుతనం ఆపుకోలేక పోతే శిక్షపొందుతావు" అని వినవచ్చింది. ఆనందుడు ఆధ్వని వచ్చినదిక్కుగా చూచాడు. అక్కడ ఒక యోగిని నిలబడి వుంది. ఆమె కాషాయవస్త్రాలు ధరించి నుదుట విభూతిని అలంకరించుకొని దక్షిణహస్తాన త్రిశూలాన్ని ధరించివున్నది. ఆమె యెడమచేతిలోవున్న అగ్నినుండివస్తున్న పొగలు దిక్కులా వ్యాపిస్తోంది. ఆమె అక్కడకువచ్చి చేరుకుంది. అందరూ ఆమెను ఆశ్చర్యచకితులై చూచారు. ఆమె చేతిలోని నిప్పులపైనుండివచ్చిన పొగ రెప్పపాటులో ఆ గుహాఅంతా వ్యాపించింది. అందరూ దానిని పీల్చి స్పృహదప్పి పడిపోయారు. ఆ యోగినిమాత్రం [illegible]గానే వుంది. ఆమె తనచేతిలోని అగ్నిని దగ్గరలో నేవున్న నీటిలో ఆర్పేసింది.

## 8

శివదత్తగడంలో శివదత్త మహారాజుకు ఒకకొడుకు ఒక కొమార్తె ఉన్నారని మీకు లోగడే తెలుసు. కుమారుని పేరు భీమసేనుడు. అతని వయస్సిప్పుడు పద్దెనిమిది సంవత్సరాలుంటుంది. కొమార్తె పేరు కిశోరి. ఆమెవయస్సు పదహారు సంవత్సరాలకంటే ఎక్కువ ఉండదు. కిశోరి శివదత్తగడంలో లేదు. శివదత్తమహారాజు కష్టాలలోనున్న కారణంగా ఆమెను మేనమామలఇంటికి పంపించాడు. భీమసేనుడుమాత్రం శివదత్త గడంలోనే ఉన్నాడు. అతనికి సైనికజీవితమంటే చాలాఇష్టం.

దానికి తగినట్లు అతనిశరీరంకూడా చాల బలిష్ఠమైనది. అతడు అనేకాయుధాలను ఉపయోగించటంతోబాటు రాజ్యపాలనా వ్యవహారాలుకూడా చక్కదిద్దగల నేర్పరి అయినాడు. భీమసేనునికి తన తండ్రిపద్ధతులు బొత్తిగా ఇష్టంలేదు. అయినప్పటికీ అతనిని తండ్రి చాలా ప్రేమించేవాడు.

ఒకనాడు భీమసేనుడు పదిమంది సఖులతో కలసి శివదత్త గడానికి దూరంగావున్న అడవికి వేటకై వెళ్ళాడు. ఆ అడవిలో అడవిపండ్లు విశేషంగా ఉన్నాయి. అతనికి గుఱ్ఱంపై స్వారి చేస్తూ బల్లెముతో అడవిపందులను వేటాడటమంటే ఎంతో సరదా.

అతడు అడవిపందులకోలకు అన్వేషణ ప్రారంభించాడు. ఒక బలిష్ఠమైన అడవిపంది భీమసేనుణ్ణి దూసుకొని తూర్పు దిక్కుగా పారిపోయింది. భీమసేనుడు దానిని విడిచిపెట్టక వెంటాడాడు. ఆ పంది అతనికి దొరకకుండా బహుదూరం ఒంటరిగా పారిపోయింది. అక్కడ భీమసేనునికిఎదురుగా ఒక స్త్రీ గుఱ్ఱముపై నెక్కి బల్లెం పట్టుకొని అడవిపందిని చంపటానికి సంసిద్ధురాలై నిలబడిఉన్నది. ఆపంది రమారమి భీమసేనునికీ ఆస్త్రీకి సమానదూరంలో వున్నది. అక్కడనుంచి ఎడమవైపుకి మరలి మొదటికంటే వేగంగా పారిపోయింది. భీమసేనుడూ ఆ స్త్రీ గుఱ్ఱాలపై ఆ పందిని వెంబడించారు. భీమసేనునికంటే ముందుగా ఆస్త్రీ బల్లెపుపోటుతో పందిని నేలకూల్చింది.

భీమసేనునికి తాను వేటాడదలచిన జంతువు ఒక ఆడదానిచేతిలో నేలకూలటం క్రోధకారణమైంది. ఆమెతో అతడు ఆ పందిని నీవెందుకు చంపావు!" అన్నాడు.

స్త్రీ:- దానిపైన నీపేరేమన్నా చెక్కావా?

భీమసేనుడు - ఇదినా అడవి. ఈఅడవిలో ఈపందిని నేనే తరుముకుంటూ వస్తున్నాను.

స్త్రీ:-ఓయబ్బో నీఅడవి! నీపంది! ఒకపందిని చంపటానికి మూడుకోసులదూరంపరుగెత్తుకొనివచ్చావు! సిగ్గుపడక ఇంకా కోపంకూడానా!

భీమసేనుడు:- ఆడదానివైపోయావు. అందులో అందగత్తెవు. లేకపోతే ఇవాళ నిన్నేంచేసేవాడినో?

స్త్రీ:- నేనుకూడా నీవు కుర్రవాడవని ఊరకున్నాను. లేకపోతే నీచెవులు మెలిపెట్టేదాన్ని.

భీమసేనుడు:-(పళ్లు నూరుతూ)జాగ్రత్త! నీపల్లదనాన్ని సహించను.

స్త్రీ:- ఊరుకోకపోతే ఉరిపెట్టుకో. నిన్నుచూచి ఇక్కడ భయపడేవాళ్ళెవరూ లేరు.

నిజానికామెముగ్ధమోహనసౌందర్యం చూపజనుసమ్మోహితులను చేస్తుంది. కానీ భీమసేనుడుమాత్రం శ్రుతిమించిన కోపంచేత ఆమెపై బల్లెంవిసిరాడు. ఆ స్త్రీ తెలివితేటలతో బల్లెపుపోటును డాలుతో అడ్డింది. ఆమె భీమసేనుణ్ణిచూచి నవ్వుతూ "ఇంకా ఏమైనా చెయ్యగలవా?" అన్నది.

కొన్నిగంటలపాటు ఇరువురిమధ్యా బల్లెములతో యుద్ధం జరిగింది. ఆ పోరాటంలో ఆ స్త్రీ చూపిన నైపుణ్యం అతి ప్రశంసాపాత్రమైనది. చివరికి ఆ స్త్రీ బల్లెపుపోటు భీమసేనునికి తగిలింది. ఆ బల్లెంచివర విషంపూసిఉండటంవల్ల అతడు స్పృహ తప్పి నేలపై కూలిపోయాడు.

# 9

భీమసేనుని సహచరులు తనమిత్రునికోసం అడవిఅంతా గాలించారు. చివరికి శివదత్తమహారాజుదగ్గరికివెళ్ళి తాముచూచి నంతవరకు వృత్తాంతాన్ని వివరించారు. శివదత్తునికి పుత్రుడు కన్పించకుండాపోవటం దుఃఖకారణమైంది. అతనివెంటవెళ్ళిన సహచరులను తిట్టిపోశాడు. చివరికి గూఢచారులకు కబురంపించి భీమసేనుణ్ణి వెదకవలసిందని ఆజ్ఞాపించాడు. ఐంద్రజాలికులు కూడా అన్ని ప్రయత్నాలతో భీమసేనునిజాడ తెలుసుకోవ డానికి ప్రయత్నించారు. మూడురోజులు గడచినా అతనిజాడ తెలియరాలేదు.

ఒకనాడు శివదత్తుడు పుత్రశోకాన ఒంటరిగా ఒకగదిలో కూర్చునివున్నాడు. ఇంతలో అక్కడికి ఒక విశ్వాసపాత్రుడైన వహరావాడు వచ్చాడు. అతడు శివదత్తునికి ఒక లేఖయిచ్చి "మన భటుడొకడు ఈ ఉత్తరాన్ని మీ కివ్వమని చెప్పాడు. అతని కీ లేఖను ఎవరో తెలియనివ్యక్తి యిచ్చాడట. మన భటుడు అతన్ని ఆపాలని చూచాడటగాని దొరకలేదట" అన్నాడు. శివదత్తుడు ఉత్తరాన్ని చూచాడు. అది భీమసేనుని చేతివ్రాతగా గుర్తించి సంతోషంతో చదవసాగాడు. అందులో:

"నన్నొకస్త్రీ తన పరాక్రమంవల్ల బంధితుణ్ణి చేసిందని మీరు తెలుసుకోని చాలా విచారించవచ్చు. అయినా నే నేమిచెయ్యను. ఈ వృత్తాంతాన్ని మీకు సమక్షంలో నే తెలియజేస్తాను. మీరు వీరేంద్రసింహుని ఐంద్రజాలికులనందరినీ

విడిచిపెట్టినప్పుడే నే నిక్కడ విడుదల అవుతాను. నన్ను మీరు అన్వేషించి ప్రయోజనంలేదు. నేను చాలా రహస్యమైనచోట చిక్కుపడ్డాను. మీ ప్రియపుత్రుడు,

భీమసేనుడు"

తనకుమారుడు ఒక స్త్రీచేతిలో చిక్కుఉన్నాడని తెలుసుకొని శివదత్తసింహుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. అతనికి అతికష్టంమీద పట్టుపడ్డ వీరేంద్రుని ఐంద్రజాలికులను విడిచిపెట్టటం బాధగానే ఉన్నది. అయినా ఏంచేస్తాడుపాపం!

శివదత్తమహారాజు శాఖరాలీ మాయాలినిపిల్చి ఉత్తరంలోని విశేషాలుచెప్పి వీరేంద్రుని ఐంద్రజాలికులను విడిచిపెట్టవలసిందిగా ఆజ్ఞాపించాడు.

శాఖరాలీ ఆశ్చర్యచకితుడై "ప్రభూ! మీరనేమాటలు నాకర్థంకావటంలేదు. మీకీ సంగతి ఎలా తెలిసింది!" అని అడిగాడు.

శివదత్తుడతనికి కుమారుని హస్తలిఖితలేఖను ఇచ్చాడు. శాఖరాలీ దానిని చదువుకొని బదరీనాథుడు మొదలైన ఐంద్రజాలికులను బంధించినచోటికి వెళ్ళి వారిని విడుదలచేశాడు. వారితో "నేటినుండీ మీతో మాకు శత్రుత్వంలేదు. మారాజుకీ మీ వీరేంద్రసింహునికీ మధ్య రాజీజరిగింది. మీ రిక మీ ఇండ్లకు వెళ్ళిపోండి" అన్నాడు.

బదరీనాథుడు :- చాలా సంతోషంగాని, మీ మాటలు నిజమైతే మా మాయాజాలపు సంచులూ చురకత్తులుకూడా దయచేయించండి.

బాఖరాలీ:- తప్పకుండా తీసికొనివెళ్ళండి. నేనే వాటిని తీసుకొనివస్తాను. అని తనవారితో కలసి వారి సామానులు తేవటానికి వెనక్కి తిరిగివెళ్ళాడు.

పన్నాలాల్:- ఏమిటన్నయ్యా! ఇవ్వేళ మనల్నివిడిచి పెట్టా రెందుచేత?

రామనారాయణ:- రాజీ జరిగిందని చెప్పేమాటలలో నాకేమీ నమ్మకం కలగటంలేదు.

చున్నాలాల్:- రాజీలేదు, గీజీలేదు. ఇదేదో మరో నాటకంలాగ కన్పిస్తోంది.

జ్యోతిష్కుడు:- శివదత్తుడు ఏమీ చెయ్యలేక మనల్ని విడిచిపెట్టేశాడు.

బదరీనాధుడు:- భైరవసింహులుగారూ! మీ అభిప్రాయ మేమిటి?

భైరవసింహుడు:- నాకు దీని వ్యవహారమంతా తెలిసి పోయింది.

బదరీనాథుడు:- ఏమి తెలిసిందో చెప్పవయ్యా?

భైరవసింహుడు:- మన ముఠావాళ్లెవరో బహుశఃవీరిలో గట్టివాణ్ణి పట్టుకొనిఉంటారు. శివదత్తుడికి మా ఐంద్రజాలికులను విడిస్తే మీ వాడిని విడుదలచేస్తామని కబురంపించి ఉంటారు. అందుకు మనమీద ఈ దయ.

బదరీనాథుడు:- బలేమాట చెప్పావయ్యా నిజంగా అంతే. బహుశః శివదత్తుని కొడుకునో కూతురునో మనవారు పట్టుకొనిఉండాలి. లేకపోతే ఈ మహానుభావుడు మనల్ని విడిచి పెడతాడా?

భైరవసింహుడు:— అవును. నీవు చెప్పిందే నిజం. సరేకాని మనమేదైనా దక్షిణ పుచ్చుకోకుండా తిన్నగా ఇంటికి వెళ్ళట మెందుకు?

బదరీనాథుడు:—ఏమినాటక మాడదామో చెప్పు.

భైరవసింహుడు నవ్వి "నేను నా కాళ్ళనొప్పివల్ల మూడుమాసాలదాకా చునారగడ్ వెళ్ళలేనని శివదత్తునితో ఖచ్చితంగా చెప్పివేస్తాను. గుఱ్ఱంమీద సవారి చాలా కష్టమం టాను. రెండెడ్ల బండి ఎక్కకూడదని నా వ్రతమని చెపుతాను. పల్లకీ వగైరాలు ఎవరో రోగులూం రాజులూ ఎక్కేవని వద్దం టాను. చివరికి ఏనుగుతప్ప నాకు సరైనవాహనం లేదని చెపు తాను. అదికూడా అంబారీలేకపోతే పనికిరాదంటాను. తేజ సింహుని పుత్రుడు వెండిబంగారాల అంబారీమీద తప్ప ఎక్కడన్న సంగతి మీకు తెలుసుకదా?"

చున్నాలాల్:— ఈ బాఖరాలీ నన్ను బలేమోసం చేశాడు. నా ప్రాణంపోయినా నేను ఇతనికి బదులుతీర్చుకోనిది వెళ్ళను.

చున్నాలాల్ మాటలకు అందరూ నవ్వుకున్నారు. ఇంతలో బాఖరాలీ వాళ్ళసామానులు తీసుకొని వచ్చాడు.

బాఖరాలీ:— తీసుకోండి సామానులూ మీ సంచులూ.

భైరవసింహుడు:— ఏమోయ్ ఏమీ కాజేయలేదు కదా? ఏదిపోయినా పోకపోయినా ముందు వరహాలున్నాయో లేవో చూచుకోవాలి.

బాఖరాలీ:— ఇంకా అదికూడానా!

భైరవసింహుడు:— ఇదిగో నిజంచెప్పు. నీ మాటలు

చూస్తే వరహాలు కాసినీ ఏరుకున్నట్లున్నావే (సూత్రాలతో) సంచులు చూసుకోండయ్యా ముందు.

పన్నాలాల్:- ఇంకా చూచేదేమిటి. మనం చునారగడ నుంచీ ఖర్చులకనీ ఒక్కొక్కళ్ళం వందవంద వరహాలు తెచ్చు కొన్నాం. అవి ఒక్కటికూడా ఖర్చుకాకుండా ఇంటులోనే ఉండాలి.

భైరవసింహుడు:- నాదగ్గర వరహాలు లేవుగానీ ఒక చిన్న నగకట్టు ఉండాలి. వీటినన్నింటినీ విడిచిపెట్టి చునారగడా నికి ఏముఖం పెట్టుకొని వెళ్ళేది.

బదరీనాథుడు:- బలే తమాషే. రాజులిద్దరూ రాజీ పడటం మనం లూటీకాదటమూనా? శివదత్తమహారాజుకు చెప్పుకొందాం పదండి. వింటే వింటాడు. లేకపోతే మన మెడకాయలు కోసుకొని ఇక్కడే చద్దాం.

బాఖరాలి వీరి తరహాకి బెదరిపోయాడు. అతడు వీరుచునారగడానికి ఎప్పుడు వెళతారా? భీమసేనుడు ఎప్పుడు తిరిగివస్తాడా? అని ఆలోచిస్తుంటే వీరు కదిలేటట్టు కన్పించటంలా అయినా బెదరించి చూదామని "ఇదిగో మీరు గోలచేశారంటే మళ్లీ ఖైదులో పడేస్తాం" అన్నాడు.

బదరీనాథుడు:- అవును బాబూ మేము అదే కోరు కుంటున్నాం.

పన్నాలాల్:- అవును ఖైదులోనే ఉంచు! మావరహా లన్నీ దోచుకున్నావుగా. ఎవరికీ తెలియకుండా ఉంటుంది.

భైరవసింహుడు:- నీ బెదరింపులు నీయింట్లోనయ్యా

పెద్దమానిసివైతే మావరహాలు మాకిచ్చివెయ్యి. లేకపోతే రాజు
గారివద్దకు వెళ్ళి చెప్పుకొంటాం.

బాఖరాలీ 'సరే పదండి' అని అంగీలేసి శివదత్త మహా
రాజువద్దకు తీసుకొనివెళ్ళాడు.

బాఖరాలీ:— మహారాజా! చూడండి! వీళ్ళు పోట్లాట
పెట్టుకుంటున్నారు.

భైరవసింహుడు:— మాసామానులు మేమడిగితే
పోట్లాటా?

శివదత్తుడు:— అసలు సంగతేమిటి?

భైరవసింహుడు:— నేను చెబుతాను వినండి ప్రభూ!
మీరూమీరూ రాజీఅయితే మమ్మల్ని విడిచిపెట్టేటప్పుడు
మాసామానులన్నీ మాకివ్వాలంటారా? వద్దంటారా?

శివదత్తుడు:— తప్పకుండా ఇవ్వాలి.

భైరవసింహుడు:— ఓహోహో ఏమిన్యాయం! ఏమి
న్యాయం! ఆ భగవంతుడు మిమ్మల్ని కాపాడాలి. వినండిరాజా.
మేము బాఖరాలీని సంచులూ చుట్టకత్తులూ ఇమ్మని అడిగితే
అతడు సంచుల్లోఉన్నరొక్కం కాస్తా కాజేసికూర్చున్నాడు.
ఏం న్యాయం చెబుతారో చెప్పండి.

శివదత్తుడు:— (బాఖరాలీతో) ఏమటయ్యా ఈగొడవ?

బాఖరాలీ:— అంతా అబద్ధం ప్రభూ!

భైరవసింహుడు:— ఇంతమందిమేము అబద్ధమాడేవాళ్ళ
మానూ. నీవు సత్యహరిశ్చంద్రుడివా?

శివదత్తుడు:- (భైరవసింహునితో) పోనీవయ్యా మీ కొక్కం నేనిస్తాను తీసుకుపొండి.

భైరవసింహుడు:- మహారాజా! వీరిలో ఒక్కొక్కరికి నూరునూరు వరహాలుండాలి. నాదిమాత్రం ఒక నగలమూట. ఇప్పుడు దాని లెక్కలన్నీ ఎందుకుగాని ఒక వెయ్యివరహా లియ్యండి. ఏంజేస్తాం. దానితోనే సంతృప్తి పడిపోతాం.

బాఖరాలీ:-ఏమయ్యోయ్! కొంపగుండంచేసేట్టున్నారే?"

భైరవ:- మేమా కొంపలుగుండం చేసేది? మాకో దమ్మిడీకూడా అవసరంలేదు లెండి. మేమే పోగొట్టుకొన్నాం అనుకుంటాం. చునార్‌గడ్ ముఖం మాత్రం చూడం.

శివదత్తుడు:- ఎందుకయ్యా యింతగొడవ చేస్తున్నావు? మీ సొమ్ము నేను మీ కిచ్చేస్తాను. తీసుకొండి. బాఖరాలీ నువ్వు మాట్లాడకు!

శివదత్తుని అదలింపుతో బాఖరాలీ ఊరుకున్నాడు. శివ దత్తుడు వెయ్యివరహాలు భైరవసింహునికి ఇప్పించాడు. ఆ వర హాలన్నీ ఐంద్రజాలికులు తమతమ సంచుల్లో పోసుకొన్నారు. వాళ్లు బైటికి పోతూపోతూ భీమసేనుడు పట్టుపడినసంగతి తెలుసుకొని పోయారు.

శివదత్తగఢం గడచి చునార్‌గఢ దిక్కుగా ఐంద్రజాలి కులు పోతున్నారు. మఱునాడు సాయంసమయాన చునార్ గఢం ఇంకా పదహారుక్రోసులదూరమువున్నదనగా వారికి ఎదు రుగా గుఱ్ఱముపై ఎవరో వస్తున్నట్లు కన్పించింది. దగ్గరకు వచ్చినతర్వాత అతడు భీమసేనుడని భైరవసింహుడు గుర్తు

పట్టాడు. భీమసేనుడు గుఱ్ఱందిగి తానెరిగిన భైరవసింహుణ్ణిచూచి నవ్వాడు.

భైరవ:– ఏం బాబూ మీకు సెలవుదొరికిందా? (తన మిత్రులతో) ఈయనే శివదత్తమహారాజు పుత్రుడు.

భీమసేనుడు:– మిమ్మల్ని విడిచిపెట్టిన తర్వాత నాకు మాత్రం సెలవు దొరక్కుండా ఎలాగుంటుంది?"

భైరవ:– నిన్ను పట్టుకున్నది ఎవరు?"

భీమ:– ఆ సంగతి తెలియదుగాని ఒకరోజున నేను వేటకు వెళ్లాను. ఎవరో ఒకామె గుఱ్ఱమెక్కివచ్చి విషంపూసిన బల్లెంతో నన్ను పొడిచింది నేను స్పృహతప్పిపడిపోయిన తర్వాత ఒకగుహాలోనికి తీసికొనిపోయింది. ఆ స్త్రీ ఎవరో నాకు తెలియదు. మీకు తెలుసు.

భైరవ:– సరే మీరిక ఇంటికి వెళ్ళండి. చూడు బాబూ మీ తండ్రి అనవసరంగా మాతో వైరం పెట్టుకొన్నాడు. మీ నాయన వీరేంద్రసింహుని ఖైదీగా ఉన్నప్పుడు సురేంద్రసింహ మహారాజు విరోధం మానుకొని చునార్ గఢలో వుండమని చెప్పాడు. కావలిస్తే చునార్ గడ్ సింహాన్ని అప్పగిస్తానని చెప్పాడు. అప్పుడా మహానుభావుడు సన్యాసం స్వీకరిస్తానన్నాడు. తీరా మళ్ళా విరోధం పెట్టుకొన్నాడు. మాకేమిటి! చునార్ గఢానికి రాజుగా ఉన్నప్పుడే గెలవలేనివాడు ఇప్పుడు గెలుస్తాడని మాత్రం నమ్మకమేమిటి?

భీమ:– నా తండ్రిగారి వ్యవహారం నాకేమీ నచ్చదు. అయినా ఏం చేస్తాను? చెప్పండి?

భైరవ:— మీరు అంతమాత్రం తెలుసుకొంటే చాలు. సరే మీరిక వెళ్ళండి.

భీమసేనుడు తనయింటిదిక్కుగానూ, ఇంద్రజాలికులు చునార్‌గఢ దిక్కుగానూ వెళ్ళిపోయారు.

## 10

ఆ యోగిని ఆనందసింహుని వదిలిపెట్టి మిగతావారందరికీ స్పృహ తెప్పించింది. స్పృహతప్పిపడివున్న ఆనందుని ఒకమూలకుపెట్టి తిరిగి ఆ వ్యక్తిని వ్రేలాడగట్టి కత్తితో పొడుస్తూ ఇంద్రజీతసింహుని ఆరాతీయటం ఆరంభించింది. యోధుకు కూడా వాళ్ళనే అనుసరిస్తున్నాడు. ఆ వ్రేలాడే మనుష్యుడు కూడా ఎంత మొండివాడోకాని చివరనిమిషంవరకూ తనకు తెలియదనే చెబుతున్నాడు. అతనికి ప్రాణంపోయినతర్వాత వాళ్లు ఆ ప్రక్కనే తీసిన గోతిలో ఆ శవాన్ని పాతివేశారు.

యోధునితో యోగిని "నీవు అడవిలో కట్టెలుకొట్టి డోలీ సిద్ధంచెయ్యి. ఆనందసింహుని మరొకణ్ణితోడుగా డోలీలో చునార్‌గఢపుకోటదగ్గరకు చేర్చి స్పృహతెప్పించి విడిచి పెట్టండి. తిరిగి మమ్మల్ని కలవాలనుకుంటే ఇక్కడికే కేరండి. మేము పనిమీద వెళ్ళిపోతున్నాం (ప్రక్కనేవున్న స్త్రీతో) పద చెల్లీ అన్నది.ఆ రెండవ ఆమె యెవరో పూర్తిగా తెలిసేవరకు వనచరి మేము అనుకొందాం. యోగినీ, వనచరీకలసి గుహావిడిచితూర్పు దిక్కుగ వెళ్ళిపోయారు. అప్పటికి తెలతెలవారుతోంది. ఆ విధంగా వారు అనేకదినాలు పెద్దప్రయాణంచేసి ఒక చెరువు ఒడ్డుకు చేరుకొన్నారు. ఆ చెరువు ఒకకొండ ప్రక్కగా

ఉన్నది. ఆ అందమైన చెరువుకి నాలుగుదిక్కులా మెట్లున్నాయి. నీటికి సమీపాన అక్కడక్కడా అరుగులుకూడా ఉన్నాయి. చెరువు పైభాగాన నలుదిక్కులా చక్కగా జాళ్ళు అమర్చి ఉన్నాయి. ఆ జాళ్ళపైన అక్కడక్కడా సింహాసనాలు మోస్తరుగా అరుగులుకూడా ఉన్నాయి. ఆ చెరువుమధ్య ఒకలావుపాటి ఇత్తడిస్తంభం. ఆ స్తంభంపైన లోహంతో తయారైన వికృతమానవవిగ్రహం కూర్చున్నభంగిమలో ఉన్నది. ఆ చెరువు చుట్టూ చల్లనినీడ నిచ్చే చెట్లు పెరిగిఉన్నాయి. ఆ కాంతలు సర్వసౌందర్యాన్ని తనివితీరచూచి చివరకు చెరువుకు అభిముఖంగా ఒక అరుగుమీద కూర్చున్నారు. ఆవెంటనే వారికి ఆ స్తంభందగ్గర నీళ్ళలో సంచలనం కలిగి ఒకమానిసి ఈత కొట్టటం కన్పించింది. వాళ్ళిద్దరూ ఆ దిక్కుగా చూడసాగారు. ఆ వ్యక్తి ఒడ్డుకువచ్చి మెట్లపై నిలబడి నలుదిక్కులా చూస్తూ ఉండగా ఆ మూర్తి స్త్రీయే అని తెల్లమైంది. యోగినీ వనచరీ అరుగుదిగి చాటుమాటున ఉండి ఆ స్త్రీని చూస్తూ ఉన్నారు. ఆ యీదుకునివచ్చిన స్త్రీ వయస్సున చాలా చిన్నది. ఆమె చెరువుబైటకువచ్చి గాలిలో తనవస్త్రాలను ఆరబెట్టుకోసాగింది. బట్టలు ఆరినతర్వాత తిరిగి కట్టుకొని ఆమె ఒకదిక్కుగా పోసాగింది. ఆమెకోసం పొంచికూర్చున్న యోగినీ వనచరీ ఒక్కసారిగా ఆమెపై లంఘించారు. ఆమె వారికి దొరకకుండా గభాలున చెట్లపైకి ఎక్కింది. చాలాసేపు ఆమెను పట్టుకోడానికి యోగినీ వనచరీ ప్రయత్నించారు. కాని ఆమె చివరికి మెట్లమీదకు వచ్చి గభాలున చెరువులోకిదూకింది. ఆమెవెంట యోగినీ వనచరీకూడా చెరువులో దూకారు.

# 11

ఒకసుందరతరమైన ఉద్యానవనంలో చల్లని పిల్లగాలు లకు సంతోషాంతరంగంతో విహారయాత్ర సల్పుతూ కిశోరి ఆ వనంలోని ఒకగదిలోనికి ప్రవేశించింది. వెనుకదిక్కుగా ఆమెకు సైనికవేషంలోఉన్న ఒకమనుష్యమూర్తి గోచరించింది.

కిశోరి:—కమలా! నీకోసం ఎదురుచూస్తున్నాను. ఇన్నాళ్లు చేశావేం."

ఆ సైనికమూర్తి స్త్రీ అని విదితమైంది కదా!

కమల:— అందుకనే తొందరగా వచ్చాను. లేకపోతే ఇంకా రెండురోజులపని వుంది.

కిశోరి:— అయితే పూర్తిగా వివరాలు తెలియలేదా ?

కమల:— లేదు.

కిశోరి:— చునార్‌గఢం అల్లకల్లోలమై వుండాలి!

కమల:— ఆ సంగతి అడిగావా ? నాకు దొరికిన సమాచారంకూడా చునార్‌గఢంలోనే.

కిశోరి:— ఏం తెలిసింది ?"

కమల:— ముసలి బేహారివేషంలో నీ బొమ్మ పొదిగిన వుంగరాన్ని అతనిచేతి కందించినప్పటినుంచీ అతనిలో చాలా మార్పు కన్పించింది. అతడు నాకోసం చాలా వెదికాడు.

కిశోరి:— తర్వాత ఏమైంది?

కమల:—దానికి మూడవనాడు అతడు ఉదాసీనంగా ఉండటం చూచి ఆనందసింహుడు నౌకావిహారానికి తీసుకొని వెళ్లాడు. వారివెంట ఒకముసలినౌకరుకూడా ఉన్నాడు.

వారు దాదాపు ఒక కోసెడుదూరం వెళ్ళినతర్వాత అడవిలో సంగీతం వినిపించింది. ఆయన నౌక దిగివచ్చాడు. అక్కడ మాధవి నీవేషం వేసుకొని మొట్టమొదటనుంచీ ఒక ఎత్తు వేసి కూర్చున్నది. అక్కడనుంచీ అతనిని వివిధంగా ఎత్తుకొని పోయారో మాత్రం తెలియదు. ఆ ముసలినౌకరు మాటల ద్వారా మాధవితోబాటు చాలామంది స్త్రీలుఉన్నట్లు తెలిసింది. వాళ్ళంతా సోదరులిద్దర్నీ చూచి పారిపోయారట. ఆనందసింహుడు స్త్రీలను అనుసరించాడట కాని అతనిని కూడా తప్పించుకొని మనవాళ్లు అదృశ్యులైపోయారు. అప్పుడతడు ముసలినౌకరు దగ్గరకువచ్చి జరిగినసంగతి అంతా చెప్పాడు.

కిశోరి:— మాధవి నా వేషం వేసుకొని కూర్చున్నదని నీకెట్లా తెలుసు?

కమల:— నేను తిరిగి వచ్చేటప్పుడు ఆ అడవికి వెళ్లాను. ఆ అడవిఅంతా నరికివేశారు. అక్కడ నాకు ఒక కాలిఅందె దొరికింది. నేను దానిని మాధవిదగ్గర చాలాసార్లు చూచాను. దానినిబట్టి మాధవే ఈపనిచేసిందని తెలుసుకొన్నాను. చివరికి మాధవియింటికివెళ్ళి ఆమె సహచరిణులతో మాట్లాడి నా అనుమానాన్ని నివృత్తిచేసుకొన్నాను.

కిశోరి:— నన్నే మోసంచేయాలని చూస్తోంది చూడు.

కమల:— అదేమిటి?

కిశోరి:— అయితే ఇంద్రజిత్‌సింహుడు ఇప్పుడు మాధవి ఇంటిదగ్గర ఉన్నాడా?

కమల:— ఉంటే నేను ఖాళీచేతులతో ఎందుకు వస్తాను.

కిశోరి:— అయితే ఆయనను ఎక్కడ పెట్టారు?

కమల:- ఆ సంగతి నాకింకా తెలియదు. తెలుసుకోవా లనుకున్నాను గాని నువ్వే అవస్థలో ఉన్నావో అని ఇక్కడికి వచ్చాను.

కిశోరి నిట్టూరుర్పువదిలి "అయ్యో! నీమరాలు ఆయనకు నా మీద మనసు లేకుండా చేసిందో యేమో?" అని విలపించసాగింది. కమల ఆమెను ఓదార్చి "ఇంద్రజీతసింహుని తీసుకొనివచ్చిననాడే అన్నపానాలు ముట్టుతా"నని శపథం చేసింది.

కిశోరిఉన్న ఈస్థలం శివసత్రగఢం కాదు. ఇది ఆమె మేన మామల ఊరు. ఆమె ఇక్కడకుఎందుకు ఉందో ముందు ముందు తెలుస్తుంది. కిశోరి కొంచెం స్తిమితపడి "కమలా! ఒంటరిగా నీవేమి చేయగలవే?"

కమల:- నేను చపలా చెంపలు కలసి చెయ్యలేనిది కూడా నేను చెయ్యగలుగుతాను.

కిశోరి:- అయితే నీవు ఇవ్వేళ వెళతావా?

కమల:- తప్పకుండా వెళతాను. కాని నీతో ఒకటి రెండు విషయాలు తేల్చుకోవాలి లేకపోతే నన్ను అవమానపరచినా పరుస్తావు.

కిశోరి:- చెల్లీ! నేను నిన్ను అవమానపరచటానికి సమ కడతానా? నీ వొక్కదానివే నాకీ ప్రపంచంలో సుఖదుఃఖా లలో తోడునీడగా ఉన్నావు."

కమల:- అదంతా నిజమేకాని మనయిద్దరిమధ్యా పేచీలు ఉండకూడదు.

కిశోరి:- అయితే చెప్పు.

కమల:- నీవు ఇంద్రజీతసింహుని వాంఛిస్తున్నావు. అందు

చేత వారి కుటుంబక్షేమాన్ని కూడా నీవు నీ ధర్మంగా భావిస్తున్నావు. కాని నీ తండ్రికీ నాకూ బద్ధవైరం. నీకూ ఇంద్రజీత సింహునికీ స్నేహం కలుగజేసిన కారణంగా నావల్ల మీ తండ్రికి కష్టాలు కలగవచ్చు. ఆ విధంగా జరిగిననాడు నీవు చాలా దుఃఖిస్తావు.

కిశోరి:— నీకా సంగతి అనవసరం. నేను నా తండ్రి ఇంటి నుండి వచ్చిననాడే మా తండ్రిని పూర్తిగా వదులుకొన్నాను. ఒకవేళ నేను మేనమామగారి యింటివద్ద లేకపోతే మా మేనమామకు మా తండ్రికీ ఒకనాటికి వైరం లేకుండా ఉన్నా ఏనాడో నేను వైకుంఠయాత్ర చేసి ఉండేదాన్ని. నాకు ఆయింటిపై ఏమాత్రం ప్రేమానురాగాలు లేవు. నీవా క్రూరుణ్ణి తీసుకొనివచ్చి నాకప్పగించటం చాలా మంచిదైంది. దానివల్ల నాకు కొంత దుఃఖోపశమనం కలిగింది.

కమల:— నాకింకా ఆ స్త్రీపై కోపం పోనేలేదు. ఇప్పుడు నీ పనుపుతో స్త్రీ నా కోపం కొంత తీర్చుకొంటాను.

కిశోరి:— ఆటంకమేముంది. తీసుకొనిరా.

కమల ఆగదినుండి బైటికి వెళ్ళింది. కిశోరి మౌనంగా ఆలోచిస్తోంది. ఆమె చెలికత్తెలెవరూ ఆమెను పలుకరించలేదు. ఒక అరగంట తర్వాత కమల స్త్రీని తీసుకొని ప్రవేశించింది. ఆ స్త్రీ వయస్సు సుమారు ఇరవైఐదు సంవత్సరాలుంటుంది. శరీరాన్ని బట్టి ఆమె చాలా ఆరోగ్యంగా ఉన్నట్లుంది. ఆమె శరీరానికి తగిన వేషభూషణాలు సమకూరిస్తే ఆమె అందం చెప్పనలవికాదు. ఆమె ఏకారణంవల్ల పట్టుబడ్డదో తెలియరావటం

లేదు. ఆమెను చూడటంతోనే కిశోరి తొకతొక్కిన తాచు అయింది. కమల అక్కడఉన్న చెలికత్తెతో ఒక బెత్తాన్ని తెప్పించి చేతిలో పట్టుకుంది. ఆ స్త్రీలంతా కలసి ఆమెను మూటగట్టినట్టు బంధించారు. అప్పటివరకు కిశోరి పరిహాసంగా నేచూస్తూ నిలబడింది. కాని ఎప్పుడైతే కమల ఆఖైదీని చావమోదటానికి సంసిద్ధురాలైనదో అప్పుడు కిశోరి ఇద్దరు చెలికత్తెలతో బైటికి వెళ్ళిపోయింది. ఆమె బయటికిపోయినా గదిలోని ఆర్తాలాపాలు చెవిని సోకుతున్నాయి. కొద్దిసేపైన తర్వాత కమల తోటలో విహరిస్తున్న కిశోరిదగ్గరకు వచ్చింది.

కిశోరి:- ఆమె ఏమైనా చెప్పిందా?

కమల:- చెప్పలేదు. అయినా ఎక్కడికి పోతుందిలే! ఇవ్వేళ గాకపోయినా రేపైనా చెపుతుంది. ఇక నాకు సెలవిస్తే వెళ్ళిపోతాను.

కిశోరి:- 'సరే వెళ్ళు. నేనుకూడా ఇప్పుడు ఇంటికి వెళ్ళిపోతాను. లేకపోతే అమ్మమ్మ ఇక్కడకువచ్చి విచారించటం మొదలుపెట్టుతుంది' అని కమలను కౌగిలించుకొన్నది.

కమల:- నాబొందిలో ప్రాణం ఉన్నంతవఱకూ నీపని నెరవేర్చి పెడతాను.

కమల అక్కడినుంచి వెళ్ళిపోయింది. కిశోరికూడా తన చెలికత్తెతో కలసి ఆసమీపానవున్న గృహానికి వెళ్ళిపోయింది.

# 12

అది ఒక రమణీయమైన ప్రదేశం. ఆస్థలం రమారమి ఒక వెయ్యిగజాల పొడవు అంతే వెడల్పూ ఉండిఉంటుంది. ఆ ప్రదేశానికి చుట్టూ కొండలు కమ్ముకొని వున్నాయి. ఆ పర్వతాలమధ్యఉన్నది ఒక సుందరమైన ఉద్యానవనంగా ప్రకాశిస్తోంది. ఆవనమంతా రంగురంగుల పుష్పజాతులు వికసించి మధురవాసనలను వెదజల్లుతున్నాయి. అది వర్షాకాలం నాలుగువైపులాకురిసిన వర్షపునీరు ఆవనంమధ్య ప్రవహిస్తున్న సెలయేళ్ళకు కావలసినంత నీటిని అందజేస్తున్నది. ఆతోటకు నట్టనడుమ ఒక సుందరమైన భవనమున్నది. అది పురాతనపు కట్టడంగా కన్పిస్తోంది. ఆభవనానికి కట్టెదుట ఒక కోనేరుకూడా ఉన్నది. అక్కడ పది పదిహేనుమంది యువతీ యువకులు విడిది చేసిఉన్నారు. అది సాయంకాల సమయం. అక్కడివారంతా విలాసంగా పూబొదరిండ్లమధ్య విహరిస్తున్నారు. వారి ఆనందోత్సాహాలకు అంతులేదు. ఇంద్రజీతసింహుడు ఒకానొక సుందరి సుకుమారహస్తాన్ని పట్టుకొని కోనేటికి తూర్పుదిక్కుగా విహరిస్తున్నాడు. వాళ్లు అలసినట్లు కనిపించి అక్కడ ఒక అరుగుమీద కూర్చున్నారు.

ఇంద్రుడు:— మాధవీ ! నీవునిజంగా ఆనాడు గంగా తీరాన ఊయల ఊగుతున్న రమణివేనా?

మాధవి:— రోజూ మీరునన్ను ఇదేప్రశ్న అడుగుతున్నారు. ప్రమాణంకూడా చేసి నేను మీకు సమాధానం చెప్పాను కాని మీరు నన్ను విశ్వసించటంలేదు.

ఇంద్ర:- (తన ఉంగరాన్ని చూచి) బొమ్మకంటే వేరుగా కన్పిస్తున్నావు !

మాధవి:- అది చిత్రకారుని దోషం.

ఇంద్ర:- ఏది ఏమైనా నీవు నన్ను వశపరచుకొన్నావు.

మాధవి:- మీరేగా నన్ను కలుసుకోవటానికి వచ్చింది?

ఇంద్ర:- ఒకవేళ నేను రాకపోతే నన్ను బలవంతాన తీసుకొనిపోయేదానివా ?

మాధవి:- అవన్నీ ఎందుకులెండి ! ఊరుకోండి ! నేనే మీకు కృతజ్ఞతను తెలియజేస్తున్నాను. సరా !

ఇంద్ర:- సరే ! ఆ మాటలు పోనీ కాని, మన వాగ్దానాన్ని గుర్తుకు తెచ్చుకొన్నావా? ఇవ్వేళ ఏ రోజనుకున్నావు? నీ పూర్తివివరాలు వినసిది నేను ఊరుకోను. నీవు నా ముందు అబద్ధాలు మాత్రం చెప్పవద్దు.

మాధవి:- (కొద్దిసేపు ఆలోచించి) ఇవ్వేళ నన్ను క్షమించండి. రేపు తప్పకుండా పూర్తివివరాలు చెప్పేస్తాను. ఇప్పుడు వేళ అయింది. నాకు రెండుగంటలపాటు సెలవివ్వండి.

ఇంద్ర:- సరే వెళ్ళు ! రెండుగంటలకంటే ఎక్కువ ఉండవద్దు.

మాధవి లేచి ఇంటిలోనికి వెళ్ళింది. ఆమె వెళ్ళినతర్వాత ఇందజీతసింహుడు మాధవి ఎవరా ? అని ఆలోచించసాగాడు. ఆమెకు పెద్దవాళ్ళన్నవారెవరైనా ఉన్నారో లేరోకూడా అతనికి తెలియదు. ఆమె ఉదయమూ సాయంత్రమూ ఎక్కడికో ఎడారిత్రోవను రెండుగంటలు కన్పించకుండా వెళ్ళుతుంది.

అతనికి తన్ను మాధవి ప్రేమిస్తున్నదని తెలుసుగాని ఎందుకు బంధించిఉంచిందో తెలియదు. ఆ ప్రదేశం ఎంత ఆనందమయమైనది. అయినా అతనికేదో అసంతృప్తి గోచరించసాగింది. అతనికి బైటికి వెళ్ళేమార్గం తెలియదు. పర్వతంఎక్కి దాటి పోగలననే ఆశా లేదు. అన్నిటికంటేనూ అతనికి మాధవిని విడిచి వెళ్ళటం మరీ దుఃఖకారణం.

ఇంద్రజీతసింహుడు ఏమీ దిక్కుతోచక సెలయేటి తీరానబడి ముందుకుపోతున్నాడు. అతడు మూడుదిక్కులనుండీ వచ్చిన సెలయేళ్లు సంగమించినచోటికి వచ్చాడు. అక్కడ సెలయేళ్ళలో అధికంగానున్ననీరు ఒక సొరంగంలోనుండి పర్వతం క్రిందిభాగానికి పోతున్నది. అతనికి ఒకసన్నని ధ్వని విని పించింది. తలయెత్తి నల్గుదిక్కులా చూచాడు. పదిహేను ఇరవైగజాలదూరంలో అతనికి ఒకస్త్రీ కన్పించింది. ఆమెను అతడింతవరకూ చూడలేదు. ఆమె ఇంద్రజీతుని నిలబడమని చేతిలోసంజ్ఞచేసి అతనిదిక్కుగా ఎవరికీ కన్పించకుండావచ్చింది. ఆస్త్రీ ఇంద్రజీతసింహునకు ఒక మడిచిన కాగితం ఇచ్చింది. ఆమె ఈ ఉత్తరంలో అన్నిసంగతులూ ఉన్నాయి. చూచుకోండి నేను నోటితో ఏసంగతులూ చెప్పదలచుకోలేదు. నేనిక్కడ ఉండటంకూడా ప్రమాదకరమైనవిషయం. ఎవరైన మనల్ని దర్శిస్తే మనం శాశ్వతంగా కష్టాలకుగురై పోతాం. నేను ఈఉత్తరంపంపించిన యువతియొక్క పరిచారికను అని చెప్పింది. ఇంద్రజీతసింహుడు తిరిగి సమాధానంచెప్పకముందే ఆమె కొండఎక్కి కొద్దిదూరంలో సొరంగంలో ప్రవేశించి

అదృశ్యమయిపోయింది. ఇంద్రజీతుడు అదృశ్యాన్ని చకితుడై చూచి చివరికి ఉత్తరంచదవటం ఆరంభించాడు దానిలో.

"నేను మిమ్ముల్ను ఎంతగానో వరించి చిత్రాన్ని ముద్రటుంగరంలోపొదివి స్వయంగా మీచేతికి అందే టట్టుచేశాను. మీరు నన్నుగురించి ఆలోచించనైనా ఆలోచించకుండా మరొక ఆడదానివలలో చిక్కుకొన్నారు. ఆమె ఆవేషంవేసుకొని మిమ్ముల్ను మోసంచేసింది. ఒక మాయలాడి బాహుబంధాలలో చిక్కుకొన్నమీరు నన్ను గురించి ఆలోచించకపోవటం సహజమేకదా? ఈఉత్తరాన్ని చదువుకొని మీరు దీన్ని గుర్తుతెలియకుండా చించి పారి వేయండి.

మీ దాసి
కిశోరి

అతని కావుత్తరం ఆశ్చర్యంకలిగించింది. అతని అనుమానా లన్నీ నిజమైనాయి. కాని బైటికిపోవడానికి మార్గంలేదు. అతడు కొంచెంసేపు ఆలోచించి ఉత్తరంతెచ్చియిచ్చినస్త్రీ వచ్చిన సొరంగందగ్గరకువెళ్లాలని నిశ్చయించుకొన్నాడు. అప్రకారం అతడు కొండపైకి కొద్దిదూరంఎక్కాడు. అతని కక్కడ ఒకమనిషి ప్రవేశించటానికి వీలున్నసొరంగం కన్పిం చింది. సంతోషంతో దానిలోచొరబడ్డాడు. కొద్దిదూరంవెళ్ళిన తర్వాత కాలికి నీళ్లుతగిలాయి. ముందుకువెళుతున్నకొద్దీ నీళ్లు ఎక్కువయినాయి. కంఠంవరకు నీళ్ళువచ్చేసరికి ఆసొరం గంలో ఈదుకొనివెళ్ళటానికికూడా వీలులేకపోయింది. గత్యం తరంలేక వెనుదిరిగిపోయాడు. ఆఉత్తరంతెచ్చిన స్త్రీవచ్చిన దారిమాత్రం ఇదేనని అతనివిశ్వాసం.

ఆవనంలో విహరిస్తున్న స్త్రీలకు ఇంద్రజీతసింహుడు కన్పించకపోయేసరికి భయంకలిగింది. వాళ్ళు పరుగెత్తుకుంటూ ఆయింట్లో ప్రవేశించారు. అక్కడ కనిపించకపోయేసరికి సారంగందగ్గరకు వచ్చారు. అక్కడ తడిగుడ్డలతో బైటికివచ్చి నిలబడిన ఇంద్రజీతసింహుడు కన్పించాడు. ఈకార్యక్రమమంతా జరిగేసరికి రెండుగంటలైంది. వెన్నెలకూడా పిండిఆరబోసినట్లు తనవైదగ్ధ్యాన్ని ప్రదర్శిస్తోంది. అప్పటికి మాధవి ఇంటికివచ్చి చూచింది. ఎవరిజాడా లేదు. చివరికి పొయ్యికూడా రాజేసిన జాడలేదు. ఆమెతిన్నగా సారంగందగ్గరకువెళ్ళింది. అక్కడ అందరినీచూచింది. మాధవి చెలికత్తెలను కోపగించుకొంది. ఏట్లాగో కోపాన్ని దిగమింగి ఇంద్రజీతసింహునితో 'మీారు సారంగంలోదిగారా? అడిగింది' 'అవును' అన్నాడు ఇంద్రజీతుడు.

మాధవి:-ఎందుకుదిగారండీ అందులో? దానినిండా తేళ్లు పాములూ ఉంటాయి. ఆభయంతో మేమిక్కడికి ఎన్నడూ రానేరాము.

ఇంద్రుడు:- తిరుగుతూ తిరుగుతూ ఇక్కడికివచ్చాను. తమాషాగాఉంటే చూద్దామని దిగాను.

మాధవి:- దిగితేదిగారుగానీ ఇకపదండి బట్టలు మార్చుకొందురుగాని.

ఇంద్రజీతసింహునికి అనుమానం హెచ్చయింది. తానుచేసినపనికి అందరూభయభ్రాంతులుకావటం అతడు గమనించాడు. ఆరాత్రిఅంతా రాజకుమారుడు ఆలోచిస్తూనే వున్నాడు అతనిపై అనుమానంకలిగిన మాధవికూడా అతిశ్రద్ధగానేవుంది.

# 13

మర్నాడు మధ్యాహ్నం ఏకాంతంగా ఉన్న సమయంలో ఇంద్రజిత్సింహుడు "మాధవీ ఇక ఓపిక పట్టడం నావల్ల కాదు. ఇవాళ నీవు నీ పూర్తి సమాచారాన్ని తెలియజేయి. ముందుగానే తల్లిదండ్రులెవరో? ఈ ప్రదేశమెక్కడిదో చెప్పు."

మాధవి:- ఇదొక మృత్యుముఖం. నేనిక్కడి రాజకుమార్తెను. నా తల్లిదండ్రులు మరణించి అయిదుసంవత్సరాలైంది. ఇప్పుడు నేనే దీనికి అధికారిణిని.

ఇంద్ర:- అయితే నీవు నా కోసం చునార్ గఢం వెళ్ళావు కదూ?

మాధవి:- అవును. నేనే నర్తకుని వేషంలో మీకీ ఉత్తరాన్ని పంపించాను.

ఇంద్ర:- అయితే నీ పేరు కిశోరి అనికూడా ఉన్నదా?

ఆ మాట వినేసరికి మాధవి ఉలిక్కిపడింది. వెంటనే ఆమె సారంగాన్ని గూర్చి తలపోయసాగింది. ఇంద్రజిత్తుడు అకారణంగా సారంగంలో ప్రవేశించలేదనే అనుమానం మాధవిని పట్టి పీడించసాగింది. ఆమె అతనిదగ్గర కూర్చుండలేక బయటవసారాలోకి వచ్చేసింది. ఇంద్రజిత్సింహుడు కూడా మాధవి మనోవైకల్యాన్ని గుర్తించసాగాడు. ఆమె వసారాలో నుండి మరొక గదిలోకి వెళ్ళింది. అక్కడ ఆమెకు బహు విశ్వాసపాత్రులైన యిద్దరు చెలికత్తెలు ఉన్నారు. వారిపేర్లు లలిత తిలోత్తమ. వారు మాయాజాలంలో కూడా నేర్పరులు.

తిలోత్తమ:- ఇప్పుడిక్కడికి వచ్చారేమిటి? అట్లా ఉన్నావేం?

మాధవి:— ఏమి చెప్పను చెల్లీ. కష్టమే వచ్చింది.

లలిత:— ఏమిటా కష్టం ?

మాధవి:— చెప్పటానికే వచ్చాను.

అందరూ కూర్చున్నారు. మాధవి ఇంద్రజీతసింహునితో జరిగిన సంభాషణ సవిస్తరంగా చెప్పి "కిశోరియొక్క దూత లెవరో ఇక్కడకు తప్పకుండా వచ్చిఉండాలి. వారిద్వారానే ఇంద్రజీతసింహునికి కొన్ని రహస్యాలు తెలిసాయి. అతడు సొరంగంలో ప్రవేశించినప్పుడే నాకు అనుమానం వేసింది. ఇప్పుడు చాలా విపరీతపరిస్థితులు ఏర్పడ్డాయి. నేను ఇక్కడనుండే వీరిని నా మహాలులోనికికూడా తీసుకొని వెళ్ళలేకున్నాను. అక్కడ ఆ దురాత్మురాలు విన్నదంటే కొంపమునుగుతుంది. రాజ్యభారమంతా ఆ వ్యక్తిపైనే ఉన్నది. రాజ్యం కాస్తా పోయినతర్వాత నేను సుఖపడేది మాత్రం ఏమున్నది ? ఆ వ్యక్తికి ఇంతవరకు ఇంద్రజీతసింహుని సంగతి తెలియనే తెలియదు.

చాలా సేపటివరకూ ముగ్గురూ ఏదో సంప్రదించుకొన్నారు. చివరకు ఒకనిర్ణయానికివచ్చిన పిమ్మట మాధవి ఇంద్రజీతసింహునివద్దకు వచ్చింది. అంతవరకూ ఇంద్రజీతసింహుడు తానెవిధంగా ప్రవర్తించాలో ఆలోచించుకొంటూ కూర్చున్నాడు. ఆమె రాగానే "భయపడి వెళ్ళిపోయావు" ఎక్కడికీ అన్నాడు

మాధవి:— కొంచెం అస్వస్థతంగా ఉంటే వెళ్లాను.

ఇంద్ర:— ఇప్పుడు స్వస్థత చిక్కిందా ?

మాధవి:— ఫరవాలేదు.

ఆ తర్వాత ఇంద్రజిత్‌సింహుడేమీ ఆమెను ప్రశ్నించ లేదు. మాధవిహృదయంలో అనుమానాలను రేకెత్తించటం తగనిదని అని అతడు మామూలుగా ఉండటానికి ప్రయత్నిం చాడు.

సాయంకాలమైంది. దీపాలుపెట్టిన తర్వాత మాధవి మామూలుగా ఇంద్రజిత్తునిఅడిగి రెండుగంటలపాటు ఎక్కడికో వెళ్ళటానికి అనుమతికోరింది.

ఇంద్ర:- మాధవీ నేను నిన్ను క్షణకాలంకూడా విడిచి పెట్టి వుండలేకపోతున్నాను. దయచేసి ఎప్పుడూ నీవు నన్నే వెన్నంటిఉండు.

మాధవి:- నాపై మీకింత దయకలిగితే అదే పదివేలు. నేను త్వరలోనే తిరిగివస్తాను.

ఇంద్ర:- ఇవ్వాళ నిన్ను వెళ్ళనివ్వను. అదిగో అటు చూడు ఆ వర్షకాలపు మేఘాలు చంద్రునితో ఎలా దాగుడు మూతలాడుతున్నాయో! ఇటువంటి ఆనందదాయకమైన సమ యంలో నేను నిన్ను విడిచి క్షణకాలం కూడా నిలువలేను.

మాధవికి ఏమిచేయటానికీతోచలేదు. చివరికి ఆమె అతని తోనేఉండిపోవటానికినిశ్చయించుకొన్నది. కాని ఆమెమామూ లుగా వెళ్ళలేకపోవటవల్ల విచారించటం మానుకోలేదు. అర్ధ రాత్రి అయింది. ఇంద్రజిత్తుడు గాఢంగా నిద్రపోతున్నాడు. అప్పుడు మాధవి నెమ్మదిగా అతన్ని విడిచి తాను వెళ్ళవలసిన చోటికి వెళ్ళిపోయింది. అతనికి మెలకువవచ్చినతర్వాత మాధవి లేకపోవటం చూచి ఆమె మామూలుగా వెళ్ళవలసినచోటికి వెళ్ళిపోయిందనుకొన్నాడు. ఆ ప్రదేశమేదో అక్కడికి మాధవి

తప్పనిసరిగా ఎందుకు వెళ్ళాలో ఇంద్రజీతునికి అర్థంకావటంలేదు. ఆ ఆలోచనలలోనే అతడు మేలుకొనిఉన్నాడు. ఇంతలో మాధవి వచ్చింది. ఆమెనుచూచి ఇంద్రజీతుడు దొంగనిద్రలో మునిగి పోయాడు. ఆమె లేపినా లేవలేదు. ఇదేవిధంగా చాలారోజుల పాటు సాయంకాలసమయంలో ఇంద్రజీతుడు మాధవిని వెళ్ళ నీయకపోవటం ఆమె అర్ధరాత్రిపూట లేచివెళ్ళి తిరిగి ఉదయం కాకమునుపే రావటం జరుగుతోంది.

ఒకనాడు ఇంద్రజీతుడు చాలా తెలివిగా ప్రవ ర్తించి నిద్రపోకుండా మేలుకొనే ఉన్నాడు మాధవికిమాత్రం అతడు నిద్రపోయినట్లుగా కన్పించాడు. అర్ధరాత్రి గడిచిన తర్వాత మాధవి నెమ్మదిగా లేచి తనకొంగుకు ముడివేసిన తాళపుచెవిలో ఒకటిలమారి తెరిచింది. అందులోనించి ఒక పెద్ద తాళంచెవి తీసి నెమ్మదిగా బైటికివెళ్ళింది. ఇంద్రజీతుడుకూడా నెమ్మదిగా లేచి ఆమెవెనుక వెనుకగా నడకసాగించాడు. ఆమె ప్రక్కనే ఉన్న గదిదగ్గరకు వెళ్ళి పెద్దతాళంచెవితో ఆ గది తెరచింది లోనికి వెళ్ళి తలుపుమూసుకొన్నది. ఇంద్రజీతుడు చేసేదిలేక తిరిగివచ్చి శయనించాడు. అక్కడ అతనికి ఒక స్త్రీ ప్రత్యక్షమైంది. ఆమె ఎవరో అతనికి తెలియదు. ఆమె అతనిని వాకిట్లోకి తీసుకొనిపోయింది. అక్కడామె "నీవు నన్ను గుర్తిం చావా?" అని అడిగింది. అతడు "నీవంటి నీలాంగిని నేనింత వరకు చూడలేదు" అన్నాడు. ఆమె నల్లగాఉండటమేగాక కట్టుబట్టలుకూడా తడిసిఉన్నాయి. ఆమె అతనికి తన చేతిమీద ఒకగాయాన్ని చూపి "ఇప్పటికైనా నన్ను గుర్తుపట్టావా?"

ఇంద్రజీతుడు సంబరపడి "నేను నిన్ను పినతల్లీ అని పిలువ వచ్చునా?" అన్నాడు.

నీలాంగి:- తప్పకుండా పిలువవచ్చు.

ఇంద్రా:- ఇక నాప్రాణాలునిలిచాయి. ఇక నేను ఇక్కడినుంచీ పారిపోలేను.

నీలాంగి:- నీవు ఇక్కడనుండి బైటికి వెళ్లిపోగలవు. నీవు మాధవివెళ్ళిన త్రోవచూచావు. ఆమెతాళంచెవి ఎక్కడ పెడు తుందోచూచావు. కాని నీవు ఖాళీచేతులతో పారిపోవటం నాకిష్టంలేదు.

ఇంద్ర:- అవును నిజమే! నన్నేంచెయ్యమంటావో చెప్పు.

స్త్రీ:- ఆమె బైటికివెళుతున్నపుడు నీవువెంటాడటం మం చిదికాదు. దానివల్ల మనగుట్టుకూడా బైటపడిపోతుంది. నీవు మాధవి ఒకేతాళంచెవితో బైటతాళంతీసి లోనికివెళ్ళి అదే తాళంవెయ్యటం చూచావుకదా? కనుక మనమిప్పుడు అటు వంటి తాళంచెవినే దగ్గరపెట్టుకొని ఆమె వెనుకవెనుకగా వెళ్ళటంమంచిది. ఆమె నీకు ఆతాళంచెవి ఎక్కడదాస్తుందో తెలుసు కనుక ఆసంగతి నీవునాకు చెప్పు. ఆతర్వాత నేనుఎల్లుండి నీకు అటువంటి తాళంచెవినే తెచ్చియిస్తాను.

ఇంద్రజీతసింహుడు ఆనీలాంగికి తాళంచెవిపెట్టేసలం చూపించివెళ్లి తనమంచంమీద పడుకొని నిద్రపోయాడు.

# 14

మరునాడుసాయంకాలం మాధవిని వెళ్ళనీయకుండా అటంకపఱచాడు. సగము రాత్రివఱకు ఉల్లాసభరితంగా గడిచింది. ఆతర్వాత వారిద్దరూ తమతమమంచాలమీద పరున్నారు. రాజకుమారునికి గతరాత్రివచ్చినస్త్రీ తిరిగివస్తుందని తెలుసు గనుక నిద్రపట్టలేదు. సన్ననిదుప్పటిని కప్పుకొని పండుకొన్నాడు. మాధవిమాత్రం ఎప్పటికప్పుడే నిద్రపోయింది.

ఆనీలాంగి తిరిగి యథాసమయాన వచ్చింది. మొట్టమొదట ఆమె వాకిలిదగ్గరనిలబడి చిన్నశబ్దంచేసింది. నిశ్శబ్దంగా ఉండటం పరికించి లోపలకుప్రవేశించి వాకిలి నెమ్మదిగా మూసివేసుకొన్నది. ఇంద్రజీతసింహుడు లేచికూర్చున్నాడు. ఆమె అతనిని నిశ్శబ్దంగావుండమని హెచ్చరించింది; మాధవిమంచి నిద్దురలోఉన్నట్లు తెలుసుకొన్నది.

ఆ నీలాంగి తనసంచిలోనుంచి మత్తుమందు వెలికితీసి మాధవి ముక్కుదగ్గర ఉంచింది. మాధవి స్పృహాలేనిదిగా కావటం గమనించి ఆమె పైటకొంగును కట్టినతాళపుచెవిని తీసుకొన్నది. దానితో అలమార తెరచి దానిలో పెద్దతాళపుచెవిని తీసుకొన్నది. ఆ పెద్దతాళంచెవియొక్క అచ్చును మైనపుముద్దమీద ఒత్తుకొని తిరిగి ఆ తాళపుచెవిని అలమారాలో పెట్టి తాళంవేసింది. అలమారాతాళపుచెవిని యథాప్రకారం మాధవి పైటకొంగుకు కట్టివేసింది. ఇంద్రజీతసింహునితో ఆమె "నేను ఈ అచ్చుప్రకారం మరోతాళపుచెవిని తేస్తాను. ఈ రాత్రి మాధవిని స్పృహాలేకుండానే ఉండనియ్యి. తెల్లవారినతర్వాత

ఆమె తననిర్ణీతస్థలానికి వెళ్ళలేకపోయినందుకు ఏవిధంగా బాధ పడుతుందో చూడు” అని చెప్పింది.

మరునాడు కొద్దిగా ప్రొద్దెక్కినతర్వాత మాధవి మేల్కొన్నది. ఆమె భయభ్రాంతురాలైంది. ఆమె తన మనోభావాలను ఎంతగాఅణచిపెట్టుకొన్నా ఆమె ముఖకవళికలుమాత్రం మానసిక పరిస్థితులకు దర్పణంగా కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నాయి. దానినిబట్టి ఇంద్రజితసింహుడు మాధవి పరితాపాన్ని గ్రహించగలిగాడు. మరునాడు అర్ధరాత్రిసమయంలో ఇంద్రజితసింహుడు నిద్రిస్తున్నాడనుకొని మాధవి మంచంమీదనుంచి లేచింది. గదిలో దీపంఆర్పి అలమర తెఱచి లోనప్రవేశించి తిరిగి తలుపు వేసుకొన్నది. ఇంద్రజితుడు రహస్యంగా ఆమె వెనుకనే గదిబయటకు వచ్చాడు. మాధవి లోనికి ప్రవేశించగానే ఆ నీలాంగికూడా వచ్చింది.

మాధవి వెళ్ళిన కొద్దిసేపటికి నీలాంగి తలుపు తెఱచింది. ఇంద్రజితునితో కలసి ఆమె లోనికివెళ్ళి తాళంవేసుకొన్నది. లోపలంతా చీకటి, ఆమె మాయాజాలం సంచిలోనుంచి ఒక కొవ్వువత్తి తీసి వెలిగించింది. ఆ గదిలోనుంచి వారికి ఇరవైయిరవైఐదుమెట్లు క్రిందకు దిగటానికి కన్పించాయి. ఇద్దరూ క్రిందికిదిగారు. అక్కడ వారికి మరోవాకిలి కన్పించింది. ఆ వాకిలికూడా ఆమెదగ్గరఉన్న తాళంచెవిద్వారానే తెరచుకొన్నది. అక్కడనుండే ఒక పొడవైన సొరంగంగుండా వెళ్ళే మార్గం కన్పించింది. ఆ సొరంగం ఒకపర్వతం క్రిందిభాగాన వున్నది. అది దాదాపు 200 గజాలపొడవుంటుంది. దానిని దాటినతర్వాత అక్కడ మరోద్వారంవుంది.అది తెరచినమీాదట

పైకెక్కటానికి మెట్లు కన్పించాయి. అక్కడ ఆ నీలాంగి కొవ్వొ
వత్తిని ఆర్పేసింది. ఆ సొరంగంలో కన్పించిన ద్వారాలన్నిటికి
లోపలా బయటా ఒక తాళం వేసే ఏర్పాటుఉంది. అక్కడ చిన్న
సందుగుండా ఆ నీలాంగి బయటకు చూచింది. ఆమెకు ఒక
చక్కగా అలంకరింపబడిన గది కన్పించింది. ఆ గదిలో దోమ
తెరలోఉన్న ఒకవ్యక్తితో మాధవి మాట్లాడుతూఉండటం
నవ్వుతూఉండటం కన్పించింది, ఆ వ్యక్తి చాలా మోటుగా కన్పి
స్తున్నాడు. అతనిని ప్రతిరాత్రీ కలుసుకోటానికి మాధవి ఎందుకు
వస్తున్నదో అర్థం కావటంలేదు.

ఆనీలాంగి ఇంద్రజితసింహునికికూడా ఆ దృశ్యం చూపిం
చింది. అతనికి వారిమాటలువిన్పించక పోయినా వారిహావభావాల
వారుపరస్పర ప్రేమబంధితులైనట్లుస్పష్టమౌతోంది. కొద్దిసేపైన
తర్వాత వారిద్దరూ మంచంపై నిద్రించారు. ఇంద్రజితుడు అక్క
డికి వెడదామన్నాడు. ఆనీలాంగి అతనిని నివారించి తిరిగివెళ్ళి
పోదామన్నది. ఇద్దరూ వెనక్కితిరిగారు. తలుపులు తెరుచు
కుంటూ తిరిగి తాళాలు వేసుకుంటూ తిరిగి ఇద్దరూ ఇంద్ర
జితుని గదికివచ్చారు. ఆమె ఇంద్రజితుని ఆరుబైటకు తీసు
కొనివెళ్లి ఒక రాతిమీద కూర్చొబెట్టింది.

ఇంద్ర:- వాళ్లున్న గదిలోనికివెళ్ళకుండా నన్నెందుకు
ఆపావు.

నీలాంగి:-అట్లా వెళితే మనకేం లాభం? మనల్ని బంధిం
చినా బంధించవచ్చు. నీవు నేనువచ్చిన త్రోవగుండా బైటకు
వెళ్ళలేవుకూడా.

ఇంద్ర:- ఎందుకు వెళ్ళలేను?

నీలాంగి:- ఆసంగతి తర్వాత నీకే తెలుస్తుంది.

ఇంద్ర:- అయితే నన్నేంచేయమంటావు?

నీలాంగి:- పది పదిహేనురోజులు ఇంకా నీవు ఇక్కడే వుండాలి.

ఇంద్ర:- ఆటక్కులాడితో నేనుండగలనా?

నీలాంగి:- ఉండాలి మఱి.

ఇంద్ర:- పోనీ తర్వాత?

నీలాంగి:- ఆతర్వాత నీవిక్కడినుంచీ బైటికి వెళ్ళనవసరంలేకుండానే ఈరాజ్యమంతా నీవశమేఅవుతుంది.

ఇంద్ర:- అయితే మాధవికూర్చున్న మంచంమీదవున్న వాడు రాజా?

నీలాంగి:- కాదు మాధవియే రాణి. అతడు మంత్రి.

ఇంద్ర:- మాధవి రాజ్యపరిపాలన చేయటంలేదే?

నీలాంగి:- అంతసమర్థురాలేఅయితే మంత్రిని సంతోష పెట్టవలసిన పనేముంది?

ఇంద్ర:- అయితే మంత్రే రాజన్నమాట. పోనీ నీ విప్పుడేంచేస్తావు?

నీలాంగి:- నీకు చెప్పవలసి అనవరంలేదు. పదిపన్నెండు రోజులతర్వాత తిరిగికలుస్తాను. అంతవఱకుచేసిన పనిఅంతా అప్పుడేచెబుతాను. మాధవికి అనుమానం కలుగకుండా ప్రవర్తించు.

ఇంద్ర:- సరే! ప్రయత్నిస్తా.

ఆమె అక్కడినుంచి వెళ్లిపోయింది. అతడుతిరిగి తనగది దగ్గఱకు వచ్చాడు. ఇంతవరకూ వారిరహస్యకాండ ఎవరికీ

తెలియదంటున్నారుగాని మాధవికి తెలియకుండానే ఆ నీలాంగికి ఆటంకాలు కలిగించేవారు తమవన్నాగాలు తాముపన్నుతూనే ఉన్నారు.

## 15

శ్రీదత్తునిభార్యకు ఒక చెల్లెలున్నది. చెల్లెలి పేరు మాయావతి ఆమె 'గయ' మహారాజైన చంద్రదత్తుని వివాహమాడింది. ఆ మాయావతి కూతురే మాధవి. మాధవికి రెండేళ్ళప్రాయంనన తల్లి గతించింది. మాధవిని రాణినిచేసి ఆ తర్వాత తండ్రికూడా గతించాడు. కనుక మాధవీ కిశోరీ అప్పచెల్లెండ్రబిడ్డలు. మాధవితండ్రి ఐంద్రజాలికుడు. అతడు తన భార్యను చాలా గాఢంగా ప్రేమించేవాడు. అతడు రాజధానిని విడచి దూరంగాపున్న 'రాజగృహ' అనేచోట ఉండేవాడు. అది తీర్థస్థానంకూడా. అక్కడ ఒకసుందరమైన మందిరాన్ని నిర్మించాడు. ఆ చోటునే ఇప్పుడు ఇంద్రబీరసింహుడు ఉంటున్నాడు. చంద్రదత్తుడే స్వయంగా ఆ చోటికి రహస్యమార్గాలను తయారుచేశాడు. మితిమీరినగారాబంవల్ల మాధవికి తల్లిదండ్రులు మంచిశిక్షణ ఇవ్వలేకపోయారు అందుచేత ఆమె సమర్థురాలు కాలేకపోయింది. మాధవి అధికారానికి వచ్చిన తర్వాత ఆ రాజ్యాధికారాన్ని ముఖ్యంగా ముగ్గురు అనుభవిస్తున్నారు. వాళ్లుఅగ్నిదత్తుడు, కుబేరసింహుడు, ధర్మసింహుడు. వీరిలో మొదటివాడు మంత్రి, రెండవవాడు సేనాపతి మూడవవాడు కొత్వాలు.

ఒక నడివయస్సులోవున్న స్త్రీని పట్టుకొనటానికి యోగినీ వనచరీ చెరువులో దూకినచోట ఇప్పుడు మనఇంద్రజాలికులు ముగ్గురు ఏదో బ్రహ్మాండమైనపనికి పూనుకొంటున్నట్లు సమాలోచనలు కావిస్తున్నారు. బదరీనాథుడు భైరవసింహుడూ, తారాసింహుడూ ఆ చెరువుఒడ్డున కూర్చుని ఉన్నారు.

భైరవ:—రాజకుమారుని అక్కడనుంచి తీసుకొనిరావటం ఏమంత గొప్పపనికాదు.

తారా:— ఇన్నాళ్ళనుంచీ రాజకుమారుని బంధించిపెట్టిన వాళ్ళను శిక్షించవద్దా ?

భైరవ:— తప్పకుండా శిక్షించాలి.

బదరీ:— నిన్న మీ తండ్రి చెప్పిన అభిప్రాయమే అనుసరణీయంగా కన్పిస్తోంది. ఇక్కడ లలిత, తిలోత్తమ ఉన్నారని తెలుస్తోంది.

తారా:— ముందు వాళ్ళసంగతి కనుక్కుందాం.

భైరవ:— అనవసరంగా వాళ్ళ ప్రసక్తి దేనికి? మనము మనపని చేసుకొనిపోతే చాలదా ?

తారా:— అవును నిజమే.

భైరవ:— ఆయన ఈ పనిచేయండి ! వీలుంటే లలితా తిలోత్తమలను నేను పట్టుకుంటానన్నాడుకూడా—

బదరీ:— మనం ఆలస్యంచేయటం మంచిది కాదు.

భైరవ:— ఆలస్యమెందుకు ? ఎవరెవర్ని పట్టుకోవాలో ఇక్కడే తేల్చుకొందాం.

బదరీ:— మంత్రిని నాకు విడచిపెట్టండి.

భైరవ:- అవున్లే మీరిద్దరూ స్థైర్యంలో సమానులు. సరేగాని, నాకు సేనాపతిని వదలిపెట్టండి.

తారా:- పోతే నాకు ఆ కొత్వాలా? సరే! ఏం చేస్తాం!

ముగ్గురు విచిత్రబాలికులూ అక్కడనుంచి బయలు దేరారు. కుడివైపునుంచి యెవరో తుమ్మినశబ్దమైంది.

బదరీ:- ఓరి నీ దుంప తెగ. ఇప్పుడే నా తుమ్మేది?

తారా:- మీరు తుమ్మితే భయమా ఏమిటి?

బదరీ:- తుమ్మితే నాకు భయములేదుగాని తుమ్మిన వాణ్ణి చూస్తేనే నా మనస్సు గలుక్కుమంటుంది.

భైరవ:- మన పని కేదో ఆటంకం వచ్చేటట్లే ఉన్నది.

బదరీ:- అసలు తుమ్మినవాణ్ణి పట్టుకోండి! ఇందాక నుంచీ వాడెవరో మనమాటలు వింటూ కూర్చున్నాడు.

బదరీనాథుడు తుమ్మినవాణ్ణి పట్టుకోటానికి ఇటూ అటూ వెదికాడు ఎవరూ వాళ్ళచేతికి దొరకలేదు చేసేది లేక ముగ్గురూ ముందుకు నడిచారు.



# మా యమాను

## రెండవ అధ్యాయం

### 1

ఇంకొకగంట ప్రొద్దున్నది. కిశోరి లోగడ తెలియజేసిన తోటలో డాబామీద కూర్చుండి ఉదాసీనగా ఉన్నది. దగ్గర ఏడెనమండుగురు చెలికత్తెలున్నారు. ఆమె ఆకాశంవంక మీనమేషాలు లెక్కపెడుతూ ఏదో ఆలోచిస్తోంది. కమల వెళ్ళి చాలారోజులైంది. ఆమె ఇంతవరకూ దిగిరాలేదు. బహుశః ఆమె కమలనుగూర్చే ఆలోచిస్తున్నట్లుంది. రాత్రి చాలా గడచినతర్వాత ఆమె డాబానుండి క్రిందకు దిగి తన గదిలోనికి వెళ్లిపోయింది. అంతలో కమల తనమామూలు రూపంలోవచ్చి చేరుకొన్నది. కమలను చూచి కిశోరి చాలా సంతోషించింది.

కిశోరి:—ఇన్నాళ్ళదాకా ఏమేమిచేశావో చెప్పు ! ఇంతకీ ఆయనను కలుసుకొన్నావా లేదా ?

కమల:— అదేపనిమీద వెళ్ళినదానిని కలుసుకోకుండా వస్తానా?

కిశోరి:— వారు నన్నేమైనా అడిగారా ?

కమల:— అడగట మేంకర్మం ! ప్రాణాలు బలిఇవ్వటానికి సిద్ధంగా ఉన్నాడు. ఇక రెండుమూడురోజులలో నిన్ను కలుసుకొవాలనుకొంటున్నాడు.

"నిజంగానా !" అని ఆశ్చర్యపోయింది కిశోరి.

కమల:—నీతో అబద్ధం చెప్పవలసినపని యేముందమ్మా?

కిశోరి:— వారు మాధవినుండి విడుదలయ్యారా?

కమల:— మాధవి ఇంద్రజీతసింహుని పర్వతాలమధ్య ఉన్న ఇంట్లో పెట్టింది. ఒకసారి మనల్ని అక్కడకు కళ్ళకు గంతలుకట్టి తీసుకొనివెళ్ళింది. గుర్తున్నదా ?

కిశోరి:— అవును. భయంకరమైనచోటు.

కమల:— అయితేనేం? అక్కడకూడా మా వారి ఐంద్ర జాలికులు ప్రవేశించారు.

కిశోరి:— ప్రవేశించి ఏంచేశారు ?

కమల:— అక్కడఉన్న దాసదాశీలను వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించింది. వాళ్ళందరూ వెళ్ళిపోయారు "అగ్నిదత్తుడికీ మాధవికీ కల రహస్యసంబంధాన్ని ఇంద్రజీతసింహుడు తెలుసుకొన్నాడు. బహుశః అయిదారురోజులలో వారి ఐంద్రజాలికులు ఆ రాజ్యాన్ని కూలద్రోసినా త్రోయవచ్చు.

కిశోరి:— ఇంద్రజీతసింహులు విడుదలఅయినారంటివిగా.

కమల:— విడుదలైనమాట నిజమే కాని వారి ఐంద్రజాలికులు మాధవిపని పట్టించాలనిచూస్తున్నారు. ఇంద్రజీతసింహుని విడిపించాలని ఐంద్రజాలికులు మొదట ఆలోచించారుగాని చివరికి ఆ పని నా వల్లనే అయింది. నేను వారిని చునార్‌గఢానికి పంపించివచ్చాను.

కిశోరి:— వా రేమన్నారు ?

కమల:— ఆయన చెప్పటానికి చాలాసంగతులే చెప్పారు

గాని అన్నిటి సారాంశం మొత్తంమీద నిన్ను చునార్ గఢానికి సాధ్యమైనంత త్వరగా రమ్మన్నదే

కిశోరి:- (కొంచెం ఆలోచించి) వెళ్ళటానికి సిద్ధమేగాని ఎక్కడ నవ్వులపాలవుతానో అని భయంగా ఉన్నది.

కమల:-అట్లా అని ఊరుకుంటే జరిగేదెట్లా? నీ తల్లిదండ్రులు నిన్ను మనఃపూర్వకంగా శత్రువులైనవారికి అప్పగిస్తారా? నీ కోరికప్రకారం నీవు పనిపూర్తిచేసుకొని వెళ్ళటానికి పడితే చివరికి ఇంద్రజీతసింహుని వదులుకోవలసివస్తుంది.

కిశోరి:- వారిని వదలి నేను జీవించలేను. ఏది ఏమైనా వెళ్ళవలసిందే. కాని నేను వెళ్ళితే అక్కడిపెద్దలు సంతోషిస్తారా?

కమల:- నీ వా బెంగేమీ పెట్టుకోవద్దు. మీ ఇద్దరి ప్రేమవృత్తాంతం అచ్చటివారందరికీ తెలుసు. అయినప్పుడు నీవు అక్కడికి వెళ్ళటం అక్కడివారందరికీ సంతోషకారణమే అవుతుంది. ఒకానొక శత్రురాజుకూతురు తమకు వశంకావటం ఎటువంటివారికైనా విజయంగానే ఉంటుంది. నాతో చంద్రకాంతమహారాజ్ఞి మిమ్మల్ని తప్పకుండా తీసుకొనిరమ్మని మరీ మరీ చెప్పింది. అంతేగాక ఆమె తన ప్రత్యేకరథాన్నీ అనేక దాసీజనాన్నీ నాతోపాటు పంపింది కూడా!

కిశోరి:- అయితే నీవు వాళ్ళనందర్నీ తీసుకొనివచ్చావన్నమాట.

కమల:- మరేమనుకొన్నారు!

కిశోరి:- అయితే నేనిప్పుడే బయలుదేరుతాను. నీవు మాత్రం ఎప్పుడూ నావెంట ఉండాలిసుమా!

కమల:- ఒకప్పుడు మాత్రం వదిలిఉన్నాను గనుకనా ?

కిశోరి:-అయితే ఇక ఇక్కడ ఎవరికీ చెప్పవలసినపని లేదు.

కమల:- పరిచారికలకైనా చెప్పవా?

కిశోరి:- రథం ఎక్కడున్నది ?

కమల:- ఈ ప్రక్క మామిడితోపులో.

కమలవెంట కిశోరిగదినుండి బైటికివచ్చి రహస్యంగా మామిడితోపులోనికి వచ్చింది. అక్కడ రథమూ అనేక దాసదాసీజనులూ ఉన్నారు. ఇద్దరూ రథమెక్కారు. ఆరథం ప్రయాణమై అతివేగంగా పోయింది.

చాలాసేపైన తర్వాత కిశోరి చెలికత్తెలు ఆమెగదిలోనికి వచ్చారు. ఎవరూ వారికి కన్పించలేదు! తోటంతా వెదికారు. అటూఇటూ పరుగెత్తారు. వారిలో కలవరం హెచ్చింది. అర్ధరాత్రిదాకా అట్లాగే వెదుకుతూఉన్నారు. అప్పటికి కమల వచ్చింది. ఆమెను చెలికత్తెలు కిశోరిసంగతి అడిగారు. కమల "కిశోరి ఎప్పటినుంచి కన్పించటంలే"దని అడిగింది. వారు దానికి సమాధానం చెప్పారు.

కమల:- ఆఁ అలాగా అయితే ఎవరో మనశత్రువులు కొంపదీశారు. అయ్యో! నా ప్రియమైన కిశోరి" అని కంటనీరు పెట్టింది.

## 2

సంతోషాంతరంగంతో ఉన్న కిశోరి రథమెక్కి చునార్ గఢదిక్కుగా వెళ్ళుతోంది. కమలకూడా ఆమెవెంట ఉన్నది. ఇంద్రజీతసింహునిగురించి కమల తియ్యతియ్యగా చెప్పేమాటలు కిశోరివింటోంది. అది చీకటిరాత్రి ఆ చీకట్లో రథం అతివేగంగా పోతోంది.

కిశోరి:- కమలా! పరివారజనంకూడా గుత్తాలెక్కారే?

కమల:- అవును.

త్రోవ అంత సాఫీగా లేదు. రథచక్రాలు రాళ్ళపై గుట్టలపై ఎక్కి దడదడలాడుతున్నవి.

కిశోరి:- అబ్బా చాలకష్టంగా ఉన్నది.

కమల:- కొద్దిదూరమే ఇట్లా ఉంటుంది. ఆ తర్వాత సాఫీగా ఉంటుంది.

కిశోరి:- మనం మంచిత్రోవ విడిచిపెట్టి కాపథం అవలంబించలేదుగదా ?

కమల:- లేదు.

కిశోరి:- లేదేమిటి ?

కమల:- ఒకవేళ అట్లా జరిగినా మనకే మంచిదిగా. మనల్ని ఎవరూ కనుక్కోలేరు.

కిశోరి:- పోనీ పరదాలన్నా తొలగించు. మంచిగాలి అయినా వస్తోంది.

కమల ఆవిధంగా చేసింది. కిశోరి ఆశ్చర్యంగా నలు దిక్కులూ చూడసాగింది. అప్పుడే చంద్రుడు ఉదయించాడు.

ఆ వెన్నెలలో కిశోరి భయంకరమైన అడవినిచూచి వణికిపో
సాగింది. ఆమెకు బోయలనువున్నవారంతా పురుషులుగా కన్పిం
చారు. ఆమె నోటినుండి అప్రయత్నంగా "చునారగఢం
తూర్పుదిక్కుగా ఉంటే మనం పడమటిదిక్కుగా వస్తున్నామేం?
ఏదో మోసంజరిగింది ఈ రథముల నాయకులు కారు" అన్నది.

ఆ మాటలువిన్న బోయలు వెంటనే రథంనుండి క్రిందికి
దూకింది. ఆమె బోయలావాళ్ళకు ఏదో చెప్పి ఒక గుఱ్ఱంమీద
వెనక్కి తిరిగిపోయింది. కిశోరికి ఇప్పుడు సంగతిఅంతా పూర్తిగా
అర్థమైపోయి కన్నీరు పెట్టి స్పృహలేకుండా పడిపోయింది.



చునారగఢంలో ఒకనాటి ఉదయాన తేజసింహుడూ
వీరేంద్రసింహుడూ, ఆనందసింహుడూ సైన్యసమేతంగా దక్షిణ
దిక్కుగా వెడలిపోయారు.

## 3

విజయగఢ రాజ్యంలో మంత్రి అగ్నిదత్తుడూ, సేనాపతి
కుబేరసింహుడూ, కోశాధ్యక్షుడు ధర్మసింహుడూ అనీ తెలుసు
కొన్నాం. వీళ్ళు ముగ్గురూ కలిసి విజయగఢరాజ్య సంపదను అనుభవి
స్తున్నారు. ముగ్గురిలోను రాజ్యాధికారమేకాక మాధవిని
కూడా చిక్కించుకోవాలని అగ్నిదత్తుడు చాలా దుఃఖిస్తు
న్నాడు. కుబేరసింహుడు ధర్మసింహుడు కోటలోనికి అగ్నిదత్తు
నికి స్నేహితులైనా మాధవిని గురించిన తలంపు వచ్చినప్పుడల్లా

వీరిద్దరికీ అగ్నిదత్తునిపై ఈర్ష్యాద్వేషాలు జనించేవి. మాధవిని చూచినతర్వాత వారి యీర్ష్యకు మితీహద్దు లేకుండాపోయింది.

ఆరోజున అర్ధరాత్రి సమయంలో నిశ్శబ్దంగావున్న ఆ గదిలో అగ్నిదత్తుడు ఆలోచిస్తూ మంచంమీద కూర్చొని ఉన్నాడు. అతని నోటినుండి అప్రయత్నంగా "బహుశః వేరొక చోట తన ఆనందానికి వీలుచూచుకొని ఉన్నదేమో ? నేను నిశ్చింతగా కూర్చొనటం పొరపాటు. అయినా ముందు స్నేహితులతో సంప్రదిస్తాను." అనేమాటలు వెలువడ్డాయి. అతడు గదినుండే వెలుపలికి వచ్చాడు. అతని చేతిలో కత్తి ఉన్నది. అగ్నిదత్తుడు ఎచ్చటికో వెళ్లే ప్రయత్నాన్ని చూచి సైనికులు అతనిని అనుసరించారు. కాని అతడు వారిని వారించి ఒంటరిగానే బయలుదేరాడు. సరాసరి కుబేరసింహుని ఇంటికి వెళ్ళాడు.

అక్కడే కొత్వాలుకూడా ఉన్నాడు. అతనికి ఆ అర్ధ రాత్రి సమయంలో కొత్వాలు ఉండవలసిన అవసరమేమిటో బోధపడలేదు.

సేనాపతి:- ఈ అర్ధరాత్రివేళ మీరెందుకొచ్చారు?

మంత్రి:- మీ యిద్దరిసలహా తీసుకోవలసిన అవసరం ఏర్పడింది.

కొత్వాలు:- అదేమిటో తెలియజెప్పండి.

మంత్రి:- అదిసరేగాని మీరెందుకిక్కడికి వచ్చారు?

కొత్వాలు:- "ఏదో మాట్లాడుకొంటూ సాయంకాలం నుంచి ఇక్కడే ఉన్నాను. మీ సంగతేమిటో చెప్పండి.

మంత్రి:- మాధవినిగురించి ఆలోచించటానికి వచ్చాను.

సేనాపతి:- మాంధవికేమైంది ?

మంత్రి:- ఆమె ఈ మధ్య చాలా విచిత్రంగా ప్రవర్తిస్తోంది. మహాలులోనికి రావటంకూడా తగ్గించింది. ఎప్పుడూ ఆ పర్వతప్రదేశంలో వుంటుంది. ఎప్పుడన్నా బుద్ధిపుట్టితే అర్ధరాత్రివేళల్లో వస్తోంది.

కొత్వాలు:-అక్కడ ఆమెకు రాచకార్య మేమున్నదబ్బా!

మంత్రి:- బహుశః అక్కడెవరో పురుషుణ్ణి చూచుకొన్నట్లు నాకర్థమవుతున్నది.

సేనాపతి:- అయితే వెదకుదాం.

మంత్రి:- వెదకాలని ప్రయత్నించే విఫలుణ్ణయ్యాను. ఆమె తాళాలు వేసుకొంటూ వెళ్ళినమీదట ఏమిచేసి వెను తుందోగాని తాళంచెవులు ఉపయోగపడవు.

కొత్వాలు:- అయితే వాకిళ్ళు బద్దలుకొట్టి వెళ్ళాలి.

మంత్రి:- అట్లా చేస్తే పైకి పొక్కదూ?

కొత్వాలు:- పొక్కితే ఏం? మనదేగా రాజ్యం.

ఇంతలో ఎవరో వస్తున్న అలికిడైంది. అటు దిక్కుగా చూచారుగాని ఎవరూ కన్పించలేదు. కొత్వాలు బైటకుకూడా వెళ్ళిచూచాడు. కాని అతనికీ ఎవరూ కన్పించలా. ఆతర్వాత వాళ్ళు ఏవేవో ప్రణాళికలు సిద్ధంచేసుకొని తెల్లవారినతర్వాత వాళ్ళత్రోవన వాళ్లు వెళ్ళారు.

మరునాడు ఒకజాముపొద్దుపోయిన సమయంలో కొత్వాలుగారింట్లో ఒకతమాషా జరిగింది. అతడేవో కచ్చేరీకి సంబంధించిన కాగితాలు చూచుకొంటున్నాడు. ఇంతలో అత

నికి గలభాజరుగుతున్నట్లు వినిపించింది. పరీక్షించిచూడగా అతని యింటివాకిటముందే కొట్లాట జరుగుతున్నది. కొత్వాలు ఒకణ్ణి పంపి సంగతి సందర్భాలు కనుక్కొనిరమ్మన్నాడు. అతడు తిరిగివచ్చి యెవరో యిద్దరుమనుషులు పోట్లాడుకుంటున్నారు. వాళ్లు మీ దగ్గఱ తీర్పుకోసం లోనికి ప్రవేశించబోతే మన కావలావాళ్ళు అడ్డగించారట. అందుకుగాను వాళ్లు కావలా వాళ్ళతో తగాదా వేసుకొన్నారు” అని చెప్పారు.

కొత్వాలు:- వాళ్లెట్లా కన్పిస్తున్నారు ?

సేవకుడు:- మంచివాళ్ళలాగానే ఉన్నారు. ఇంకా మీసాలుగూడా రాలా.

కొత్వాలు:- అయితే వాళ్ళను ప్రవేశపెట్టు.

అతడు వెళ్ళి ఆ మనుష్యులిద్దర్నీ కొత్వాలువద్దకు తీసుకొనివచ్చారు. వాళ్లు యువకులే. గాని చాలా అందంగా కన్పిస్తున్నారు. చేతుల్లో ఆయుధాలులేవుగాని శరీరాలు రక్తసిక్తాలై ఉన్నాయి.

కొత్వాలు:- ఏమిటి మీవ్యవహారం అని ప్రశ్నించారు.

అందులో ఒకడు నమస్కారంచేసి “మేమిద్దరం చాలా పెద్దమనుష్యులం. ప్రభువారి నౌకర్లు అనవసరంగా నోరు పారవేసుకొన్న కారణంగా......”

కొత్వాలు:- అయితే మీరిద్దరూ ఎందుకు పోట్లాడుకొంటున్నారు.

రెండవవాడు:- అయ్యా! మేమిద్దరం రైతులం. అన్నదమ్ములం. ఒక ఆడదానిమూలంగా మాయిద్దరిమధ్యా పోట్లాట

వచ్చింది. మీరు న్యాయం చేకూర్చాలి. మిగతాసంగతి యింతమందిలో చెప్పలేకపోతున్నాం!

కొత్వాలు అక్కడ ఇతరులెవరూ లేకుండా చేశాడు.

మొదటి:- ఇక్కడనుంచీ ఒకకోసెడు దూరంలో ఒక పర్వతముంది. మేము ప్రియస్నేహంగారిదగ్గర యేదైనా ఒకగ్రామం గుత్తకు తీసుకోవాలని బయలుదేరాం. మేము ఆ పర్వతందగ్గరికి వచ్చినతర్వాత కొంచెంసేపు ఆగాం. గుఱ్ఱాలు మేయటానికి దూరంగా వెళ్లాయి. మేము ఒక బండమీద కూర్చొని మాట్లాడుతూ ఉన్నాం.

రెండవ:- కాదు. కాదు.

మొదటి:- ప్రభూ వీడ్ని కొంత నోరుమూయించండి. నేను చెప్పినతర్వాత వీనికూడా చెప్పుకోమనండి.

కొత్వాలు వాడ్ని గదలించి మౌనంగా ఉండేట్టు చేశాడు.

మొదటి:- మాకొక్కడ దగ్గరలో ఒక ఆడది యేడుస్తున్న శబ్దం వినబడ్డది. మా యిద్దరికీ ఆమెరోదనపు చాలా జాలికలిగించింది ఇద్దరం ఆ గుట్టవైపు వెళ్లాం. అబ్బా ఆమె ఎంత అందమైందని చెప్పను! ప్రపంచం మొత్తమీద అటువంటి అందగత్తె ఉండదు. ఆమె ఒక చిత్రపటాన్ని ఎదురుగా పెట్టుకొని కుళ్ళికుళ్ళి యేడుస్తోంది.

కొత్వాలు:- ఆ పటం ఎవరిది?

మొదటి:- నాదే ప్రభూ!

రెండవ:- అబద్ధం. ఆ పటం నాదే ప్రభూ.

కొత్వాలు:- నిజంగానా.

రెండవ:- తప్పకుండా అది మీ పటమే. వీణ్ణి ఒట్టేసుకొని చెప్పమనండి.

కొత్వాలు:- (మొదటివానితో) ఏమోయ్ ?

మొదటి:- అయ్యో ! ఊఁ......

కొత్వాలు:- చెప్పవేఁ ?

మొదటి:- అవును ప్రభూ ! అది మీ పటమే!

కొత్వాలు:- అయితే అబద్ధమెందుకు చెప్పావు.

మొదటి:- ఇక యెప్పుడూ అబద్ధం చెప్పను క్షమించండి ప్రభూ !

కొత్వాలు తన చిత్రపటాన్ని పెట్టుకొని ప్రేమపూరిత హృదయంతో కన్నీరుమున్నీరుగా విలపించే ఆ ప్రపంచసుందరి యెవరాయని ఆలోచించసాగాడు. వాళ్ళని "తరువాత ఏం జరిగిం"దని ప్రశ్నించాడు.

మొదటివాడు:- (తన తమ్ముణ్ణిచూపి) వీడు ఆమెను బలవంతంగా చేబట్టటానికి సాహసించాడు.

రెండవవాడు:- ఆ విషయంలో వీడు నాకు తీసిపోలేదు ప్రభూ.

మొదటివాడు:- ఆమె చివరికి నన్నే పెళ్లాడటానికి రాజీ వడింది.

రెండవవాడు:- అదంతా వట్టిఅబద్ధం. ఆమె తన యెదుట నున్న చిత్రపటంలోని వ్యక్తికే ప్రాణాల సమర్పించుకొన్నది. కాని వీడు ఆమెను బలవంతపెట్టేసరికి తనదగ్గరఉన్న కత్తితో గాయపరచింది. ఈ చిత్రపటంలోవున్న వ్యక్తిని అన్వేషించ

వలసిందిగా నన్నూ వేడుకొన్నది. అందుకు నేను అంగీకరించే సరికి వీడు నాతో దెబ్బలాటకు దిగాడు.

కొత్వాలు:- అయితేమీరు నన్ను ఆమెదగ్గరకు తీసుకొని వెళ్ళండి

మొదటి:- ఇంకా ఆమె అక్కడే కూర్చుని ఉంటుందా?

రెండవ:- తప్పకుండా ఆమె అక్కడే ఉండిఉంటుంది.

కొత్వాలు ఒక పిస్తోలునిండా గుండ్లు నింపుకొని ఆ సోదరులిద్దరితో ప్రయాణమయినాడు. అతడు ఒక గుఱ్ఱాన్ని ఎక్కి కొద్దిపాటి సైన్యంతో నడక సాగించాడు. రెండుగంటల పాటు ప్రయాణం చేసినమీదట వాళ్ళు ఒక కొండ దిగువ భాగానికి చేరుకొన్నారు. సోదరులిద్దరూ కొత్వాలును అక్కడ ఆగమన్నారు.

మొదటి:- ఆస్త్రీ యిక్కడే మాకు కన్పించింది. ఆమెను మీరు దగ్గరికి వెళ్ళి చూడటం బాగుండదు. ఆమె గయ రాజ్యానికి రాణీనని చెప్పకొంటోంది అన్నాడు.

ఇప్పుడు కొత్వాలుకు మరొకసందేహం పట్టుకొంది. అతడు (తనలో) గయ రాణి మాధవిగదా! మరి యీమె యెక్కడినుంచి వచ్చింది. ఒకవేళ మాధవియేనేమో! ఆమె యిక్కడ కెందుకువస్తుంది? ఆమె మంత్రికి ఏనాడో కైవసం అయింది. ఒకవేళ వచ్చినా వచ్చిఉండవచ్చు. ఒకసారి మేము ముగ్గురం కూర్చొనిఉండగా రాణీ మాధవ వచ్చింది. అప్పుడు ఆమెకళ్ళన్నీ నాపైనేఉన్నాయి. బహుశః ఆనాటినుండీ నాపై ప్రేమజనించి ఉండవచ్చు. ఆహా! సౌందర్యం ఎంతగొప్పది! ఇక నేనే మహారాజునవుతాను. అయినా వీడు చెప్పినట్లు

చాటునఉండి ఆమెను చూడటానికి ప్రయత్నిస్తాను" అని అనేక విధాలుగా ఆలోచించసాగాడు.

అక్కడ పర్వతాలు గొలుసులాగా కలిసి చాలాదూరం వ్యాపించిఉన్నాయి. కొత్వాలు నిలబడిఉన్నచోట రెండు పర్వతాలు అన్యోన్యం చుంబిస్తున్నాయి. అక్కడ ఒక సెలయేటుకూడా ప్రవహిస్తున్నది కొత్వాలు కొండచఱియ చాటున నిలబడి సోదరులు చూపించిన దిక్కుకుచూచాడు. అతని ఆనందానికి మేర లేదు. "ఆహా! ఏమిఅదృష్టం. తప్పకుండా ఆమె మాధవియే" అనుకొన్నాడు.

# 4

కిశోరిని ఎవరో మోసగించి తీసుకొనిపోయారని కనుల నిశ్చయించుకొన్నది. ఆమె ఆ తోటలో ఎక్కువసేపు ఆగలేదు. మాయాజాలపు వస్తువులతోబాటు ఒకలాంతరు తీసుకొని బైలుదేరింది. కిశోరిని దొంగలించినవాళ్ళు దేనిమీద తీసుకొని పోయారో వెదకటానికి ఆమె తోటలో కొంత ప్రయత్నం చేసింది. మామిడితోపులో తప్ప మిగతా చోటంతా ఆమెకు మనుషుల అడుగులు కన్పించాయి. ఆమె మామిడితోపులో ప్రవేశించింది. అది వర్షాకాలం నేల తడిపొడిగా ఉన్నది. ఆమె కక్కడ రథచక్రాల జాడలు కన్పించాయి. గుఱ్ఱాల అడుగులనుకూడా గుర్తుపట్టింది ఆమె కొంతదూరం రథచక్రాలజాడ వెంట నడచింది. అక్కడనుండీ తిరిగివచ్చి ఒకగుఱ్ఱాన్ని తీసుకొని అదేదారిని బయలుదేరింది. ఐదుకోసులదూరం వెళ్ళిన తర్వాత ఆమెకక్కడ నాలుగుదారులు చీలినచోటు కన్పించింది.

అందులో ఒకదారి నాగగధ దిక్కుగా వెళ్లింది. కుడివైపు రస్తా గయరాజ్యానికి ఎగుడుగుండాఉన్న తోవ, ఒక భయంకరమైన అడవిలోనికి చీలిపోయింది. ఆమెకూ అక్కడ ఎటువైపు వెళ్ళటానికీ దిక్కుతోచలేదు

అప్పుడే చంద్రుడు ఉదయించాడు. ఆమె గుఱ్ఱాన్నిదిగి రథచక్రాల జాడలు వెదికింది; అంతలో ఆమెకు ఎదురుగా కిశోరిని విడిచివచ్చిన మగవేషంలోఉన్న కమల గుఱ్ఱం మీద రావటం కన్పించింది. ఆమె అసలైన కమలనుచూచి మరొకదిక్కుకు మరలింది. ఇంతలో కమల పిస్తోలుతో ఆమెను గురిచూచి కొట్టింది. ఆ దెబ్బతగిలి గుఱ్ఱం కిందబడిపోయింది. గుఱ్ఱంమీదనుంచీ క్రిందికిపడిన మగవేషంలోని కమల గభాలున లేచి జేబులోనుంచి పిస్తోలుతీసి సిద్ధమైన కమలపై గురిపెట్టి కాల్చింది. ఆ గుండు తప్పించుకొన్నది. మళ్ళీ ఒకసారి కాల్చింది. ఆ దెబ్బకూడా యథార్థకమల తప్పించుకొన్నది. తిరిగి కమలా వేషధారిణి పిస్తోలుతో తూటాలు వేయుటానికి ప్రయత్నించింది. ఇంతలో యథార్థ కమల ఆమెదగ్గరకుచేరి పిస్తోలు గురిపెట్టి "జాగ్రత్త. ఆగు" అంది. కమలా వేషధారిణి చేసేదిలేక నిలబడిపోయింది.

యథార్థకమల 'నీ వెవరివో చెప్పు?' అని అడిగింది.

వేషధారిణి ప్రాణాలు పోగొట్టుకోవటానికి సిద్ధంగా వున్నది. కాని తన రహస్యం బైటపెట్టదలచుకోలేదు. అప్పుడు యథార్థకమల ఆమెను క్రిందకుపడవేసి పట్టి బలవంతంగా మత్తుమందును వాసనచూపించింది. మామూలుకమల ఆ రెండవ

మనిషి తన వేషంలోనే ఉండటం గమనించి ఆమెయే కిశోరిని తన వేషంలోవచ్చి మోసగించిందని దృఢపరచుకొన్నది. కమల తన సంచిలోని ఒక సీసాలోనుంచి నీళ్ళను బయటకుతీసి ఆమె ముఖం కడిగింది. ఆమె మాధవి చెలికత్తె లలితగా బైటపడింది. కమలకు లలిత వెనుదిరిగి యెందుకువస్తున్నదో అర్థంకాలేదు. లలితను గుఱ్ఱంమీద వేసుకొని యింటిదిక్కుగా మరలింది.

తెల్లవారేసరికి కమల యింటికచేరుకొన్నది. అక్కడ కిశోరి అంతర్ధానంవల్ల హాహాకారాలు మిన్నుముట్టసాగాయి. కిశోరి తాతగారైన రణధీరసింహుడు పెద్దజమీందారు. అతను కిశోరిని శివదత్తుని శత్రువులైన వీరేంద్రసింహునివర్గంవారే ఎత్తుకపోయారని భావించాడు. కాని కమల తిరిగివచ్చి లలితను చూపించి యీపని మాధవివల్ల జరిగిందని తెలియజెప్పిన తర్వాత అతడు మాధవిపై చాలా కోపగించుకున్నాడు. అతడు క్రోధావేశాన కత్తిదూసి మాధవి శిరస్సును ఖండించి తెస్తానని ప్రతిజ్ఞ చేశాడు.

కమల ఒక చీకటిగదిలో లలితను పడవేసి తన పెద్ద అన్నగారైన హరనామసింహునితో కలసి కిశోరిని వెదకటానికి, కాలినడకన బైలుదేరింది. వాళ్ళిద్దరూ 'రాజగృహా'దిక్కుగా ప్రయాణమై పోయారు.

# 5

ఇంద్రజీతసింహ యువరాజు ఇప్పటివరకూ ఆ రమణీయ స్థలంలోనే ఉన్నాడు. అతనికి అక్కడ ఉండటం యిష్టంలేక పోయినా మాధవితో కలసి రోజులుగడపక తప్పటంలేదు.

అది సాయంకాలసమయం. ఇంద్రజీతుడు ఇంకా గది లోనే పండుకొనిఉన్నాడు. ఒక దాసీకన్య అతని పాదాలను ఒత్తుతోంది. మాధవి తిలోత్తమ గదిలో ఆమెతో కలసి ఏదో మాట్లాడుతోంది. మాధవి సంతోషంగా కన్పిస్తోంది. కాని తిలోత్తమముఖాన విషాదరేఖలు తొణికిసలాడుతున్నాయి. తిలోత్తమచేతిని మాధవి అనునయంగా నిమురుతూ "సఖి యీ వేళ నీవు నేనున్నంత సంతోషంగా లేవేం?" అన్నది.

తిలోత్తమ:- నీవు సంతోషించటంలో అర్థముంది

మాధవి:- అయితే నీకు కిశోరి బందీకృతురాలు కావటం ఇష్టంలేదా?

తిలోత్తమ:- ఆ విషయంలో నాకూ సంతోషమే.

మా:- అయితే నీకు విచారమెందుకు? లలిత తిరిగి రాలేదనా?

తిలోత్తమ:- నాకు లలితను కమల పట్టుకొన్నదేమో నన్న అనుమానముంది.

మాధవి:- అయితే ఆమెను విడిపించే ప్రయత్నం చేదాం.

తిలో:- నాకు ఆమెను విడిపించటానికి వెళ్లే తీరిక లేదు.

నాకు నీకు తెలియని వేరొక కష్టం దాపురించింది. ఆ సంగతి నీకు తెలిస్తే నీవైనా యీ వేళ ఉదాసీనంగా ఉండక తప్పదు.

మాధవి ఆశ్చర్యంగా తిలోత్తమవైపు చూచింది.

తిలో:- నాముఖంచూస్తావేం నేను అబద్ధంఆడటంలేదు. నీవు నీ ఆనందోత్సాహాలలో దీనులనుగురించి ఆలోచించటం మానివేశావు. రెండుమూడు రోజులలో నీ కెటువంటికష్టాలు రానున్నవో నీకు తెలియదు. కిశోరి నీదగ్గఱనే వుండిపోతుందను కున్నావా? బయట ఏమి జరుగుతున్నదో ఆలోచించవేం? నీవు గయరాజ్యాన్ని అప్రతిష్టపాలు చేయదలచుకొన్నావు. నీ ప్రవర్తనను సరిదిద్దుకోవలసిందిగా నీకు చాలాసార్లు చెప్పాను అయినా నీవునామాటలు చెవినిపెట్టవు.

మాధవి:- తిలోత్తమా! నీవనేది ఏమిటి ఈరాజ్యాన్ని సంరక్షించటానికి మహామంత్రి ఎటువంటి కట్టుదిట్టంచేశాడో నీకు తెలుసా? సేనాపతి కొత్వాలువంటి రణధీరులు ఉండగా మనరాజ్యంపై ఎవడూ దండెత్తలేడు.

తిలో:- నీవన్నట్లు వాళ్ళుముగ్గురూవుంటే ఇబ్బందిలేని మాట వాస్తవమే. కాని నీకు వాళ్ళు లేనిసంగతి తెలియదు.

మాధవి:- ఏమిటి నువ్వనేది?"

తిలో:- నిజమే అంటున్నాను. ఈరాజ్యం వీరేంద్ర సింహునికి అతి సునాయాసంగా చేజిక్కిపోతుంది. అందుకే ఇంద్రజీతసింహుని బంధించవద్దంటున్నాను. అతని ఇంద్రజాలి కుల్లో ఒక్కొక్కడు దేవాంతకుడు నేను చాలారోజులనుంచీ వాళ్ళ కార్యకలాపాలు చూస్తున్నాను.

మాధవి:- వీరేంద్రసింహునికి అతనికుమారుడు ఇక్కడ ఉన్న సంగతి తెలిసిందా?

తిలో:- తెలియకుండాఉంటే అతని ఐంద్రజాలికులు ఇక్కడి కెందుకువస్తారు?

మాధవి:- అయితే నీవు ఇంతవరకూ ఎందుకు చెప్ప లేదు.



తిలో:- ఏమి చెప్పను. వినేతీరిక నీకుంటేనా?

మాధవి:- తిలోత్తమా! పరిహాసాలుకట్టిపెట్టి ఏంజరుగుతుందో చెప్పు. నిన్ను చూచుకొనే నే నింతకాలంఅశ్రద్ధగాఉన్నాను. నీవుతప్ప నన్ను గమనించేవాళ్లెవ్వరూ లేరు. నేను ఈపర్వతాల మధ్య ఉన్నంతకాలం ఏమీ భయంలేదనుకున్నాను. కాని యివ్వేళ నీవు చెప్పినమాటలు నా విశ్వాసాన్ని పోగొట్టుతున్నాయి.

తిలో:- నేను నీకోటకు ప్రాణాలు విడవడానికికూడా సిద్ధమే. కాని వీరేంద్రసింహుని ఐంద్రజాలికులముందు నే నెంతటిదాన్ని. నాకుతోడుగా లలిత ఉన్నదనుకొంటే నేడామెకూడా లేదు.

మాధవి:- నీవుఅధైర్యపడక ఇక్కడ వీరేంద్రుని ఐంద్రజాలికులు ఏంజేస్తున్నారో చెప్పు.

తిలో:- మొట్టమొదట ఇచ్చటకు ఎవరువచ్చారో తెలియదుగాని చపల వచ్చినదగ్గరనుంచీమాత్రం నాకు కొంత తెలుసు.

మాధవి:-(అదరిపడి) ఆహా! చపల ఇక్కడకు చేరుకొన్నదా!

తిలో:- చేరుకొన్నది. ఆమె ఇక్కడకువచ్చి నీవు వచ్చి పోయే సారంగంయొక్క తాళంచెవిని తయారుచేసుకొన్నది. ఇప్పుడా సారంగంలోనే 'కిన్నెరి'ని బంధించిపెట్టారు. నీవొక నాడు ఇంద్రజీతుడు నిద్రిస్తుండగా మహామంత్రిని కలుసుకో టానికి వెళ్ళావు. అప్పుడు చపల ఇంద్రజీతునితో కలిసి తన తాళంచెవితో సారంగంతలుపులు తెరచుకొని నీవెనకనే వచ్చింది. మహామంత్రితో కలసి నీవు సరససల్లాపాలాడటం ఇద్దరూచూచారు. ఇంద్రజీతుడు అమాయకుడనుకుంటున్నావు కాబోలు! కాదు. అతనికన్నివిషయాలూ తెలుసు.

మాధవిని ఆశ్చర్యసంభ్రమాలు పెనగొన్నవి. ఆమె "చపలను నీవెట్లాచూచావు?" అని అడిగింది.

తిలోత్తమ:- నాకూ లలితకూ రాత్రిపూట నాలుగు అయిదుసారులులేచి తిరగటం ఒక అలవాటు. నేను మన వసారాలో ఉన్న స్తంభంచాటునఉండి అటూఇటూ చూస్తున్నాను. అప్పుడునాకు చపలా ఇంద్రజీతుడూ సారంగం నుండి బైటకురావటం కన్పించింది. తర్వాత వాళ్ళిద్దరూ చాలా సేపు కాలువఒడ్డున నిలబడి మాట్లాడుకొన్నారు. అప్పటినుంచీ నేను చాలా శ్రద్ధగాఉన్నాను.

మాధవి:- ఆ తర్వాత ఇంకేమైనా జరిగిందా ?

తిలో:- చాలాజరిగింది. చెబుతావిను. మఱునాడు నేను లలితనుతీసుకొని ఆ చెరువువద్దకు వెళ్ళాను. అక్కడ వీరేంద్రుని ఐంద్రజాలికులు కూర్చుండి మాట్లాడుకొంటున్నారు. నేను చాటునఉండి వాళ్ళమాటలు విన్నాను. వాళ్ళు మన మంత్రినీ సేనాపతినీ కొత్వాలును బంధించాలనుకొంటున్నారు. నా

కప్పుడు ఒక తమాషా చేయాలనిపించింది. వాళ్ళు తీరా బయలు దేఱటంచూచి ఒకతుమ్ము తుమ్మాను.

మాధవి:- బహుశః వాళ్ళు భయపడిఉంటారు.

తిలో:- భయపడటమేమిటి ? మనుష్యుల్ని పట్టుకోవాలని చూచారుగాని మేము దొఱకలేదు.

మాధవి:- ఆ తర్వాత ఏంజరిగింది.

తిలో:- నేను తుమ్మటంవల్ల వాళ్ళు తిరుగుపని ప్రారంభించరేమోఅనుకొన్నాను. కాని వాళ్ళు ఆగలేదు. రెండు రోజులల్లోనే మన కోత్వాలీసును బంధించారు. భైరవసింహుడూ తారాసింహుడూ కలిసే యీపనిచేశారు.

తిలోత్తమ మంత్రికూడా పట్టుబడినసంగతి మాధవికి తెలియజెప్పింది. ప్రస్తుతం మాధవి మంత్రి అనుకొంటున్న వ్యక్తి నిజానికి మంత్రి కాదనికూడా చెప్పింది. మాధవికి తిలోత్తమ చెప్పిన విశేషాలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. చివరకు తిలోత్తమను ప్రస్తుతకర్తవ్యాన్ని నిర్దేశించవలసిందిగా వేడుకొన్నది.

తిలో:- నీవిప్పుడు ఇంద్రజిత్సింహుణ్ణి కోరినీ విడిచిపెట్టావంటే ఏకష్టమూ ఉండదు.

మాధవి తిలోత్తమ పాదాలపైబడి యేడుస్తూ "తిలోత్తమా నీవు ఏపనిచేయమన్నా చేస్తాను. కాని ఇంద్రజిత్తుణ్ణి వదులుకోమని మాత్రం చెప్పవద్దు." అన్నది.

తిలో:- చాలాకష్టం. అయితే నేనేంజరుగుతుందో చెప్పలేను.

మాధవి:-నీవు అనుకొంటే అన్నిపనులూ జరుగుతాయి.

తిలో:- మొదట నేను లలితనుగురించి ఆలోచించాలి.

మాధవి:- తప్పకుండా అదేపని చేయి.

తిలో:- దానికంటేకూడా ఒకపని ముందు చేయవలసి ఉంటుంది. లేకపోతే కిశోరి యిక్కడనుంచి విడిపించుకొని పోవ టమేగాక వీరేంద్రుని మాయావులు మనరాజ్యాన్ని కొల్ల గొంటేస్తారు.

మాధవి:- అయితే నీ ఉద్దేశం ఆ నీళ్ళున్న సొరం గాన్ని మూసి వేయాలనా ?

తిలో:- అవును.

మాధవి:- నేనుకూడా ఆ విధంగా చేయటమే మంచి దనుకుంటున్నాను. బహుశః ఆనాడు ఇంద్రజీతుడు సొరం గంలో ప్రవేశించినరోజున ఎవరో ఐంద్రజాలికుడు అటునుంచీ వచ్చిఉంటాడు. అదిచూచి రాజకుమారుడు అదేత్రోవను వెళ్ళాలని చూచాడుగాని వీలులేకపోయింది. మనమిప్పుడు ఆ దోవను మూసివేయటం మంచిది. మీకు అవసరమైతే నేను వచ్చేత్రోవ ఉండనేఉన్నది. మరొకసంగతి నీవు నీతండ్రిని మనకు సాయంగా ఎందుకు తీసుకొనిరావు ? ఆయన మా తండ్రికి చాలాస్నేహితుడు. కాని నేనంటే ఇప్పుడాయనకు పడదు.

తిలో:- నేను నిన్న మా తండ్రివద్దకు వెళ్లాను. ఆయ నకు మన యిద్దరిపైనా అసహ్యాభావం ఏర్పడి ఉన్నది. ఇక నే నెప్పటికీ అక్కడికి వెళ్ళను.

మా:- మన నొసటను ఎట్లా వ్రాసిఉంటే అట్లా జరుగు తుంది. కిశోరిని మరొకచోటను గుప్తపరచటంకూడా అవసరం.

తిలో:- ఇంకెక్కడ దాచటానికి వీలున్నది? మంత్రి గారికి కూడా భయమే.

చాలాసేపు ఈ విధంగా మాట్లాడుకొన్నారు. ఇంద్రజీతుడు మేల్కొన్నాడని కబురువచ్చింది. మాధవి అతనిదగ్గరకు వెళ్ళింది. తిలోత్తమ ఆ నిద్రపోతున్న సారంగాన్ని మూయటానికి వెళ్ళింది.

## 6

[illegible] వెళ్ళిన కోత్వాలు రాణి మాధవి తనను ప్రేమిస్తున్నదని తెలుసుకొని చాలా సంతోషించాడు. అతనికి ఇంద్రజితసాలుడు బంధితుడైనాడనిగానీ ఐంద్రజాలికులు విడిపించటానికి ప్రయత్నిస్తున్నారని కానీ తెలియదు. అందుచేత అతడు అనాయాసంగా ఐంద్రజాలికులవలలో చిక్కుకొన్నాడు. కోత్వాలు తన వెంటవచ్చిన సైనికులతోపాటు మాధవిదగ్గరకు వెళ్ళటం అంగీకరించిద కాదని ఒంటరిగా వెళ్ళాడు. నిజంగానే అక్కడ మాధవి తనవిరహపటాన్ని పట్టుకొని ఉదాసీనంగానే కూర్చొని ఉన్నది. అతన్ని చూడగానే మోహదృష్టులు ప్రసరింపజేస్తూ మాధవి "నీ కోసం నేనెంత పరితపిస్తున్నానో చూశావా? కాని నీకు నాపై ఎంతమాత్రం దయలేకపోయింద" అన్నది.

కోత్వాలు:- నా అదృష్టం ఇంత త్వరగా పండుతుందని తలంచితే నేను అశ్రద్ధ చేసేవాడినా? నీ కోసం నేను అనవరతం చింతాక్రాంతుడనై క్రుంగి కృశిస్తున్నాను.

మాధవి:- ఇదిగో! ఈ యిద్దర్నీ ఇక్కడనుంచి పంపు. మనిద్దరం ఏకాంతంగా మాట్లాడుకొందాం.

ఆ మెమాటలు విని భైరవసింహుడూ తారాసింహుడూ దూరంగా వెళ్ళిపోయారు. మాధవి వేషంలోనున్న చపల కొత్వాలును దూరంగాఉన్న ఒకగుహాలోనికి తీసుకొనివెళ్లింది. చపల మాధవి వేషంలోఉన్నా వయస్సులో తేడా కన్పిస్తూనే ఉన్నది. కొత్వాలు ఈ తేడా కనిపెట్టి అనుమానించసాగాడు. చపలకూడా ఈవిషయం గ్రహించింది. ఆలస్యం చెయ్యకుండా వెంటనే యీల వేసింది. వెంటనే గుహాలోనుండి దేవీసింహుడు కొత్వాలుదగ్గరకు వచ్చి 'కత్తిని క్రిందపడవెయ్యి' మని ఆజ్ఞాపించాడు. కాని కొత్వాలు యుద్ధానికిసన్నద్ధుడై కొంతసేపు పోరాడి చివరకు దేవీసింహునివశమైపోయాడు. ఇక్కడ భైరవసింహుడు తమ యజమానికోసం యెదురుచూస్తున్న సైనికులదగ్గరకు వచ్చారు. ఆ సైనికుల నిద్దరినీ బంధించాలని చూచారుగాని వాళ్ళు యెదురుతిరిగి చివరకు నిహతులయినారు. అప్పుడు ఎవరో ఇంద్రజాలికుల నిద్దరినీ సంబోధిస్తూ "నేను దీనికి బదులు తీర్చుకొనకుండా విడిచిపెట్టనులే" అన్నవాక్యం వినవచ్చింది. అటుదిక్కుగా భైరవసింహుడు చూచాడు. అతనికి ఒకపిల్లవాడు పరుగెత్తుతున్నట్లు కన్పించింది. భైరసింహుడు అతని వెనుక పరుగెత్తాడుగాని ఆ కొండగుహాలలో అతని కాబాలుడు కన్పించలేదు. ఆ బాలుని వేషంలోఉన్న స్త్రీ తిలోత్తమ.

# 7

ఒకసారి ఒక స్త్రీని పట్టుకోటానికి యోగినీ వనచరీ దూకిన చెరువు ఇంద్రజీతసింహుడు బంధితుడైనచోటికి వచ్చే మార్గం. అక్కడికి వెళ్ళటానికి సుతూకగోవ ఆ ప్రవాహంతో నిండిన ఒక సొరంగం. ఆ సొరంగాన్ని ప్రస్తుతం తిలోత్తమ మూసివేసింది. ఆ చెరువులో మునిగి పర్వతానికి ఇవతలఉన్న రమణీయమైన రహస్యప్రదేశానికి రావటం చాలా కష్టం. నీళ్ళలో ఎక్కువసేపు మునిగివుండగలిగిన సమర్థులెవరైనా ఉంటే రాగలుగుతారు. ఆ చెరువులోనుంచి ఇక్కడ సొరంగం వరకూ లోపల ఒక యినుపగొలుసు కట్టబడిఉన్నది. దానిని పట్టుకొని తేలికగానే రావచ్చు.

కొత్వాలును బంధించినతర్వాత చపల ఇంద్రజీతసింహునిదగ్గరకు వెళ్ళి బయటివిశేషాలు చెప్పాలనుకొన్నది. కాని తిలోత్తమ సొరంగాన్ని మూసివేయటంవల్ల వీలులేకపోయింది. దీనివల్ల ఐంగ్రిజాలికులకు తమనుగురించి శత్రువులు తెలుసుకొన్నారని అర్థమైంది

చాలాకాలంతర్వాత ఒకరోజున అర్థరాత్రిసమయంలో ఆ చెరువుప్రక్కన కూర్చొని భైరవసింహుడూ, తారాసింహుడూ, బదరీనాథుడూ, దేవీసింహుడూ చపలా మాట్లాడుకొంటున్నారు. వారు ఇంద్రజీతసింహుని విడిపించటానికి ఎటు ప్రయత్నం చెయ్యాలో యోచిస్తున్నారు.

చపల:_ నేను తయారుచేసిన తాళపుచెవిని ఇంద్రజీతసింహునికి ఇచ్చివచ్చినట్లయితే అతడేదైనా దాని ఉపయో

గాన్ని పొందిఉండేవాడు. ఇప్పుడు మనం అక్కడికి వెళ్ళటం చాలాకష్టం.

బదరీ:- ఇంద్రజీతసింహున్ని బస ఈ కొండ అవతల ఉన్నది. ఏదైనా కష్టపడి యీ కొండ ఎక్కే తోర్పాటుచేస్తే అవతలివక్కకు వెళ్ళగలం.

భైరవసింహుడు:- అవని చెయ్యటానికి చాలాకాలం పడుతుందండీ.

తారాసింహుడు:- మొట్టమొదట ఇంద్రజీతసింహుడు బందీగా ఉన్నచోటికి ఎవరో మగవాళ్ళు వెళ్ళి అతనివి పక్కనే బాధించకుండా చూచుకోవలసిఉన్నది. ఆడవాళ్ళు ఎంతమంది ఉంటేమాత్రం ఏంచేస్తారు లే.

దేవీసింహుడు:- ఇంద్రజీతుడు అంత అసమర్థుడేమీ కాదులే.

భైరవ:- ఇంద్రజీతునికి మనం వచ్చిపోయేదారికి ఆవరోధం కలిగిందని తెలిస్తే అతడేదైనా చెయ్యకుండా ఊరుకుంటాడా ?

తారా:- అలా ఊరుకుండేవాడు కాడు. ఏదో ఒకటి చేస్తాడు.

ఇంతలో చెరువుకు అవతలిప్రక్కన ఎవరో నీళ్ళలోనికి దిగుతున్నట్లు కన్పించింది. ఐంద్రజాలికులు ఆ వ్యక్తిని పరిశీలనగా చూచారు. ఆ మనుష్యుడు చెరువులో దూకి మధ్యనున్న స్తంభందగ్గరికి వెళ్ళి కన్పించకుండాపోయాడు.

భైరవ:- అతడెవరో ఐంద్రజాలికుడు. మాధవిదగ్గరకు వెళ్ళాలని ప్రయత్నిస్తున్నాడు.

చపల:— మాధవిదగ్గర ఇంద్రజాలికు లెవరూ లేరు. ఇతడు ఆమెకొలువులోనివాడే అయితే సారంగం మాయబడినసంగతి ఎందుకు తెలుసుకొని ఉండడు.

భైరవ:— అవునవును.

తారా:— అయితే మనవాడే అయిఉంటాడు.

దేవి:— తిరిగివచ్చినతర్వాత మనదగ్గరకు పిలుద్దాం.

మునిగివెళ్లిన మనుష్యుడు తిరిగి పైకితేలి స్తంభాన్ని పట్టుకొని అలసట తీర్చుకొంటున్నాడు. ఆ తర్వాత గట్టెక్కి చెరువుఒడ్డున కూర్చుండి ఆలోచిస్తున్నాడు. భైరవసింహుడు అతనిదగ్గరకు వెళ్లాడు. అతడు లేచిపోయాడు.

భైరవ:— భయపడకు. ఏసాయానికి మేమువచ్చినవనికే నీవుకూడా వచ్చావనుకొంటున్నాను.

అతడు:— అవునవును మీరిక్కడ ఉన్నారా ?

భైరవ:— నీవు నన్నెట్లా తెలుసుకొన్నట్లే నీ యందు గల ప్రేమచేత నేనూ నీవు తనువని తెలుసుకున్నాను.

కమల:— మీరు ప్రయాణపండితులని నాకు తెలుసు.

భైరవ:— తెలిసినదానికి అంతగా చెప్పవలసిన పనిలేదను కొంటాను.

కమల:— చెప్పే అర్హతఉన్నవాళ్ళు చెప్పినా ఫరవా లేదు.

భైరవ.— కమలా నీ దగ్గరే కూర్చోవాలని నాకు చాలా కుతూహలంగ ఉన్నది. కాని అక్కడ మా అమ్మా తక్కిన బలగం కూర్చునిఉన్నారు.

కమల:— మీకు సారంగం మాసినసంగతి తెలుసా ?

భైరవ:— తెలుసు.

కమల:— అయితే ఇప్పుడు ఏం చేయాలనుకొంటు న్నారు.

భైరవ:— ఆసంగతి మనవాళ్ళందరితో కలసి ఆలోచిద్దాం పద.

భైరవసింహుడు కమలను తీసుకొని చపలవద్దకుపోయాడు "అమ్మా! యీమె కమల. నీకు తెలుసా? అన్నాడు.

చపల:— బాగా తెలుసు అని కమల క్షేమసమాచారా లను అడిగి తెలుసుకొన్నది. కమలను కిశోరి విశేషాలను అడిగి తెలుసుకొన్నది.

కమల:— కిశోరి మాధవిచేజిక్కింది. మాధవి చెలి కత్తె లలిత కిశోరిని తీసుకొనిపోయింది.

భైరవ:— ఆ! అంతవని జరిగిందా?

కమల:— జరిగింది. ఆ సమయంలో నేను లేను. అని కిశోరి అంతర్ధానగాధను సవిస్తరంగా చెప్పి భైరవసింహుని చూపుతూ "ఈ మహానుభావుడు ఇంద్రజీతసింహుని వేషంలో శివదత్తగఢం చేరుకోబట్టే కిశోరికి అవస్థ కలిగింది.

చపల:— అవునట! విన్నాను. అందుచేతనే శివదత్తుడు కిశోరిని తనదగ్గరినుంచి పంపివేశాడట. అయినా నీవు లలితను పట్టుకొని బలేపనిచేశావు.

కమల:— మీరిప్పుడు ఏం చేయాలని ఆలోచిస్తున్నారు?

చపల:— ఇంద్రజీతసింహుని లోగడ తాను కలుసుకొన్న వృత్తాంతమంతా చెప్పింది. మాటలలోనే ప్రొద్దుపొడిచింది. అందరూ పర్వతం దిక్కుగా లేచి వెళ్ళారు.

# 8

ఇంద్రజీతసింహుడు మాధవి సారంగం తలుపులు తీసుకొని మంత్రిదగ్గరకు వెళ్ళిన అదనుకోసం వేచి ఉన్నాడు. తిలోత్తమయొక్క ప్రోద్బలంవల్ల మాధవి ప్రస్తుతం మంత్రిదగ్గరికి వెళ్ళటంలేదు. సారంగాన్ని మూసివేసినప్పటినుంచి తిలోత్తమ యిప్పుడు మాధవి లోగడ వెళ్లే దారినే వస్తూ వెడుతూ ఉన్నది. ప్రస్తుతం మాధవిదగ్గర ఉండవలసిన తాళపుచెవి తిలోత్తమ దగ్గర ఉంచుకొన్నది. మాధవి నిరంతరం తన దగ్గరనే ఉండటంవల్ల ఇంద్రజీతునికి ఏం చెయ్యటానికీ వీలుచిక్కలేదు. సారంగం వాకిలిఉన్న గదికిపక్కనసారాలో ఇంద్రజీతుడు అటూఇటూ తిరుగుతున్నాడు. ఒకనాటి అర్ధరాత్రిసమయంలో మాధవి మంచంమీద లేకుండా చూచి ఆమె మంత్రిదగ్గరికి వెళ్ళిందనుకొన్నాడు. వెంటనే అతడుకూడా లేచి గోడకు వ్రేలాడుతున్న కత్తిని తీసుకొని దీపం ఆర్పి వసారాలోకి వచ్చాడు. అంతా చీకటి. ఆ సారంగం వాకిలి పక్కగా దాగి కూర్చున్నాడు.

మూడోజాము ప్రొద్దుస్తున్నదనగా వాకిలి తెరచుకొని ఒక స్త్రీ బైటికివచ్చింది. ఇంద్రజీతుడు వెంటనే ఆమె దగ్గర తాళం చెవిని లాగుకొని లోపలికి ప్రవేశించి తలుపు వేసుకొన్నాడు. ఆమె మాధవి. చీకటిలో ఇంద్రజీతసింహుని గుర్తుపట్టలేదు. లోగడ ఒకసారి ఇంద్రజీతుడు ఆ సారంగంలో వెళ్ళి ఉన్నాడు గనుక అతడు నిరాటంకంగా ముందుకు సాగిపోతున్నాడు. రెండవవాకిలి చేరేసరికి అతనికి కొద్దిగా వెలుగు కన్పించింది.

అతడు భయంభయంగా ముందు అడుగులు వేసి ఆ వెలుతురు దగ్గరకు వెళ్లాడు. అక్కడ ఒక స్త్రీ బేడీలు వేసి శృంఖలాబద్ధ అయిఉన్నది. దీపకాంతిలో ఆ యిద్దరు పరస్పరం చూచుకొని ఆశ్చర్యచకితులయినారు.

ఆమె కిశోరి. ఇంద్రజీతసింహుని హృదయఫలకంమీద ఆమె చిత్రపటం ఏనాడో ముద్రితమైంది. కిశోరికూడా ఇంద్రజీతుని రూపలావణ్యాలను మనోనేత్రంతో దర్శించగలుగుతున్నది. చిరకాలం తర్వాత కలుసుకొన్న ఆ ప్రేయసీప్రియులు చాలాసేపు అన్యోన్యవీక్షణతృష్ణ తీర్చుకొన్నారు. ఇంద్రజీతుడు ఆమె బంధనాలను తెగటార్చి ఆమె మృదులహస్తాలను తన చేతపట్టుకొని "కిశోరీ! ఇక్కడికి నీ వెట్లా వచ్చావు?" అని అడిగాడు.

కిశోరి ఇంద్రజీతుని పాదాలపైబ్రాలి "ప్రభూ నేనింత వరకూ దురదృష్టంవల్ల నే ఇచ్చటికి వచ్చిపడ్డాననుకున్నాను. కాని నేడు మీ దర్శనభాగ్యం లభించేసరికి నా అదృష్టమే నన్నిక్కడికి తెచ్చిందని భావిస్తున్నాను. నాకు చెరుపుచేయ తలబెట్టిన లలిత చివరికి మంచే చేసింది. లలితకు ఆ బుద్ధిపుట్టక పోయినట్లైతే నేను మిమ్మల్ని......" అని కిశోరి ప్రేమోన్మాదంతో విలపించసాగింది. ఆమె హృదయవేదనను చూచి ఇంద్రజీతుడుకూడా కంటతడిపెట్టాడు. అతడు కిశోరి నడుముకు తన చేతినిచుట్టి "ప్రియా! నేను నిన్ను ఇక్కడ చూడగలుగుతాననుకోలేదు. నా జీవితంలో ఇవే మధురక్షణాలు. కాని శత్రువులు నిన్ను చాలా ఇబ్బంది పెట్టారు."

కిశోరి:— ఇప్పుడు నా కేవిధమైన కష్టమూ లేదు. నేను

ఇంద్ర:- ఇది రాత్రిసమయంగదా? యుద్ధంచేసి పారి పోదాం.

చపల:- నీ ఉద్దేశం చాలా ప్రమాదమైంది. రాజకుమారిని ఏం చేదామనుకొన్నావు?

ఇంద్ర:- అయితే ఏం చేదాం?

చపల:- నీ కిప్పుడు తిలోత్తమ ఎక్కడున్నదో తెలుసా?

ఇంద్రుడు:- బహుశః ఆమె బైటనేఉన్నదనుకొంటాను.

చపల:- అయితే మహాకష్టం. ఆమె మమ్మల్ని ప్రతిక్షణం కనిపెట్టుకొనే ఉంటుంది.

ఇంద్రుడు:- ఇక్కడ మనకెవరికైనా సాయపడేవారున్నారా?

చపల:- దేవసింహుడు, భైరవసింహుడూ, బదరీనాథుడు మహాలుబైట దాక్కొనిఉన్నారు. కమల మాఱువేషంతో యీ సౌరంగానికి మఱొకదిక్కున ఉంది.

కిశోరి:- ఎవరు?

చపల:- నీసఖి

కిశోరి:- ఇక్కడికెట్లావచ్చింది?

చపల:- అదొక పెద్దకథ. నిన్ను మోసగించిన లలితను పట్టుకొని నిన్ను విడిపించాలని వచ్చింది. మేముకూడా కలిశాం. (ఇంద్రజీతునితో) ఇక మనమిక్కడ ఉండకూడదు ప్రమాదం.

ముగ్గురూ మాధవి మంత్రితోకలిసిఉండేచోటికి వచ్చారు. అక్కడ కమల ఉన్నది. కమల కిశోరినిచూచి సంతోషంతో కౌగలించుకొంది. అంతలో తెల్లవారింది. ఆ మంత్రిగారి భవనంచుట్టూ సుందరమైన ఉద్యానవనం ఉన్నది. దానిచుట్టూ

ప్రాకారం నిర్మితమైవుంది. కోటకు తూర్పుదిక్కున ఒక పెద్ద వాకిలిఉంది. అక్కడ ఒక యిరవైమంది సైనికులు కావలా కాస్తున్నారు. చపలా, కమలా యిద్దరూ త్రాటిసహాయంతో పడమటిదిక్కుగా ప్రహరీగోడదాటి లోనికివెళ్లారు. కోటలోపల తిలోత్తమ ఆజ్ఞప్రకారం సైనికులు అప్రమత్తులై ఉన్నారు. ఆమె అగ్నిగోళంతో శబ్దంచేసినప్పుడు చుట్టుముట్టి కన్పించినవారిని బంధించమని యోధులను ఆజ్ఞాపించిఉన్నది. ఈ నలుగురూ కోటలోప్రవేశించి నడచిపోతూఉండగా తిలోత్తమ కంటబడ్డది. చపల తిలోత్తమనుచూచి మీదబడి పట్టుకోదలచిందిగాని ఇంతలో ఆమె అగ్నిగోళం విసరికొట్టి పెద్దశబ్దం చేసింది. సైనికులు కోటను చుట్టుముట్టారు. ఇంద్రజిత్తుడూ, కమలా, చంపా ఆ సైనికులతో కలపడ్డారు. ఆ మహాలుచుట్టూ దాగిఉన్న ఇంద్రజాలికులుగూడా ప్రహరీద్వారం దగ్గఱకువచ్చి సైనికులను ఎదుర్కొన్నారు. మాధవి సైనికులు అందరూ నేలకొరిగారు. కోటిని తీసుకొని చపల మొదలయినవారు అంతా బయలుదేరారు. ఇంద్రజిత్తుడు కోగని ఎత్తుకొని మిగతావారితో పరుగెత్తలేకపోయాడు. అతని అవస్థచూచి మిగతావారు పరుగెత్తటంమాని నెమ్మదిగా నడవసాగ పట్టారు. ప్రొద్దు బారెడెక్కింది.

అగ్నిదత్త మంత్రిగారిల్లు ఈ కోటకు ఎంతోదూరంలేదు. అతనికి ప్రొద్దున్నే లేచే అలవాటుంది. అతడు అగ్నిగోళం ప్రేలటం విని డాలూ తల్వారూ తీసుకొని కొంతమంది సైనికులతో కోటదగ్గరకు వచ్చాడు. అక్కడక్కడ సైనికులు మరణించటం కన్పించిందిగాని శత్రువులజాడ కన్పించలేదు. అగ్నిదత్తుడు తన

సైన్యాన్ని తీసుకొని ఇంద్రజీతుని వెంబడించాడు. తిరిగి త్రోవలో ఇంద్రజీతసింహునికీ అగ్నిదత్తునికీ యుద్ధం జరిగింది.

అగ్నిదత్తుని దృష్టి కిశోరిపై పడింది. అతడు ఇంద్రజీత సింహునిపై లంఘించాడు. ఇంద్రజీతుడు కిశోరినివదలి అశక్తతో యుద్ధంచేయనారంభించాడు. అగ్నిదత్తుడు అదనుకనిపెట్టి కిశోరిని ఎత్తుకొని పారిపోయాడు. ఇంద్రజిత్తుని క్రోధాగ్నిశిఖాలు అధికమై సింహకిశోరంలా సైన్యంపైబడి వారిని తుత్తునియలు చేశాడు. అగ్నిదత్తుడు పారిపోయినతర్వాత సైన్యాలు ఎక్కడివక్కడ చెల్లాచెదరైనాయి. ఇంద్రజీతుడు గాయాలుతగిలి నేలపైబడి స్పృహకోల్పోయాడు. చపలా భైరవసింహుడూ మొదలైన వారంతా అతనినితీసుకొని ఎవరికంటాపడకుండా పారిపోయారు.

## 9

త్రిలోత్తమ సారంగంగదితలుపులు తెరచిఉండటం చూచింది. తాళంచెవికూడా ఆ గదివాకిలిముందే పడిఉన్నది. ఆమె తిరిగి తలుపులు బంధించుకొంటూ మాధవిదగ్గరకు వెళ్ళిపోయింది.

తిలో:- ఎందుకేడుస్తావు మాధవీ! నేను మొదటే నీ వీ విషయాల్లో చిక్కుకోవద్దని చెప్పాను. వీరేంద్రసింహుని ఇంద్రజాలికులు తలచుకుంటే సర్వనాశనంచేస్తారని చెప్పాను. ఆ దినం సమీపించికూడా...

మాధవి:- వీరేంద్రుని ఐంద్రజాలికులు ఎవరూ ఇక్కడకు రాలేదు; ఇంద్రజీతుడే తాళంచెవిలాక్కొని నా దగ్గర నుంచి పోయాడు.

తిలో:- అక్కడకువెళ్ళి వేనవేల సైనికులను మట్టు

పెట్టాడు. కిశోరిని మీ మంత్రిగారు తెచ్చారు. ఇక కిశోరి చే జిక్కిన తర్వాత మం[illegible]కి [illegible] చేసిన పనేమున్నది. ఇక ఆ దుష్టుడు నిన్ను[illegible] చంపి కిశోరిని రాణీగా చేస్తాడు. అప్పుడు నీ నేమీ చేయుటోవు.

మాధవి:– అయ్యో! నా పాపం ఫలించింది. నా అదృష్టంలో నాకిక రాజ్యాధికారం లేదు. భిక్షుకినై వాడవాడలా తిరగవలసిన గతి పట్టింది.

తిలో:– ఆ [illegible]ని తినటమైనా ఇక్కడనుంచీ పారి పోయిన తర్వాతనే. లేకపోతే ప్రాణమైనా దక్కదు.

మాధవి:– తిలో త్తమా! నేటినుంచీ నీవు గీచిన గీటు దాటను.

తిలో:– అలా అయితే నేనుకూడా వీరేంద్రసింహుని ఐంద్రజాలికులకూ మంత్రికీ బుద్ధి చెపుతానని ప్రమాణంచేస్తు న్నాను. కాని మనం యీ రాత్రి ఇక్కడినుంచి వెళ్లిపోవాలి. ఇక్కడినుంచి ఎంత సంపదను తీసుకొనివెళ్ళగలమో అంతా తీసుకొని పడదాం,

మాధవి:– అయితే ఇక్కడివారిగతేం కావాలి?

తిలో:– దుష్టసహవాసంవల్ల ప్రతిఫలాన్ని వాళ్ళు పొంద వలసినవని ఉన్న దేదో అదే పొందుతారు. నెత్తిమీదకు వచ్చిన తర్వాత వీళ్ళందరిగురించి ఆలోచిస్తామా?

అగ్నిదత్తమంత్రి కిశోరిని తీసుకొని తనఇంటికి వెళ్ళాడు. కిశోరీ వ్యామోహంచేత అతను తనస్వైన్యం సంగతి యేమైందీ తనచుట్టూ ప్రపంచం ఎట్లా మారుతోందీకూడా మఱచి పోయాడు.

కిశోరి దురవస్థ చెప్పనలవికాదు. ఆమె ఇంద్రజీతుని తలచుకొని భూమి ఆకాశాలు బ్రద్దలయ్యేటట్లు యేడుస్తోంది. మంత్రి ఇంట్లో అతనితోపాటు కిశోరివయస్సులో ఉన్న కూతురు కూడా ఉన్నది. ఆమెపేరు కామిని. ఆమె అందంలో ఎంత గొప్పదో స్వభావంలోకూడా అంత గొప్పది. మంత్రిభార్య కూడా చాలా ఉత్తమురాలు. ఆమె దుష్టుడైన భర్తను ఎదిరించలేక అణగిపడిఉన్నది. మంత్రి కిశోరిని తన కుటుంబంలో అప్పగించి ఆమెను ఓదార్చమని ఆజ్ఞాపించాడు. అతని ఆలోచనలు అన్నీ కిశోరిని వశపరచుకొనటంలోనే కేంద్రీకృతమై ఉన్నాయి. అతనికి కిశోరి యెవరో ఆ తీసుకొనిపోవటానికి వచ్చినవారంతా ఎవరో బొత్తిగా తెలియదు. విచారించిన మీదట సజీవుడై ఉన్న ఒక యోధునివల్ల అగ్నిగోళం ప్రేలిన వెంటనే చుట్టుముట్టవలసిందని తిలోత్తమ యోధులను ఆజ్ఞాపించినట్లు తెలిసింది. ఇప్పుడతడు తిలోత్తమనుగూర్చి మాధవినిగూర్చి సంశయించటం ఆరంభించాడు. రాత్రికి తనయింటికి వెళ్ళాడు. తనభార్యను పిలిచి 'ఆ స్త్రీనిగురించి యేమైనా తెలుసుకొన్నావా ?' అని ప్రశ్నించాడు.

మంత్రిభార్య:- ఆమె శివదత్తమహారాజుకూతురు కిశోరి. వీరేంద్రసింహునికొడుకు ఇంద్రజీతసింహుణ్ణి మాధవి ప్రేమించి అతనిని గుహాలో బంధించింది. ఇంద్రజీతసింహునికి కిశోరిపై మక్కువ యెక్కువ. అందుచేత మాధవి లలితవలన కిశోరిని కూడా తెప్పించి బంధించింది. వీరేంద్రసింహుని ఐంద్రజాలికులు ఈ పట్టణంలో చాలాకాలంనుంచీ ఉన్నారు. వారు సమ

యం చూచి కిశోరినీ, ఇంద్రజీతునీ తీసుకొనిపోదలచారు. దాని ఫలితమే యిది.

అగ్నిదత్తుడు వీరేంద్రుని ఐంద్రజాలికుల ప్రసక్తి విని వణికిపోయాడు. కొత్వాలును వీరేంద్రుని ఐంద్రజాలికులే అపహరించివుంటారని అనుమానించాడు. కిశోరిని తనదగ్గరఉంచటంవల్ల ప్రాణాలు దక్కపనుకొన్నాడు. అయినా కిశోరిపై వ్యామోహంవల్ల ప్రాణాలు చివరికి విడిచిపెట్టదలచలేదు.

అగ్నిదత్తుడు కిశోరిని కొంతకాలంపాటు తనయింటివద్ద ఉంచుకోవాలనుకున్నాడు. ఇంతలో మాధవినిచంపి స్వయంగా రాజు కాదలచాడు. ఆ ఉద్దేశంతో అతడు మాధవిని కలుసుకోవాలని మహాలుదగ్గరకు వెళ్ళాడు. మహాలుదగ్గర మాధవి చెలికత్తెలు క్రిందా పైనా పడిఉండటం అతనికి కన్పించింది. మాధవి చెలికత్తెలు వూసగ్రుచ్చినట్లు మాధవి పారిపోయిన వృత్తాంతాన్ని చెప్పారు. అగ్నిదత్తుడు మాధవిచేసిన విపరీతాలోచనలపై విపరీతమైన ఆవేశాన్ని తెచ్చుకొని పళ్ళు పటపట కొరికాడు. ఆ మరునాడే విజయదశమి. ఆ నాడు తాను సింహాసనంపై కూర్చుండి కిశోరిని రాణిగా చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆ మరునాడు ఇంటికిపచ్చి తన మంచంమీద మేను వాల్చబోగా అతనిదృష్టి ఒకకాగితంపై బడింది. ఆ కాగితంమీద ఒక భయంకరమైన వ్యక్తి తనగుండెలమీద కూర్చుండి కత్తితో పొడవబోతున్నట్లుగా ఒకబొమ్మ గీయబడి ఉంది అతడా బొమ్మనుచూచి అడలిపోయాడు.

# 10

ఆనందసింహుని, తేజసింహుని తీసుకొని వీరేంద్ర సింహుడు సైన్యసమేతంగా మాధవి రాజ్యంపై దండెత్తాడు. అతనికి గయను వశపరచుకోవటం పెద్ద కష్టమనిపించలేదు. అతనిని అక్కడ ఎదుర్కొనేవాళ్ళు సహితం లేనేలేరు. దానికి కారణం ఆ రాజ్యప్రజలు ప్రస్తుత పరిపాలనపట్ల విముఖత్వంచెంది వీరేంద్రసింహునివంటి సమర్థపాలకులకోసం ఎదురుచూస్తుండటమే. వీరేంద్రుడు గయ రాజ్యమును సంపూర్ణంగా స్వాధీనపరచుకొని పాలించ నారంభించాడు. సరిగా విజయదశమినాడు వీరేంద్రుడు తమ్మకుమారుడైన ఆనందసింహునికి పట్టాభిషేకం కూడా చేశాడు. అప్పటికి వీరేంద్రసింహుని ఐంద్రజాలికులు గాయాలుతిన్న ఇంద్రజీతుని తీసుకొని గయ రాజ్యానికి చేరారు. చాలాకాలం తర్వాత వీరేంద్రుడు తన కుమారుడైన ఇంద్రజీతసింహుని చూచి సంతోషించాడు. భైరవసింహుడూ తారాసింహుడూ గయలోనే ఉండేట్టు నియామకం జరిగింది. మిగతా ఐంద్రజాలికులు చునార్ గఢానికి వెళ్ళవలసివచ్చింది. కాని రాజ్యంలో ఎవరో చాటుమాటున ప్రజల్ని బెదిరించి ధనం అపహరించటమో హత్యలు చెయ్యటమో జరుపుతున్నారు. ఆ సంగతి విచారించేభారం దేవీసింహునికి అప్పగించగా అతడా పనిమీద వెళ్ళాడు.

ఒకనాడు ఇంద్రజీతసింహుడూ, ఆనందసింహుడూ ఒక గదిలో దోమతెరలలో శయనించిఉన్నారు. వాళ్ళప్రక్కగా తారాసింహుడూ, భైరవసింహుడూకూడా నిద్రిస్తున్నారు. తెల్ల

వారిన తర్వాత చూస్తే వారు శయనించిన గదిఅంతా గులాబి పూవుల వాసనతో నిండిపోయింది. ఆవిధంగా ఉండటానికి, కారణం యెవరికీ తెలియలేదు. దీనిసంగతి తెలుసుకోవాలని మఱునాటి రాత్రి ఇంద్రజాలికులిద్దరూ చాలా మెలకువతో కాపలాకాస్తూ శయనించిఉన్నారు. ఇంతలో వారికి ఏదోశబ్దం వినవచ్చింది. గదితలుపులు నెమ్మదిగా తెరచుకున్నాయి. తారాసింహుడు, భైరవసింహునికూడా లేచాడు. ఇద్దరూ గదివాకిలిదిక్కుగా చూచారు. ఒకతలుపు తెరచుకొనిఉన్నది. వారికి ఒక నవ యౌవనవతి కనబడింది అప్పటికి రాజకుమారు లిద్దరూకూడా మేలుకొని వాకిలిదిక్కుగా చూచారు. ఆనందసింహునికిమాత్రం ఆ లావణ్యవతి రూపురేఖలపై విపరీతమైన వ్యామోహం కలిగింది అందరూ లేచికూర్చున్నారని ఆ విషయం ఆమెకుకూడా తెలుసుకుంది. కాని ఒక్క అడుగుకూడా వెనుక్కు వేయలేదు. ఆనంద సింహుడు లేచి ఆమెదిక్కుగా వచ్చాడు. అతనినిచూచి ఆ స్త్రీ తలుపులు వేసుకొని వెనుక గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె ఆ విధంగా చెయ్యటం చూచి అందరూ లేచారు. ఆ గదిలో నుండి ఆమెకు బైటకు వెళ్ళటానికి త్రోవలేదు. ఈ సంగతి అక్కడివారి కందరికీ తెలుసు. ఆనందసింహుడు ఆమె బంధించి వేసిన వాకిలి గుణపంతో పెకలించివేశాడు. ఆ గది యెవరూ లేరు. ఆ గదికి మూడు వైపులా బలమైనగోడ లున్నాయి. నాలుగవవైపున ఈ వాకిలి ఉన్నది. ఎదురుగాఉన్న గోడకు ఒక అలమరామాత్రం ఉన్నది. భైరవసింహుడు ఆ అలమరలో ఏవో కొన్నివస్తువులుపెట్టి తాళంవేశాడు. ఆ

తాళం వేసినది వేసినట్లే ఉన్నది. మరునాడు వీరేంద్రసింహుడు తనపిల్లలను చూడటానికి వచ్చాడు. ఇంద్రజీతసింహునివలన రాత్రిసంఘటనను తెలుసుకొని ఆశ్చర్యపోయాడు. వీరేంద్ర సింహుడు ఆ రహస్యాన్ని తెలుసుకోవాలని చాలారోజులు ఆ గదిల్లో పడుకున్నాడుగాని మళ్లా ఎప్పుడూ అటువంటి సంఘ టన జరుగలేదు.

# 11

ఐదురోజులు తర్వాత దేవీసింహుడు తిరిగివచ్చాడు. ఆ సంఘటన జరిగిన గదిలోనే వీరేంద్రుడు తన యిద్దరికుమా రులతోనూ భైరవసింహుడూ తారాసింహుడూ మొదలుగాగల పెక్కుమంది సర్దారులతో కూర్చొనిఉన్నాడు. ఇంద్రజీతుడు ఇప్పుడు సంపూర్ణారోగ్యం పొంది కులాసాగాతిరుగుతున్నాడు. దేవీసింహుడు తిరిగి రావటాన్నిబట్టి అతనిని పంపించిన పనిని పూర్తిచేసుకొనివచ్చాడనే అందరూ భావించారు. కాని దేవీసిం హుడు ఒంటరిగా రావటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

వీరేంద్రుడు:- దేవీసింహా క్షేమంగా ఉన్నావా?

దేవీ:- క్షేమంగా లేక నాకేం? (అని మిగతావారి దిక్కుచూచి) ఇక మీరు వెళ్ళండి. చాలా ఆలస్యమైంది.

మిగతావారంతా వెళ్ళిపోయారు.

వీరే:- ఆ విన్నపంలోని సంగతులన్నీ నిజమేనా ?

దేవీ:- అక్షరాలా నిజం. ఈశ్వరునికృపవల్ల ఆ దుష్టుల వర్తమానం త్వరగానే తెలిసింది. కాని నా బుద్ధికి సంభ్రమా

శ్చర్యాలను కొలిపే అనేక విచిత్రసంఘటనలు మాత్రం చూచాను.

వీరే:- (నవ్వి) నీవు ఆశ్చర్యకర విషయాలుచూస్తే మే మిక్కడ అద్భుతవిషయాలు చూచాం.

దేవి:- అదేమిటో చెప్పండి కాస్త.

వీరే:- నీవు చెప్పేది ముందుగా చెప్పు. ఆ తర్వాత మేమూ చెపుతాం.

దేవి:- సరే. గామశిలాపర్వతం దిగువభాగాన నే నొక ప్రకటనను వ్రాసి అతికించాను. దానిలో...

“అగ్నిదత్తుని విరోధులను మీరు శిరఃఖండనంచేసి ఇళ్లూ వాకిళ్ళూ దోచుకొంటారని మాకు తెలుసు. నేను అగ్నిదత్తుని శత్రువులలో ప్రప్రథముడనని ఢంకా బజాయించి చెబుతాను. అంతేగాక గయరాజ్యంలో నా అంత ధనికుడు మరొకడు లేడనికూడా పూర్తిగవిశ్వాసం. వీటన్నిటికీ తోడు నే నొంటరి వాడిని. కనుక మీరు నన్నేమి చేయగలరో చూస్తాను” అని వ్రాశాను.

ఆ దుష్టులను పట్టుకోటానికి ఇంక నే నెన్నో ఉపాయాలు పన్నాను. కాని ఈ ఉపాయంవల్లనే నాకు పని జరిగింది. ఆ మార్గంగుండా వెళ్ళేవాగంతకులూ ఆ ప్రకటనను చదువుకొన్నారు. నేను ఆ పర్వతానికి కొద్దియెత్తున ఒక జాతి తెరచాటునఉండి అది చూస్తూనే ఉన్నాను. ఇద్దరుమనుష్యులు ఒకేసారి వచ్చి ఆ ప్రకటనను చదువుకొని మీసాలు మెలిపెట్టి పట్టణందిక్కుగా వెళ్ళారు. తిరిగి సాయంకాలం వాళ్ళే వచ్చి మళ్లా ప్రకటనను చదువుకొని తలపంకించి పర్వతంవైపుగా

వెళ్లారు. ఆ ప్రకటనయొక్క ప్రభావం వారిద్దరిపైన బాగాపడిం
దని గ్రహించిన నేను వారిని వెంటాడాలనుకొన్నాను. ఆ
విధంగా వెళ్లానుకూడా. ఆఖరికి అనుమానమే నిజమైంది.
వాళ్లు పదిహేనుమందో ఇరవైమందో వున్నారు అందరూ
బాగా బలిష్ఠులై కండలు తిరిగిఉన్నారు. ఆ గుంపులో నేనొక
స్త్రీనికూడా చూచాను. అటువంటి అందమైన స్త్రీని బహుశా
నేనింతకుముందు చూడలేదు, ఆమె చాలా చిన్నవయసులోది
కనుక ఆ గుంపులో ఎవరికూతురో అనుకున్నాను. కాని ఆమె
హావభావాలు ఆజ్ఞలూ చూచినమీదట ఆ స్త్రీయే ఆ బృందా
నికి యజమానురాలని అర్థమైంది. కాని పూర్తిగా నమ్మకం
మాత్రం కలగలేదు. ఆమె విలువైనవస్తుంగా అమూల్యము
లైన ఆభరణాలు చూచినమీదట నాకంతా విచిత్రంగా
కన్పించింది.

ఆమె ఆకారఅందవిశేషాలనువిని ఆనందసింహుడు చలిం
చాడు. ఇంద్రజీతుడు తారాసింహుడు భైరవసింహులుకూడా
కొద్దిగా అనుమానించినట్లు కన్పించింది. వారి ఆలోచనలు
ఒకనాటిరాత్రి తమగదిలో ప్రవేశించిన స్త్రీనిగురించి పోల్చు
కోవటంలో నిమగ్నమైఉన్నారు. ఆనందసింహుడు ఆ స్త్రీని
గురించి యింకా వివరంగా చెప్పండి.

దేవి:- ఎందుకు?

వీరేం:-(కుమారులనుచూచి)ఎందుకు మీరట్లు ఆశ్చర్య
పడతారు.

భైరవ:- మహారాజా! ఆరాత్రి మేము చూచిన స్త్రీ

కూడా యిప్పుడు బాబాయి చెప్పిన వేషభూషణాలతో ఉన్నది. వీరేంద్రుడు ఆశ్చర్యపడ్డాడు.

దేవి:- మీరు ఎటువంటి స్త్రీని చూచారేమిటి?

వీరేం:- ఆసంగతి తర్వాత చెబుతాను ప్రస్తుతం నీవు చెప్పేది చెప్పు.

దేవి:- ఆమెనుగూర్చి మొదటిగుర్తు నుదిటిమీద పెద్దమచ్చ. బహుశా ఆమె చిన్ననాడో కత్తిదెబ్బ తగిలిఉండవచ్చు.

ఆనం:- అవునవును.

ఇం:- అవును ఆ స్త్రీయే.

తారా:- ఇంక అనుమానమేమీ లేదు.

భైరవ:- తప్పకుండా ఆస్త్రీయే.

వీరేం:- కాని ఆమెకు అదృశ్యుల సహవాస మేమిటి? ఇచ్చట మాతోకలహపడటమేమిటి? ఇదంతా ఆశ్చర్యంగా ఉన్నది.

భైరవ:- ఆమెను మేము శత్రువుగా భావించటంలేదు.

దేవి:- మీరేం మాట్లాడుతున్నారో నాకర్థంకావటం లేదు. ఇక్కడిసంగతి సందర్భాలు మీరు తెలియజేయు నంత వరకు నేనేమీ చెప్పను.

వీరేం:- సరే అయితే చిరంజీవుల నడగండి చెపుతారు.

తారా:- నేను చెబుతాను వినండి.

తారా:- అలనాటిరాత్రి జరిగిన వృత్తాంతాన్ని దేవీసింహునికి చెప్పాడు. ఆ స్త్రీ రాకకు నిదర్శనంగా ఆనాడామె గదిలోవిడిచిన పూలగుత్తులనుకూడా చూపించాడు.

దేవి:- నాకూ నే నిప్పుడు చూచివచ్చిన స్త్రీయే యిక్కడకు వచ్చివుంటుందనే విశ్వాసం కుదరకుండా వున్నది.

వీరేం:- మీకాశంక యేమాత్రం అవసరంలేదు.

దేవి:- వాళ్ళక్కడ ప్రతిదినం కలుసుకొంటున్నారు. ఇవ్వేళ తారాసింహునీ భైరవసింహునీ నా వెంట తీసుకొని వెడతాను. వీరు స్వయంగా ఆస్త్రీనిచూచి యెవరో గుర్తుపట్టగలుగుతారు.

వీరేం:- సరే అయితే ఇక నీసంగతి చెప్పు.

దేవి:- ఆ ముఠావారు శాశ్వతంగా ఆవర్వత ప్రాంతంలో ఒక డేరా వేసుకొని ఉన్నారు. వాళ్లు దొంగతనంచేసి తెచ్చిన నగలూ వస్త్రాలూకూడా అక్కడేఉన్నాయి. చూచినంత వఱకూ మీకు చెబుచాను నే. నేనింతకంటే ఎక్కువేమీ పరీక్ష చేయలేదు. మీరు అనుమతిస్తే నేను కొంతమందిని వెంటబెట్టుకొనివెళ్ళి ఆ దొంగలముఠాను ఆబాలికతోసహా బంధించి తీసుకొస్తాను.

వీరేం:- ముందు ఇవ్వేళ వీరిద్దరిని తీసుకొనివెళ్ళు రేపు వాళ్ళను బంధించేయేర్పాటును చూద్దాం.

దేవిసింహుడు భైరవసింహుని వెంటబెట్టుకొని గయ రాజ్యానికి మూడు నాల్గు క్రోసుల దూరానఉన్న ఆవర్వత ప్రాంతానికి వెళ్లాడు. ఎన్నో యెత్తులూ వన్నాగాలూ వేసి చివరికి ఎలాగైతేనేం వాళ్ళిద్దరూ ఆదొంగలముఠాఉన్న గుహను సమీపించారు. ఆగుహకు దాపుననే మరొక చిన్న గుహఉన్నది. అందులో అతికష్టంమీద ఇద్దరుమనుష్యులు కూర్చోవచ్చు. ఆచిన్నగుహలో కూర్చుని అక్కడఏర్పడిన పగులులోంచి పెద్దగుహలోని సంగతి సందర్భాలన్నీ పరిశీలించవచ్చు. ప్రస్తుతం ఆ ముఠాఅంతా ఆగుహలోఉన్నది. ఆముఠామధ్య ఆసుందరి ఒక

చిన్న సింహాసనంపై సరనారిసలె కూర్చునిఉన్నది. ఈ యిద్దరు ఇంద్రజాలికులు ఆ గుహాలోంచి ఆదొంగలముతా మాట్లాడు కొనే మాటలు వినలేకపోయినా వారిహావభావాలు మాత్రం తెలుసుకొంటున్నారు. భైరవసింహుడు ఆ యువతినిచూచి ఆమెయే ఇంద్రజిత్‌సింహునిగదిలో ప్రవేశించిన స్త్రీయని గుర్తు పట్టాడు. ఆమె ప్రస్తుతం అధికంగా నగలూ నాణాలు పెట్టుకో లేదు. అయినా ఆమె ముఖపు కవళికలుమాత్రం భైరవసింహు నికి ఇప్పటికీ జ్ఞాపకమే.

ఇంద్రజాలికులు ప్రవేశించినతర్వాత రెండుగంటలవరకు ఆదొంగలు పగస్పరం ఏదో మాట్లాడుకొంటూనే ఉన్నారు. దొంగలలో కొంతమంది ఆస్త్రీని ఏదో వేడుకొంటున్నట్లు ఆమె అందుకు అంగీకరించనట్లూ ఇంద్రజాలికులకు అర్థమైంది. ఇంతలో అక్కడికి మరొక స్త్రీ హాంపడాంగివచ్చి చేరింది. ఆమెను చూస్తే చాలాదూరంనుంచి పగు గెత్తుకొని వచ్చినట్లు కన్పి స్తోంది. ఆ కొత్తగావచ్చిన స్త్రీ ఏమిచెప్పిందో యేమోకాని లోగడ అక్కడఉన్న స్త్రీయొక్క ముఖవికాసంలో ఏదో మార్పువచ్చింది. ఆమె ముఖం క్రందగడ్డలా అయి కళ్ళు పెద్దవిగాచేసి క్రోధా వేశాన పణకిపోతున్నట్లు కనిపించింది, ఆమె తనఎదుటవున్న కత్తినిచూసి లేచినిలబడింది. వెంటనే ఆ స్త్రీతోకలసి గుహాబైటికి వచ్చింది. దొంగలుమాత్రం నిరు త్తరులై అక్కడే ఉండిపోయారు.

మరి రెండుగంటలవరకూ ఆస్త్రీలు తిరిగిరాలేదు. దొంగలు కూడా అక్కడినుంచిలేచి గుహబైటికి వెళ్లిపోయారు. ఆదొం

గలు, స్త్రీలు చెప్పకుండా వెళ్ళిపోయినందుకు ఆశ్చర్యాన్ని
ప్రకటిస్తున్నట్లు కన్పించింది. ఈ సంగతిఅంతా దేవీసింహుడు
చూచి తెల్లవారేసరికి రాజమహాలుకు చేరుకొన్నాడు.

## 12

యువరాజు ఇంద్రజితసింహునికి రాజకుమారి కిశోరిపై
హృదయపూర్వకమైన ప్రేమానురాగాలు కలిగాయి. అతడు
అనారోగ్యంగా ఉన్నప్పటికీ కిశోరి విషయమై అనవరతం ఆలో
చించక మానలేదు. ఆమె ఎటువంటి పరిస్థితులలో ఉన్నదో ఏ
విధంగా ఆమెను సందర్శించగలగాలో అతనికేమీ అర్థం
కాలేదు.

అతడనారోగ్యంగా ఉన్నరోజులలో భైరవసింహుని
వలన కిశోరి వృత్తాంతాన్ని తెలుసుకొన్నాడు. కఠినాత్ముడైన
అగ్నిదత్తుని హస్తాల్లో కిశోరి చిక్కుకొన్నదని తెలిసి ఇంద్ర
జితుడు చాలా దుఃఖించాడు. కాని కిశోరిని విడిపించటానికి
చపలా చంపా బదరీనాథ పండితుడూ ప్రయత్నిస్తున్నారని
తెలుసుకొని కొంతలోకొంత ఊరట చెందాడు. అతనితండ్రియైన
వీరేంద్రసింహునికికూడా కిశోరిని కోడలుగాచేసుకొని శివదత్తుడు
తలయెత్తుకొని తిరగకుండా చేయాలనే తలంపుఉన్నది.

ఆనందసింహుడు యువరాజుకూడా ఇప్పుడిప్పుడే ప్రేమో
న్మాదంలో మొదటిపాదాన్నుంచాడు. కాని ఆతని అవస్థ
చాలా చిక్కులలో కూడుకొన్నది. దేవీసింహుని మాటల
వల్ల ఆమె దొంగలముఠాతో ఉన్నదని తెలుసుకొని అసహ్యిం
చుకొనటం అదేక్షణంలో తిరిగి తనగదిలో కాలుపెట్టినప్పటి ఆ

స్త్రీ సౌందర్యాన్ని ఊహించుకొని ఉన్మత్తుడు కావటం తట స్థించి అతని కొక సంకటస్థితి ఏర్పడింది. ఆమె దొంగల ముఠాలో ఉండటంవల్ల [illegible] సంఘానికి చెందినదేమో అనే అనుమానంకూడా అతనికున్నది.

వీరేంద్రసింహ మహారాజుకు మాత్రం ఆ స్త్రీ గదిలో ఏ విధంగా ప్రవేశించిందా అనే ఆలోచన పట్టుకొని పీడిస్తోంది. అతడు కాపలాను ఎక్కువ చేసి గట్టి బందోబస్తు చేశాడు. తాను కూడా ఇంద్రజిత్సింహునితో పాటు ఆ గదిలోనే నిద్రిస్తున్నాడు.

వారు నిద్రిస్తున్న గదికి రెండుప్రక్కలా రెండుగదు లున్నాయి. ఆ గదులలో ఒక గది దేవునిగది. రెండవదే ఆ స్త్రీ విచిత్రంగా ప్రవేశించినగది. దేవునిగదికి బైట తాళం వేశారు. రెండవగదికి మాత్రం తాళం లేదు. వీరేంద్రసింహుడు ఆ రెండవ గదిద్వారం దగ్గరే మంచం వేసుకొని రాత్రిఅంతా జాగరణ చేస్తున్నాడు.

అది అర్ధరాత్రి. [illegible] కన్పించటం లేదు. వీరేంద్రుడు మంచంమీదనుంచి లేచి అటూఇటూ పచారు చేస్తున్నాడు, ఆ విధంగా ఒకగంట గడచినమీదట గదిలో ఏదో శబ్దమైంది. వీరేంద్రుడు చివాలున కత్తిదూసి తారాసింహుని లేపటానికి వెళ్ళాడు. అతిజాగ్రత్తగా ముందే మేలుకొని చురకత్తి చేతిలో పట్టుకొని వీరేంద్రునితో పచారుచేయటంఆరంభించాడు అంతలో గాజులచప్పుడయినట్లు ఎవరో లోపలనుండి గదితలుపులు తీసినట్లు శబ్దం వచ్చింది. ఆ తర్వాత గదిలో పద ధ్వనులు వినిపించసాగాయి. ఆ ధ్వనులవల్ల నలుగురైదుగురు

మనుష్యులున్నట్లు అర్థమౌతున్నది. వీరేంద్రుడు దర్వాజాదగ్గరకు వెళ్లాడు. తలుపుతీయాలని చూచాడు. కాని తలుపులు రాలేదు. చేసేదిలేక అక్కడే నిలబడి లోపలజరిగే విచిత్రంవల్ల విస్మయపడుతూ ఉండిపోయాడు.

నెమ్మదినెమ్మదిగా పదధ్వనులు ఎక్కువ అవుతూ వచ్చాయి. ఆ అలికిడికి ఇంద్రజీతుడు ఆనందుడుకూడా లేచి వచ్చారు. వారుకూడా తలుపుతీయాలని ప్రయత్నించారు గాని విఫలులయినారు. లోపల ఏదో కొట్లాట ప్రారంభమైనట్లు అర్థమౌతున్నది. మరికొంత సేపటికి కత్తుల ఝళిపింపులుకూడా విన్పించసాగాయి. ఆనందుడు ద్వారబంధాలని విరగగొట్టాలనుకొన్నాడు గాని వీరేంద్రుడు నివారించటంవల్ల వూరుకున్నాడు.

పెద్దయెత్తున విజృంభించిన యుద్ధధ్వనులు సన్నగిల్లి ప్రశాంతత యేర్పడింది. ఒక కొద్దిసేపటివరకూ ఆ విధంగానే ఉన్నది. ఇక రాత్రికూడా రెండుగంటలకంటే ఎక్కువలేదు. తారాసింహుడు బయటకు వెళ్ళి కావలావాళ్ళు మేలుకొని ఉన్నారో లేదో చూచివచ్చాడు. ఇంతలో భైరవసింహుని వెంటబెట్టుకొని దేవీసింహుడు వచ్చాడు. వారిని ఇద్దర్నీ చూచి వీరేంద్రుడు ఆశ్చర్యపడ్డాడు.

దేవీ:— మీరింకా మేలుకొనే ఉన్నారా ?

వీరేం:— మేలుకొనక ఏం చెయ్యమంటావ్ ?

దేవీ:— ఏం జరిగింది ?

వీరేం:— ముందుగా మీసంగతి చెప్పండి (భైరవసింహుని చూచి) నీ వా స్త్రీని గుర్తుపట్టావా ?

భైరవః— గుర్తుపట్టాను. ఆమెవెంట మరో స్త్రీ కూడా ఉన్నది.

వీరే:— మీరిక్కడనుంచీ వెళ్ళి యేం చేశారో వివరంగా చెప్పండి.

భైరవసింహుడు అంతవరకూ జరిగినసంగతి అంతా చెప్పిన తర్వాత వీరేంద్రుడుకూడా అక్కడ జరిగినసంగతి చెప్పాడు.

రాత్రియుద్ధం జరిగిన గది తెరవటం జరిగింది. దేవీసింహుడు దీపం పుచ్చుకొని గదిలో ముందుగా ప్రవేశించాడు. అతడు "అరే! ఇక్కడ చాలా హాత్యలు జరిగినాయి" అని అరిచాడు. అతని అరుపులకు వీరేంద్రసింహమహారాజూ అతని కుమారులూ, విద్యుజ్జాలికు లిద్దరూకూడా పరుగుపరుగున ఆ గదిలో ప్రవేశించారు. ఆ గదిలో పరిచబడిన తివాచీ అంతా చాలామంది మనుష్యులు ఒక్కుమ్మడిగా నలగదొక్కటంవల్ల ఒకచోట పోగుబడిపోయింది. గది అంతా రక్తంతో తడిసిపోయింది. గదిగోడలపై కూడా రక్తపు మరక లున్నాయి. గదిమధ్యలో ఒక శవం శిరస్సు లేకుండా పడిఉన్నది. కాసె ఒక్కటే కట్టివుండటంవల్ల ఆ శవం ఎవరిదో గుర్తుపట్టే వీలులేకుండా ఉన్నది. నగ్నంగాఉన్న ఆ శవం శరీరమంతా నూనె కారుతోంది. కుడిచేతిలో కత్తిఉన్నదిగానీ ఆ చేయి భుజందగ్గర తెగిపోయింది. ఈ అన్నింటికంటే విచిత్రమేమంటే యశొవ్వనపతి కుడిచేతి మణికట్టు అక్కడ పడిఉన్నది. ఆ చేతిలో కత్తికూడా ఉన్నది. ఆనందసింహుడు దానిని తనచేతులతో ఎత్తిచూచాడు. ఆ మణికట్టున ఇంకా వజ్రాలు పొదిగినగాజు

లున్నాయి. క్రింద రెండుమూడు మణులుకూడా జారిపడ్డాయి. దానినిచూచి అందరూ విచారసాగరంలో మునిగిపోయారు. అది అందరికీ ఒకనాడు కన్పించిన స్త్రీని గుర్తుకు తెచ్చింది. అందరికంటే ఆనందసింహుడు మరింత చింతాసాగరంలో మునిగి పోయాడు. అతడు తన ప్రేయసికి జరిగిన అన్యాయానికి కళ్ళ నీళ్ళు పెట్టుకొన్నాడు. ఐనప్పటికి అతడు అతికష్టంమీద సంబాళించుకొని మౌనంగా ఉండిపోయాడు.

ఆ స్త్రీ యెవరో ఆమె ఎందుకుగాను ఈ విధంగా చేస్తున్నదో తెలుసుకొనేవరకూ ఆమెపేరు కిన్నెర అనుకుందాం. వీరేంద్రసింహుడు లా విచిత్రసంఘటన బయటకు పొక్కకుండా చెయ్యాలనుకొన్నారు గానీ చివరకది పట్టణమంతా పొక్కిపోయింది. అనేకులు అనేకవిధాలుగా అనుకొన్నారు. కొందరు వీరేంద్రుని ఇంట్లో పిశాచాలు తిరుగుతున్నాయనుకుంటే మరి కొందరు అదృష్టదేవత గజ్జెకట్టి నృత్యం చేస్తుందనుకొన్నారు. కొందరు అగ్నిదత్తుని అనుయాయులు వీరేంద్రునియింట జొరబడి అల్లకల్లోలం చేస్తున్నారనుకొంటే మరికొందరు అగ్నిదత్తుని అనుయాయులకు అంతిమకాలం సమీపించిందనుకొంటున్నారు. ఏది యేమైనా దేవసింహుడు ఆ శిరస్సులేని శవాన్ని నాలుగువీధుల్లోనూ పెట్టి అగ్నిదత్తుని అనుయాయు లొక్కరొక్కరే యీ విధంగా మా చేత నిహతులౌతున్నారని చాటించసాగాడు.

# 13

అది సంధ్యాసమయం. రాజపుత్రులిద్దరూ చల్లగాలికి తోటలో అటూఇటూ తిరుగుతున్నారు. ఇద్దరూ తమ తమ ప్రియురాండ్రను గుర్తుకు తెచ్చుకొని వారితో విడబాటు కల్గినందుకు జీవితాన్ని తుచ్ఛంగా తలపోస్తూ చింతాక్రాంతులై ఉన్నారు. ఆ తోటకు దక్షిణదిక్కుగా ఉన్న భవనానికి అంటి పెట్టుకొనిఉన్న మంటపంలోకి ఇద్దరూ ప్రవేశించారు. అక్కడే వీరేంద్రుడు అధికారులతో కలసి కులాసాగా మాట్లాడుతున్నాడు. దేవీసింహుడుకూడా అక్కడే కూర్చుని చిన్ననాటి సంగతులను తలపోసుకుంటున్నాడు.

వీరేం:— నా కిప్పుడు చునార్‌గఢం వెళ్ళాలని ఉన్నది కాని......

దేవీ:— వెళ్ళండి! ఇప్పుడు మీ అవసరం మాత్ర మేముంది.

వీరేం:— అవునుగాని ఇక్కడ జరిగే అద్భుతాలుచూస్తే పిల్లలకు కష్టం కలుగుతుందేమోనని.

ఇంద్ర:— నాన్నగారూ, మీరా విచారమేమీ పెట్టుకోవద్దు.

వీరేం:— నీవుకూడా ఇక్కడే వుండాలనుకొంటున్నావా?

ఇంద్ర:— మీ ఆజ్ఞ అయితే.

వీరేం:— ఏమి దేవీసింహా.

దేవీ:— ఉండనివ్వండి. ఫరవాలేదు.

వీరేం:— మరి నీవో.

దేవీ:- నేను మీ వెంట వస్తాను. ఇక్కడ భైరవసింహుడూ తారాసింహుడూ ఉంటారుగా ?

భైరవ:- ఇక్కడ జరిగే అద్భుతాలు మమ్మల్నేమీ చెయ్యలేవు.

తారా:- నేను తలచుకుంటే నందిని పంది చెయ్యనూ ?

వీరేం:- మీ మీద నాకు సంపూర్ణమైన విశ్వాసముంది. రాజకుమారు లిద్దరికీ తండ్రి చునార్ గఢం వెళ్ళిపోవాలనే ఉన్నది. అతడు ఉండటంవల్ల వారికి తమయిష్టం వచ్చినట్లు చెయ్యటానికి వీలు లేకపోయింది. వీరేంద్రసింహుడు మాత్రం గయరాజ్యాన్ని విడిచి ఎందుకు వెళ్ళుతున్నాడో యెవరికీ తెలియదు. అసలాయన యెవ్వడూ ఒక గంటతర్వాత ఏమి చేస్తాడో యెవరికీ చెప్పడు. ఆయన ఫలానాపని ఎందుకు చేస్తున్నాడో కూడా ఎవరూ ఊహించరు. మొట్టమొదట మహారాజు తాను చేయదలచుకొన్నపని హృదయపూర్వకంగా దృఢపరచుకొని కార్యక్రమాన్ని ప్రారంభిస్తాడు.

ఒకనాటిరాత్రి వీరేంద్రుడు చునార్ గడానికి ప్రయాణమై వెళ్ళాడు. అతనివెంట దేవీసింహుడుకూడా ఉన్నాడు. ఇక మిగిలిన యువరాజు లిద్దరూ సర్వస్వతంత్రులయినారు. ప్రస్తుతం సోదరులిద్దరూ తమ శయ్యలను వేరువేరుగదులలో ఏర్పాటు చేసుకొన్నారు. ఆ విచిత్ర సంఘటన జరిగినగదికి ప్రక్కగా ఆనందసింహుడు మకాంవేశాడు. దానికి కొద్దిదూరంలో ఇంద్రజీతసింహుని గది ఉన్నది.

# 14

అర్ధరాత్రి గడచిపోయింది. గయరాజ్యంలో కావలా వాళ్లు హెచ్చరికలు చేస్తూ తిరుగుతున్నారు. కటికచీకటి. ఆ పట్టణంలో 'విష్ణుపాదుక' అనే స్థలం చాలా ముఖ్యమైనది. అక్కడ జనసమ్మర్దంకూడా ఎక్కువ. పట్టణానికి ఉత్తరదిక్కుగా రామశిలప్రాంతంలోకూడా జనసమ్మర్దం ఎక్కువే. అక్కడ ఇళ్ళన్నీ దాదాపు పూరికొంపలు. రామశిలప్రాంతంనుండి ఇద్దరుమనుష్యులు కంబళి కప్పుకొని ఫల్గుణానది దిక్కుగా వెళు తున్నారు.

'రామశిల'కు తూర్పుదిక్కునఉన్న ఆ నదిమధ్య ఒక భయంకరమైన పెద్దమిట్ట ఉన్నది. ఆ మిట్టపై ఎవరిదో మహాత్మునిసమాధి ఉన్నది. అక్కడే రాతితో కట్టబడిన ఒకయింట్లో సాధువుఒకడు నివసిస్తున్నాడు. ఆ సమాధిప్రాంతమంతా చెట్లూ చేమలతో నిండిఉన్నది. ఇంకా అక్కడ భూమిమీద ఎక్కడ చూచినా ఎముకలపోగులు పడిఉండటం కన్పిస్తుంది. అనేక రకాల పుర్రెలు యెక్కడబడితే అక్కడ పడిఉన్నాయి. ఈ రకంగా అక్కడ ఎముకలు పడిఉండటానికి కారణమేమిటో తెలియదు. రామశిల ప్రాంతమునుండి బయలుదేరిన యిద్దరు మనుష్యులూ ఈ మిట్టదిక్కుగానే వెళుతున్నారు.

సాధారణమైన వ్యక్తులెవరూ అటువంటి అర్ధరాత్రివేళ ఆ మెట్టదగ్గరకు వెళ్ళటానికి సాహసించరు. కాని ఈ మనుష్యు లిద్దరూ చేతిలో దీపంకూడా లేకుండా ఎముకలను త్రొక్కు కొంటూ ముళ్ళతీగలను తప్పించుకొంటూ మిట్టపైన నడుస్తు

న్నారు. చివరికి వాళ్ళిద్దరూ ఒక ఇంటిదగ్గరకు వెళ్ళి చప్పట్లు కొట్టారు.

లోపలనుండి "ఎవరు?" అని ఒక కంఠం ప్రశ్నించింది.

ఒకడు:- తలుపుతియ్యి.

లోపలనుండి:- ఎందుకు ?

ఒకడు:- పని ఉన్నది.

లోపలనుండి:- మీారు మమ్మల్ని అనవసరంగా బాధ పెడుతున్నారు.

సాధువు తలుపుతీశాడు. ఇద్దరూ లోపల ప్రవేశించి ఒక ప్రక్కన కూర్చున్నారు. ఇద్దరూ కప్పుకున్న కంబళ్ళను తీశారు. ఆ మనుష్యు లిద్దరూ స్త్రీలు. అందులో ఒకతెది కుడి చెయ్యి మణికట్టు తెగిపోయింది. ఒకతె మానంగా కూర్చు న్నది.

మణికట్టులేని యువతి:-మీారేమైనా ఆలోచించారేమో చెప్పండి.

సాధువు:- నావల్ల కానిపనినిగురించి నేనేమి ఆలో చించను?

యువతి:- ఆ పని మీా వల్ల తప్పకుండా అవుతుంది. ఆమె మిమ్మల్ని గురువుగా భావిస్తోంది.

సాధువు:- గురువుగా భావించినంత మాత్రాన ఆమె ప్రాణాలను ఇవ్వమంటే ఇస్తుందా ?

యువతి:- ఇందులో ప్రాణాలు ఇవ్వవలసిన అవసర మేమున్నది ?

సాధువు:- అయితే నీవు కోరే దేమిటి ?

స్త్రీ:— నేను ఆ మెను ఆయిల్లు పిడిచిపెట్టమని మాత్రం కోరుతున్నాను.

సాధువు:— ఎవరినీ కష్టపెట్టని ఆమెవెనక మీారు పడ్డా రేమిటి ?

యువతి:— అయితే ఆమె నన్నూ నా మనుష్యులనూ మోసగించ లేదంటారా ?

సాధువు:— నీవు నీ రాజ్యాన్ని ఇతరుల కిచ్చి పారి పోయావు. అందుకని ఆమె యిప్పుడు యజమానురాలు. అందు చేత వారిని ఆమె నౌకర్లుగానే భావించాలి.

యువతి:—నేను నారాజ్యాన్ని వశపరచుకోదలుస్తున్నాను.

సాధువు:— నీవు చేయగలిగింది చెయ్యి. కాని, నేను మాత్రం నీకేం సాయం చేయలేను. నీవు నన్ను చిన్నప్పటి నుండీ ఎరుగుదువు. నీ తండ్రి నన్ను ఒళ్లోపెట్టుకొని యిక్క డకు వస్తుండేవాడు. ఇంతవరకూ నే నెప్పుడూ యెవరి మంచి చెడ్డలలోను జోక్యం చేసుకోలేదు.

యువతి:— ఏది ఏమైనా నే నిప్పుడు చెప్పినవని మీారు చేసితీరాలి. మీారు వ్యతిరేకించినట్లైతే దాని ఫలితాన్ని అను భవించాలి కూడ. నేను సాధువులనీ, మహాత్ములనీ విడిచిపెట్టే దాన్ని కాను.

సాధువు:— (కొంచెంసేపు ఆలోచించి) అయితే నన్నింకొకరోజు ఆలోచించుకోనివ్వు. రేపీ వేళకు తిరిగిరా !

యువతి:— ఇంకొకరోజుకూడా ఆలోచించుకో !

ఆ స్త్రీలిద్దరూ అక్కడనుంచి లేచి ప్రయాణమయ్యారు.

అంతవరకూ ఆ యింటి వెనుక దాగుకొనిఉన్న వ్యక్తి ఆ స్త్రీ లిద్దరూ తిరిగి రామశిలలో తమయింటికి చేరుకొనేదాకా వెంబడించాడు. వారిద్దరూ ఇంట్లో జేరి తలుపులు వేసుకొన్న తర్వాత అతడు తిరిగి ఆ నదీగర్భంలోఉన్న యింటికి వచ్చాడు. సాధువు కూర్చుని ఆలోచిస్తున్నాడు. ఆ వ్యక్తి నిస్సంకోచంగా ఇంట్లో ప్రవేశించి ఒకమూల కూర్చున్నాడు.

సాధువు:- వచ్చావా దేవీసింహా.

దేవీ:- వారిద్దరూ యిక్కడికి రాకమునుపే వచ్చాను స్వామీ. ఇప్పుడు వారిద్దరినీ ఇంటిదాకా పంపించి తిరిగి వచ్చాను.

సాధువు:- నిజంగానా ?

దేవీ:- అవును. మీరూ, వాళ్ళసంగతి చెప్పి మాకు చాలా ఉపకారంచేశారు. చాలారోజులనుంచీ మేము దిక్కు తెలియని పరిస్థితులలో పడిఉన్నాము. మీ అనుమతి తీసుకొని ఉన్నట్లైతే వారినిద్దరినీ బంధించిఉండేవాడిని.

సాధువు:- ఆ విధంగా నీవు చేస్తే మా గురు గృహానికి అపవిత్రత వచ్చిపడేది. ఇప్పుడు నీవు వారి యిల్లు చూచావు గనక ఇక ఫరవాలేదు. వీరేంద్రసింహుడు గొప్ప చక్రవర్తి. అతనిని బాధించటం ఎవరిచేతా కాదు. దుష్టురాలైన మాధవి తన ప్రవర్తనను కలుషితం చేసుకొని ప్రజలను ఎంతగా. బాధించిందో చూచావా ? దానికి తగినశిక్ష యిప్పుడనుభవిసుంది. ఇక నీవు వెళ్ళు నాయనా ! ఆ పరాత్పరుడు నీకు శుభం చేకూర్చుగాక ! వీరేంద్రసింహామహారాజుకుకూడా నా ఆశీర్వాదాలను అందజెయ్యి. చూడు నేను నీకు మొట్టమొదటే చెప్పి

నట్లు మాధవిని నిలువునా ప్రాణాలు తీయకు. పాపం ఆ కామి నిపై దయచూపిస్తావు కదూ! నేనామెను నా కుమార్తెగానే భావించుకొంటున్నాను. వీరేంద్రసింహునితో కామినిని కోడ లుగా చేసుకోమన్నానని చెప్పు.

దేవీ:- ఆ విధంగానే చెబుతాను స్వామీ. వీరేంద్రుడు మీ మాట తప్పేవాడు కాదు. మఱొకసారి మీ దగ్గరికి వస్తాను లెండి.

సాధువు:- ఇక నీకు నా దర్శనం దొరకదు. నేను ఈ యిల్లు విడిచిపెట్టేస్తున్నాను. భగవంతునిదయ ఉంటే నేనే మిమ్మల్ని తిరిగి కలుసుకుంటాను.

దేవీ:- మీ యిష్టం.

సాధువు:- ఇక నీవు వెళ్లు.

## 15

వీరేంద్రసింహమహారాజు చునార్‌గడానికి వెళ్ళిన తర్వాత అతని పుత్రులిద్దరూ ప్రేమోన్మాదంలో పడ్డారు. ఆనందసింహుడు కిన్నరనుగూర్చి ఇంద్రజీతసింహుడు కిశోరిని గురించి ఆలోచించుకోసాగారు. ఇంద్రజీతునికి రాజగృహాన్ని విధ్వంసంచేయుటం తేలికైనపని. కాని అగ్నిదత్తుడు కిశోరిని ఏమి బాధిస్తాడో అని ఆ పని చేయలేదు. చివరికి భైరవసింహునితో "నే నిప్పుడు రాజగృహానికి వెళ్ళకుండా ఉండలేను. నా కోసం నిద్రాహారాలు మానిఉన్న కిశోరినివిడిపించటం నా విధ్యుక్త ధర్మం అన్నాడు.

భైరవ:- మీ రన్నది నిజమేగాని, ఒంటరిగా మీరేం చెయ్యగలుగుతారు?

ఇంద్ర:- అగ్నిదత్తునికి నేనొక్కడినీ చాలునా?

భైరవ:- అతడొక్కడే అయితే చాలు. కాని నగరంలో ఉన్న ప్రజలో ?

ఇంద్ర:- వాళ్లెవరూ అతనికి సాయం చెయ్యరు.

భైరవ:- చెయ్యకుండా వుంటే మంచిదే కాని, చేస్తారనే అనుకొనే మనం వెళ్లాలి.

ఇంద్ర:- అయితే కొద్దిగా సైన్యాన్ని తీసుకొని వెళతాను.

భైరవ:- మీరు రెండుమూడురోజు లాగితే ఈ లోగా నేను అక్కడి సంగతి సందర్భాలు తెలుసుకొని వస్తాగా ?

ఇంద్ర:- ఇక నేను ఆగేదిలేదు.

భైరవ:- సరే మీ యిష్టం.

ఒకనాటి సాయంకాల సమయాన సోదరులిద్దరూ అశ్వారూఢులై అనేక సేనానాయకులతో కలసి చల్లగాలికి బైటికి బయలుదేరారు. అందరికంటే ముందుగా సోదరులిద్దరూ పోతున్నారు. ఐంద్రజాలికు లిద్దరూ గుఱ్ఱాలపక్కగా నడుస్తున్నారు.

పట్టణం వెలుపలికి వెళ్ళిన తర్వాత ఆనందసింహునితో ఇంద్రజీతసింహుడు "నేను భైరవసింహుని తీసుకొని ఒకపని మీద రాజగృహానికి వెళతాను. సరిగా ఒకవారం తర్వాత నీవు మాకు సహాయంగా కొంతసైన్యాన్ని పంపించు.

ఆనంద.- నీ యిష్టం. కానీ......

ఇంద్ర:- నీవేమీ విచారపడవద్దు. నన్ను నేను జాగ్రత్తగా కాపాడుకోగలను.

ఆనంద:- సరే! కానీ......

ఇంద్ర:- మాధవి పౌరులు మనం గయరాజ్యానికి రావటం వ్యతిరేకించటం లేదని నీకు తెలుసుగా?

ఆనంద:- అంతే అనుకో! కాని......

ఇంద్ర:-నీవు పంపించేసైన్యం వచ్చేవరకు మేము అక్కడ రహస్యంగానే పనిచేస్తాం.

ఆనంద:- అట్లా చేసినప్పటికీ...

ఇంద్ర:- అయితే నీవు అనుకున్నదేమిటో చెప్ప రాదూ?

ఆనంద:- మీరు ఒంటరిగా వెళ్ళటం మంచిదికాదు. శత్రువుఇంట జాగ్రత్తగా ఉండటం ఎట్లా సాధ్యమౌతుంది? మీరు ఒకశత్రువు ఇంటికి వెళ్లారని తెలుసుకొని నేనుమాత్రం ఇక్కడ నిశ్చింతగా ఎట్లా ఉండగలుగుతాను?

ఆనందుని చివరి వాక్యం ఇంద్రజీతునికి ఆలోచన కలిగించింది. అతడు భైరవసింహుని దిక్కుగా చూచాడు.

భైరవ:- ఇందాకే చెప్పాను గదా? నేను ముందుగానే వెళ్ళి తెలుసుకొనివస్తానని.

ఆనంద:- నీవు ఎన్నాళ్ళకు తిరిగిరాగలవో చెప్పు?

భైరవ:- నాలుగురోజులలోపుగానే వస్తాను.

ఆనంద:- అయితే నీవిక్కడనించి వెళ్ళవద్దు.

ఇంద్ర:- ఇంటికి వెళ్ళి సామానులు సర్దుకొని వెళితే మంచిదిగా!

# 16

భైరవసింహుడు రాజగృహానికి వెళ్ళి నేటికి మూడు దినాలైంది. అక్కడి సంగతులేవీ తెలియరాలేదు. ఇంద్రజిత్తుని అదే ఆలోచనపట్టుకొన్నది. అర్ధరాత్రిసమయంలో ఇంద్రజిత్తుడు గదిబైటకు వచ్చాడు.

ఒకయోధుడు:- ఐంద్రజాలికు డొకడు మీతో ఏదో చెప్పకోటానికి వచ్చాడు.

ఇంద్ర:- (దీవం పెద్దచేసి) అతణ్ణి ఇప్పుడే తీసుకొనిరా!

కొద్దిసేపటిలో ఒక సుందరాకారుడైన యువకుడు మఖమల్ దుస్తులు ధరించి చురకత్తి నడుముకు కట్టుకొని ప్రవేశించాడు.

ఇంద్ర:- అతనిని పరీక్షగా చూచాడు. అతనిలో ఏదో సంతోషం ఆవరించిఉన్నది. "నేనునిన్ను గుర్తుపట్టా"అన్నాడు.

అతడు:- ఎందుకు గుర్తుపట్టలేవు.

ఇంద్ర:- కమలా! మొట్టమొదట కిశోరి యెక్కడున్నదో చెప్పు.

కమల:- ఇప్పుడామె ఎక్కడ ఉన్నదో అగ్నిదత్తునికి కూడా తెలియదు.

ఇంద్ర:- సరిగా చెప్పు. ఆమెకు నేనేమీ ఉపకారం చెయ్యలేకపోయాను.

కమల:- ఇంతవరకూ మీరు ఆమెకు చేసింది చాలు. ఇప్పుడు మీ ఐంద్రజాలికులు రాజగృహంలో తిష్ఠవేసిఉన్నారు కూడా. కాని వారికి కిశోరి అక్కడ లేదన్నసంగతి తెలియదు.

ఆమె యిప్పుడు ఆ పట్టణంలోనే ఉన్నది. కాని మిమ్మల్ని కలుసుకోదలచలేదు. అయినా మీరు కాదుకూడదంటే ఆమె దగ్గరకు వెళదాం! పదండి! వెంట ఒక ఐంద్రజాలికుణ్ణి తీసుకోండి.

ఇంద్రజీతుడు తారాసింహుని పిలిపించి అప్పటికప్పుడే కిశోరిని కలుసుకొనటానికి ప్రయాణమయ్యాడు. కమల వారిని ఆ పట్టణంలో సందులూగొందులూ తిప్పి చివరికి విష్ణుపాదుక దేవాలయందగ్గర ఒకయింటికి చేర్చింది. "నేను ఒంటరిగా లోనికి వెళతాను. నేను వెళ్ళినతర్వాత మీరు తాటిసహాయంతో వేరొకమార్గాన ప్రవేశించండి! ఈ యింట్లో క్రొత్తగా మరో యిద్దరు వచ్చినసంగతి తెలియకూడదు" అన్నది

## 17

ఆ యింటిలో లెక్కలేనన్ని చిన్నగదులున్నాయి. ఒక విశాలమైన వసారాకు ఇరువైపులా రెండుగదులున్నాయి. ఆ వసారాలో అలంకరణ బొత్తిగా లేదు గోడలకున్న మేకులకు గుడ్డలు వ్రేలాడుతున్నాయి. దీపంకూడా లేదు. ఎదురుగా విశాలమైన తలవాకిలి ఉన్నది. నిర్మలాంబరాన చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ఆ వెన్నెల వెలుగులు కొన్ని వసారాలో పడుతున్నాయి. ఒక ఆ వసారా వైపునఉన్న గది మూసి ఉన్నది. మరొకవైపునఉన్న గది తెరవబడిఉన్నది. ఆ తెరవబడిన గదిలో ఇద్దరుస్త్రీలు కూర్చుని యేదో సంభాషించుకొంటు న్నారు. ఆ యిరువురిలో ఒకామె కిశోరి. మరొకామె కిన్నెర.

కిశోరి:- చెల్లీ, నీవు నాకు చేసినమేలు చిరస్మరణీయం.

కిన్నెర:— అది సరేకాని, మన మిప్పుడేం చెయ్యాలో ఆలోచిద్దాం.

కిశోరి:— కమల వచ్చినతర్వాత ఆలోచిద్దాం. ముందు బైటికి వెళదాం పద.

ఇద్దరూ వెన్నెలలోనికి వచ్చారు. చలిగా ఉండటంవల్ల ఎక్కువసేపు ఉండలేకపోయారు. వసారాలోకి వచ్చి కూర్చున్నారు.

ఆ యింటి ప్రక్కగా ఒక చిన్న ఉద్యానవనం ఉన్నది. కాని ఆ ఉద్యానవనం తగు పోషణలేక శిధిలావస్థలో ఉన్నది. ఆ వనంలోకి వెళ్ళటానికి ఇంట్లోనుంచీ ఒకేఒకత్రోవ ఉన్నది. మిగతా చోట ఎత్తైనగోడలున్నాయి. ఆ గోడలను లోపలి వారి సహాయంలేకుండా యెవరూ తాడుసహాయంతో ఎక్కలేరు. అంతలో తలుపు శబ్దమైంది. కిశోరి కమల వచ్చిందని చెప్పింది.

కిన్నెర:— అయినా మనం ప్రశ్నవేసి తెలుసుకోవటం మంచిది.

కిశోరి:— అవును నిజమే (అని ద్వారందగ్గరికివెళ్ళి) లెక్కపెట్టావా ?"

దానికి సమాధానంగా బైటినుంచి "యాభైదాకా లెక్కపెట్టాను" అని వచ్చింది.

కిశోరి:— అయితే నేను కిందికివచ్చి తలుపుతీస్తాను. (కిశోరి తలుపుతీయాలనీ)త్వరత్వరగావస్తోంది. ఆమెద్వారందగ్గరకు రాక

మునుపే ఆ చీకటిలో ఒక మొరటుమనిషి యెదురయ్యాడు. అతనిని చూచి కిశోరి పెద్దకేక పెట్టింది. అతడు ఆమెను నిర్దయగా తనవైపుకు లాక్కొని తీసుకొనిపోయాడు. ఆమె కేక విని కిన్నెర కత్తిదూసుకొని వచ్చింది. ఆమె కెవరూ కన్పించలేదు. కిన్నెరకు తలుపుతీలయానే గుర్తుకూడా లేదు.

కిశోరి స్పృహ తెచ్చుకొని చూచేసరికి మృత్యుముఖాన ఉన్నట్లు అర్థమైంది. ఒకముసుగు మానిసి ఆమెమీద కూర్చుండి కత్తితో పొడవబోతోంది.

—:o:—

# మాయా మయు

## మూడవ అధ్యాయం

ఫల్గుణానది మధ్యనున్న మిట్టపై నివసిస్తున్న సాధువు దగ్గరకు వెళ్ళిన స్త్రీలలో ఒకతె మాధవి, మరొకతె తిలోత్తమ. ఆ సాధువు వాగ్దానంప్రకారం మరునాడు ఆ స్త్రీలిద్దరూ అక్కడకువచ్చారు. ఇద్దర్నీ సాధు వాహ్వానించి లోపల కూచోబెట్టాడు.

సాధువు:—క్షేమంగావున్నావా మాధవీ.

మాధవి:—ఎక్కడి క్షేమం! చేసినదానికి పశ్చాత్తాప పడుతున్నాను.

సాధువు:—ఇప్పటికైనా నీవు సద్వర్తనతో వుంటే వీరేంద్రునితో చెప్పి నీ రాజ్యం నీకిప్పిస్తా.

మాధవి:—ఇప్పుడు ముష్టిత్తటానికి మనస్కరించటంలేదు. సాధ్యమైనంతవరకు నా శత్రువులను హతమార్చి చివరికి నా ప్రాణాలనైనా త్యజిస్తాను.

సాధువు:—నీ ఉద్దేశం అదే అయినట్లైతే నీవు నీ మంత్రియైన అగ్నిదత్తుపై పగతీర్చుకో. వీరేంద్రసింహుని పుత్రులు నీకేమీ అపకారం చేయలేదు.

మాధవి:—మీరు చెప్పినది నిజమేకాని, నేనిప్పుడు నా నిశ్చయాన్ని మార్చుకోలేను. మీరు నాకు సహాయపడక తప్పదు.

సాధువు:—సాధ్యమైనంతవఱకు నేను నీకు సహాయం చేస్తాను. నేనుతప్ప నీకింకెవరైనా సహాయంచేసేవాళ్లున్నారా?

మాధవి:—నిన్నటివరకు నాకెవరూ లేరుగాని, నేడు నాకు సహకరించేవాళ్లు చాలమందివచ్చారు. ఇప్పుడు నేను తలపెట్టిన పని నిర్విఘ్నంగా పూర్తవుతుంది.

సాధువు:—వారెవరు?

మాధవి:—నాసోదరుడు భీమసేనుడు.

సాధువు:—శివదత్తునిపుత్రుడైన భీమసేనుడా?

మాధవి:—అవును

సాధువు:—అయితే నీవు తలపెట్టినపని తప్పకుండా పూర్తి అవుతుంది.

మాధవి:—అయినప్పటికీ మీరు నాకు సహాయం చెయ్యాలి.

సాధువు:—తప్పకుండా చేస్తాను. ఏంచెబుతావో చెప్పు.

మాధవి:—రేపు భీమసేనుడు కిశోరివున్న ఇంటికి వెడతాడు. అసలు తన చెల్లెలైన కిశోరిని అక్కడే వీలుచూచి చంపుతానని వాగ్దానంచేశాడు. అతడావిధంగా చేయగలడు కూడా. అప్పుడు మీ సహాయంకూడా అవసరం. ఒకవేళ అతడా ఇంటిలో ప్రవేశించలేకపోతే మీరు సహాయం చేయవలసివస్తుంది. అప్పుడు మీరు ఏదైనా ఉపాయంచేసి కిశోరి ఆ ఇల్లు వదిలిపెట్టేటట్లు చేయాలి.

సాధువు:—సాధ్యమైనంతవరకూ నా అవసరంలేకుండానే జరగవచ్చు.

మాధవి:—అట్లాఅనకండి. మీరు చెప్పినట్లు ఆ ఇంటిలో

ప్రవేశించటానికి తాడు ఉపయోగించగలిగితే మంచిదే. కాని ఆ యిల్లు ఆవిధంగా లేదు.

సాధువు:—అవును మీ తండ్రి ఆ యింటిని ఆవిధంగా కట్టాడు. అయినప్పటికీ భీమసేనుడు ఆ ఇంట్లో ప్రవేశించేపద్ధతిని గురించి ఆలోచించే ఉంటాడు.

మాధవి:— రేపేమవుతుందో చూద్దాం!

సాధువు:—సరే, అయితే ఎల్లుండి నీవ్వునన్ను తప్పకుండా కలుసుకో. ఒక వేళ నీపని పూర్తికాకపోతే నాలుగవనాడు నీకు నేను తప్పకుండా సహాయంచేస్తాను.

మాధవి తన సఖితో కలసి వెళ్ళిపోయింది. వారిరువ్వురూ వెళ్ళినతర్వాత సాధువు చాలాసేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆతర్వాత బైటికివచ్చి నాలుగయిదుసార్లు గట్టిగా చప్పట్లు కొట్టాడు. ఆవెంటనే "ఏమిటో చెప్పండి" అంటూ నలుగు రయిదుగురు మనుష్యులు వచ్చారు.

సాధువు:—ఇవ్వేళ మీ అవసరమేమీలేదు. రేపు రాత్రికి తిరిగి రండి.

ఒకడు :— సంగతేమిటో చెప్పండి.

సాధువు "సరే అయితే"అని సాధువు వారిని తీసుకొని ఇంట్లో ప్రవేశించాడు. తలుపులు వేసుకొని వారితో రహస్య సమాలోచనలు కావించాడు.

* * * *

ఇంద్రజీతసింహుని తీసుకొని కమల వచ్చిన యింటిలో కిశోరి అరుపులు విని కిన్నెర కత్తితీసుకొని క్రిందికి వచ్చింది. కమల తలుపుకొట్టింది కాని కిన్నెర కిశోరిని వెదకసాగింది. ఆ

వెదకటంలోకూడా ఎక్కువ ఆలస్యం చేయకుండా సింహ ద్వారాన్ని తెరచి కమలను లోపల ప్రవేశపెట్టింది. తలుపు తియ్యటం ఆలస్యం కావటంవల్ల కమల యేదో సందేహించింది. ఆమె లోనికి రావటంతోనే ఏమి జరిగిందని ప్రశ్నించింది. కిన్నెర వణకుతున్న కంఠంతో "తలుపు తియ్యటానికి కిశోరి కిందికి వచ్చింది. ఇంతలో ఏమైందో కాని ఒక అరపుమాత్రం విన్పించింది. తర్వాత ఆమె అదృశ్యమైంది" అని చెప్పింది.

కమల దానికి ప్రతిగా సమాధాన మివ్వలేదు. ఆమె మొదట డాబామీదకు వెళ్ళి ఇంద్రజీతసింహుడు తాడు చుట్ట వెయ్యటానికి సహాయంచేసింది. ఇంద్రజీత తారా సింహులు పైకెక్కారు. వారిద్దర్నీ తీసుకొని క్రిందికి వచ్చింది. ఆమె వారితో కిశోరి అంతర్ధానగాధను సంక్షిప్తంగా వివరించి అటూఇటూ వెదకసాగింది. ఈ పనులన్నీ త్రుటి పాటులో జరిగాయి. కటికిచీకటిని సహితం లెక్కచెయ్యక కమల క్రింద గదులనన్నింటినీ గాలించింది. ఆమె వెంట ఇంద్రజీత సింహుడుకూడా తిరుగుతున్నాడు. కమల ఆ విధంగా తిరుగుతూ ఒక చిన్నంవద్ద గదిలో ప్రవేశించింది. ఆ కన్నంలోగుండా నలుగురు బైటకు శిధిలాల దిక్కుగా నడిచారు. అక్కడ వారొక విచిత్రాన్ని చూచారు.

## 2

శివదత్తమహారాజు శివదత్తగఢంలో తన్ను చుట్టుముట్టిన అనేకసమస్యలనుగూర్చి ఆలోచిస్తున్నాడు. అతనికి ఎప్పటి కప్పుడు గయా చునారగఢ రాజ్యాలలోని విశేషాలూ, రాజ

గృహవార్తలూ అందుతున్నాయి. ఇవ్వేళ అతనికి మాధవి రాజ గృహాన్ని విడిచి పారిపోయిందనీ, వీరేంద్రుడు గయరాజ్యాన్ని ఆక్రమించాడనీ తెలిసింది. కిశోరి అగ్నిదత్తుని బంధనాలలో చిక్కుకొని ఉన్నదనే వార్తకూడా వచ్చింది. శివదత్తుని ఆందోళనకు అంతులేదు. అతని ఆలోచనలు పరిపరివిధాలుగా పోసాగినవి. కిశోరిపై అతనికి పట్టరానికోపం వచ్చింది. కిశోరి గనుక ఇప్పుడు అతనిచేతికి చిక్కి ఉన్నట్లయితే ఆమెను ముక్కలుముక్కలు చేసివేసేవాడు. కిశోరి మరణించిందనే వార్త రానంతవరకూ అన్నం నీళ్లు ముట్టనని శపథంచేశాడు. తిన్నగా అక్కడనుండి అంతఃపురంలో ప్రవేశించి భీమసేనుణ్ణి రావలసినదిగా ఆజ్ఞాపించాడు.

శివదత్తుడు అంతఃపురంలో భార్యయైన కళావతిదగ్గర కూర్చొనిఉన్నాడు. ఉదాసీనమైన భర్తముఖాన్ని చూచి కళావతి అతనిపై ఎన్నోప్రశ్నలు కురిపించింది. కాని అతడు భీమసేనుడు అక్కడకు వచ్చేవరకూ ఏమీ మాట్లాడలేదు. భీమసేనుడు జననీ జనకులను సమీపించి ప్రణమిల్లి అనుమతి కొరకై నిరీక్షిస్తూ నిలబడ్డాడు.

శివ:– ఇవ్వేళ కిశోరినిగురించి వచ్చిన వర్తమానం విన్నావా ?

భీమసేనుడు:– విన్నాను.

శివదత్తుడు:– ముఖం చూపించటానికి నీకు సిగ్గువెయ్యటం లేదు ? నీవు నా కడుపున పుట్టావని ఇంకా నే నెప్పుడు గర్వించాలో అర్థకాకుండా వుంది.

భీమసేనుడు:– మీరేం చెయ్యమంటే అది చేస్తాను.

శివదత్తుడు:— నీవు నా మాట వింటావనే విశ్వాసం లేకుండా ఉన్నది.

భీమసేనుడు:— ఈ యజ్ఞోపవీతం సాక్షిగా చివరిక్షణం వరకూ మీ ఆజ్ఞను పాటించటానికి సంసిద్ధంగా ఉన్నాను.

శివదత్తుడు:—అయితే నీవు మొదట కిశోరి తలనరికి నా పాదాలముందు పెట్టు.

భీమసేనుడు కొద్దిసేపు ఆలోచించాడు. దీర్ఘమైననిట్టూర్పు విడిచాడు. 'సరే ఆవిధంగానే చేస్తాను ఆతర్వాత యేంచెయ్యమంటారో చెప్పండి.'

శివదత్తుడు:—ఆతర్వాత వీరేంద్రసింహుణ్ణిగాని, లేక అతని పుత్రులలో ఎవరినైనా గాని చంపకుండా ఇక్కడకు రావద్దు. ఈ పని నేను నీకొక్కడికే అప్పగిస్తున్నాననుకోకు. ఇవ్వాళే నేనుకూడా ఈ శివదత్తగఢాన్ని వదలివెడుతున్నాను దినదినాభివృద్ధిచెందుతున్న వీరేంద్రసింహునితో యుద్ధంచేసి గెలవలేనని నాకు నిశ్చయమైంది. కనుక ఏదైనా మాయోపాయంచేత నేను నాకక్షను సాధిస్తాను.

భీమసింహుడు:—మీ సేవచెయ్యటానికై నాస్వతంత్రులు. ఇక నేను వళ్ళి నాపనిలో నిమగ్నుణ్ణవుతాను.

శివదత్తుడు:—ఎవరెవరిని వెంటతీసుకొని వెడతావు?

భీమసేనుడు:—ఎవరినీ తీసుకొని వెళ్ళను.

శివదత్తుడు:—అయితే నీవేమీ చేయలేవు. ఇద్దరుముగ్గురు ఐంద్రజాలికులను, పదిమంది యువకులను వెంటతీసుకొని వెళ్లు.

భీమసేనుడు:—ఇక్కడ నాకు వీరేంద్రుని ఐంద్రజాలికు

లను ఎదుర్కొనే మాయాతంత్రజ్ఞులుగానీ, వీరేంద్రుని సేనలపై శౌదమసింగాల్లాగా దూకే శూరులుగాని కన్పించటంలేదు.

శివదత్తుడు:—నీవు చెప్పింది నిజమే. కాని నీవు నీ వెంట తీసుకొని వెళ్లిన ఐంద్రజాలికులు శివదత్తగిధానికి చెందినవారని శత్రువులకు తెలియనంతవరకూ పనికివస్తారు ఇంతేగాక నీ వెంట నాహారసింహుని పంపిస్తా. అతనిని ఎదుర్కొనేవారు వీరేంద్రునిదగ్గర లేరు.

భీమసేనుడు:—నిజానికి నాహారసింహుడు ప్రతాపవంతుడే. కాని అతడు ఏదినాన ఎవరితో ద్వంద్వయుద్ధంలో ఓడిపోతాడో ఆ దినాన వారికి లొంగిపోతానని ప్రతిజ్ఞ చేశాడు. కనుక అటు వంటి పని దురదృష్టవశాత్తూ జరిగిందంటే నాహారసింహుడు కూడా శత్రువుల్లో కలిసిపోతాడు.

శివదత్తుడు:— అవును నాహారసింహుని దంద్వయుద్ధంలో ఓడించేవారు అక్కడెవరూ లేరు.

భీమసేనుడు:— సరే అయితే.

శివదత్తుడు:— ఇక నీవు వెళ్ళు. ఏర్పాటులన్నీ చేయిస్తాను.

శివదత్తుడూ భీమసేనుడూ అక్కడనుంచీ వెళ్ళిపోయిన తర్వాత కళావతి పతిపుత్రుల సంభాషణకు చాలా శోకించింది. ఆమె నిరపరాధినియైన కిశోరిని తలంచి ఎంతో దుఃఖపడింది. ఏ ముఖంపెట్టుకొని తన కడుపునపుట్టిన భీమసేనుడు తనతో భాగం వంచుకొని పుట్టిన చెల్లెలిని వధిస్తాడో ఆమె ఊహించ లేకపోయింది. ఆమెకు తనకుమార్తె మరణించటం ఖాయమని తోచిన తర్వాత జీవితంపైనే అసహ్యం తోచింది. వీరేంద్రు

నితో తలపడి తనకుమారుడుకూడా బ్రతికి బైటపడతాడనే ఆశ ఆమె కేమాత్రం లేదు. అంతేగాక బందిపోటు దొంగగా తనభర్త వీరేంద్రునిపై కత్తిసాధించుకోటానికి వెళ్ళటం ఆమెకు అసహ్యం అనిపించింది. చివరికి కళావతి తాళం చెవులగుత్తి తీసుకొని పెనపెట్టె నొకదాన్ని తెరిచింది. అందులోంచి ఆమె ఏదో తీసుకొని నోట్లో వేసుకొని దగ్గరలో ఉన్న నీళ్ళు త్రాగింది. ఆ తర్వాత కాగితమూ కలము తీసుకొని ఏదో వ్రాయటానికి కూర్చున్నది. ఆమె ఉత్తరం వ్రాయటం పూర్తి అయేసరికి అక్కడికొక చెలికత్తె వచ్చింది. ఆ చెలికత్తెచేతిలో ఉత్తరం ఉంచి "మహారాజు నన్ను పిలిచినప్పుడు వారికి కాగితం యివ్వండి. నేను నిద్రపోవటానికి వెళుతున్నాను. ఎవరూ నన్ను లేపవద్దు" అని చెప్పింది.

ఆ ఉత్తరాన్ని తీసుకొని అక్కడనుంచీ అందరూ వెళ్ళిపోయారు. కళావతి మంచంమీద పండుకొని ముఖంమీద గుడ్డ కప్పుకొన్నది. ఆ తర్వాత ఆమె యెవరూ లేపనవసరంలేకుండానే శాశ్వతనిద్ర చెందింది.

సాయంకాలం శివదత్తుడు అంతఃపురంలోకివచ్చినతర్వాత పరిచారిక లతనికి మహారాణి వ్రాసిన ఉత్తరం ఇచ్చారు. ఆ ఉత్తరాన్ని చదువుకొన్న వెంటనే అతడు కళావతిమందిరాన ప్రవేశించాడు. అక్కడ మహారాణిముఖంమీద గుడ్డ తొలగించి నాడి పరీక్షించి వెంటనే బైటికి వచ్చేశాడు. అంతకు ముందే ప్రయాణమై పోయిన భీమసేనునికి తల్లి మరణవార్తను అందించకుండా శివదత్తుడు ఊరుకున్నాడు.

నిజానికి నాహారసింహుడు రణపండితుడే. సాధారణంగా అతనిని ఒంటరిగా ఎవరూ ఎదుర్కోలేరు. అంత బలవంతు డైనప్పటికీ అతను చాలా నీతివంతుడుకూడా.

భీమసేనుని పరివారం రాజగృహాన ప్రవేశించి ఒక కొండ గుహాలో మకాం వేసింది. ఐంద్రజాలికులు విశేషాలు తెలుసుకోవటానికి వెళ్లారు. రెండురోజులలోనే వారు అక్కడి వృత్తాంతాన్ని తెలుసుకొని కిశోరిలేనిసంగతి తెలియజెప్పారు. అందుచేత భీమసేనుడు సపరివారంగా గయరాజ్యానికి వెళ్లాడు. గయరాజ్యంలో అతిరహస్యమైనచోట మకాం వేశారు. ఐంద్ర జాలికులు తిరిగి తమపనిలో నిమగ్నులయ్యారు. అదే సమ యంలో మాధవి చెలికత్తె తిలోత్తమకూడా మారువేషంతో అక్కడ తిరుగుతోంది. అందుచేత అతి త్వరగా భీమసేనుడూ మాధవీ కలుసుకోగలిగారు. మాధవి భీమసేనునీ, నాహార సింహునీ తనయింటికి తీసుకువెళ్లింది.

నేడే మాధవికి కిశోరీ కిన్నరల ఇంట్లో ప్రవేశించే దినం. భీమసేనుడు తన ఐంద్రజాలికుల సహాయంతో ఆ యింటిప్రక్కన ఉన్న శిథిలాలలో ప్రవేశించి ఆ యింటికి కన్నం వేశాడు. ఆ కన్నంగుండా నాహారసింహుడు ఇంటిలో ప్రవేశించి కిశోరిని ఎత్తుకొనిపోయాడు.

నాహారసింహుడు తన యజమాని ఆజ్ఞప్రకారం కిశోరి తలను ఖండించటానికి సిద్ధపడ్డాడు. కాని నిరపరాధిని యైన ఒక ముగ్ధబాలికను వధించటానికి అతని మనస్సు అంగీక రించలేదు. అందుచేత అతడు దూరానినిలబడిఉన్న భీమసేనుని

సమీపించి "ఆ తర్వాతపని మీరే చెయ్యండి నావల్ల కాదు" అన్నాడు.

ఆ వెంటనే భీమసింహుడు మూర్ఛిల్లివున్న కిశోరిపై కత్తిఎత్తాడు. అంతలో ఎవరో అతని మణికట్టును గట్టిగా పట్టుకొన్నారు. భీమసేనుడు వెనుదిరిగి చూచేసరికి అతనికి సాధువొకడు కన్పించాడు. ఆ వెంటనే అతడు సాధువుపై లంఘించాడు. ఆ సాధువు ఫల్గుణానది మధ్య సికతాస్థలంపై నివశించేవాడే.

ఆ వెన్నెలరాత్రిలో నాహారసింహుడు దూరాన నిలబడి యీదృశ్యాన్ని చూస్తున్నాడు. భీమసేనుడు విసిరినకత్తి వల్ల సాధువుకేమీ దెబ్బతగలలేదు. సాధువు భీమసేనుని వెనుక పట్టునంపట్టుకొని యెత్తి నేలపై కొట్టాడు. ఆ తర్వాత భీమసేనుడు లేచి అతనితో మల్లయుద్ధానికి సిద్ధపడ్డాడు. అందులో కూడా భీమసేనుడు సాధువును ఓడించలేకపోయాడు. సాధువు "నీకు ప్రాణాలు దక్కాలంటే ఇక్కడినుంచీ పారిపో" అని హెచ్చరించాడు.

మూర్ఛనుండి లేచిన కిశోరి యీదృశ్యాన్నిచూస్తూ అట్లానే శయనించిఉంది. భీమసేనుడు ఓడిపోనటం గమనించి నాహారసింహుడువచ్చి సాధువుతో తలపడ్డాడు. అదే సమయానికి కన్నంలోనుంచీ ఇంద్రజీతసింహుడూ తారాసింహుడూ వచ్చారు. వారి వెనక కిన్నెరా, కమలాకూడా ఉన్నారు. ఇంద్రజీతుని చూచిన వెంటనే ఆ సాధువు నాహారసింహునితో పోట్లాడటం విడిచి కన్పించకుండా పోయాడు. నాహారసింహుడు ఇంద్రజీతునిపై కత్తితీసుకొని ఉరికాడు. అప్పటివరకూ

సాధువులో పోట్లాడి అలసిఉన్న భీమసేనుని తారాసింహుడు తేలికగా నేలమీద పడగొట్టాడు. తారాసింహుడు పడిపో యిన భీమసింహుని మూటగాకట్టి ఒకమూల పెట్టాడు.

అరగంటసేపు నాహారసింహుడు ఇంద్రజీతసింహుని మధ్య గొప్ప యుద్ధం జరిగింది. ఇంద్రజీతసింహుని కత్తిదెబ్బకు నాహారసింహుని కత్తి ముక్కలైపోయింది. నాహారసింహుని డాలుపై ఇంద్రజీతసింహుని కత్తికూడా విరిగిపోయింది.

నాహారసింహుడు:- నీవంటి శూరులను నే నింతవరకూ చూడలేదు.

ఇంద్ర:- ఈశ్వరుని సృష్టిలో ఒకరినిమించి మరొకరు ఉంటారు.

నాహారుడు:- నీవు చెప్పింది నిజమే. కాని నా శపథం ఏమిటో నీకు తెలుసా?

ఇంద్ర:- తెలియదు. చెప్పు.

నాహార:- ఎవరు నన్ను ఓడిస్తారో వారికి నేను దాసుడ నై పోతాను.

ఇంద్ర:- అయితే రండి. కుస్తీపడదాం.

ఇద్దరికీ పెద్ద కుస్తీజరిగింది. కొద్దిసేపటిలోనే ఇంద్రజీతుడు నాహారసింహుని ఓడించాడు. నాహారుడు ఇంద్రజీతునికి దాస్యం చేయుటానికి ఒప్పుకొన్నాడు. ఆతర్వాత ఇంద్రజీతుడు నలుదిక్కులా చూచాడు అతనికి కిన్నెరగానీ, కిశోరిగానీ కమలగానీ ఎవరూ కన్పించలేదు.

ఇంద్ర:- ఏమిటీ! ఆశ్చర్యంగా ఉందే.

నాహార:- అవును. ఇక్కడున్న మనుష్యులంతా ఏమై పోయారు?

ఇంద్ర:- నీ వెవరు? నీ వెంటవచ్చినవా డెవరు?

నాహారుడు:- నేను మీా సేవకుణ్ణి. నా వెంట వచ్చిన వాడు శివదత్తునికొడుకు భీమసేనుడు. మీా రెవరో చెప్పండి?

ఇంద్ర:- నన్ను ఇంద్రజీతసింహు డంటారు. నాహారుడు ఆ పేరు వినటంతోనే ఇంద్రజీతుని కాళ్ళపై బడ్డాడు. అతనికి ఇంద్రజీతసింహుడంతటివాని పాదదాస్యం లభించటాన్ని సంతోష కారణమైనది. ఆ తర్వాత ఆ వీరులిద్దరూ నలుదిక్కులూ గాలించారు. ఆ సమీాపంలోని ఒక చెట్టుక్రింద భీమసేనుడు తాడుతో బంధితుడై ఉన్నాడు. అతడు నాహారసింహుని చూచి "నన్ను రక్షించవా?" అని అడిగాడు.

నాహారుడు "నేనిప్పుడు నీసేవకుణ్ణి కాను" అని సమాధాన మిచ్చాడు. ఇంద్రజీతుడు భీమసేనుని 'ఎవరు నిన్ను బంధించార'ని అడిగాడు. భీమసేనుడు 'ఎవరో నీ అనుచరుడే' అని సమాధాన మిచ్చాడు.

ఇంతలో శిధిలాలలోనుండి తారాసింహుడు రావటం కన్పించింది. తారాసింహుని ఇంద్రజీతుడు" ఎక్కడికి వెళ్లావు" అని ప్రశ్నించాడు.

తారా:- మే మిక్కడ ఉన్నప్పు డొక సాధువున్నాడు. ఇప్పు డతడు ఎక్కడికి వెళ్లాడో తెలియటంలేదు. నేను ఒక మనుష్యుణ్ణి మాటగడుతున్న సమయంలో ఆ చెట్టుచాటు నుండీ చాలామంది వచ్చి కిశోరిని బలవంతంగా ఎత్తుకొని పోయారు. వారిని కిన్నెరా, కమలా వెంటాడారు. నేనుకూడా

వాళ్ళవెంట పడ్డాను. అక్కడ ఒక వాకిలి తెరిచిఉండటం కన్పిం చింది. నేను ఆ వాకిలిదాటి వెళ్లానుకాని నాకేమీ కన్పించలేదు. అక్కడనుంచీ వెనుకకు తిరిగివచ్చాను. ఇక మీరు ఇంటికి వెళ్ళండి. ఇత నెవరు ?"

ఇంద్ర:– ఇతడు మాకు లొంగిపోయిన వీరుడు.

తారా:– కాని, శత్రువు కదా ?

నాహార:– మీరు ఆ విధంగా నన్ను అనుమానించకండి.

తారా:– సరే చూద్దాం.

అప్పటికి తెల్లవారొచ్చింది. ఆ ప్రాంతంలోనివారు ఆ వాకిలిగుండా శిథిలాలయం దగ్గరకువచ్చి తమరాజునుచూచి ఆశ్చర్యపడ్డారు. ఇంద్రజీతసింహుడూ, తారాసింహుడూ నాహార సింహుడు భీమసేనుని తీసుకొని ఇంటికివచ్చి జరిగిన సంగతి అంతా ఆనందసింహునికి చెప్పారు.

## 3

ఇంకా తెల్లవారటానికి ఒకజాము ప్రొద్దున్నది. అంత యెత్తుగా లేని సామాన్యమైన పర్వతంమీద ముసుగు మానిసి ఒకడు అటూఇటూ తిరుగుతున్నాడు. నలువైపులా నిశ్శబ్దం. అతనిని గుర్తుపట్టే వా రెవరూ లేనికారణంవల్ల అతడు ముసుగును తొలగించి మైదానంవైపు చూస్తున్నాడు. ఆ పర్వతాన్ని ఆనుకొనే మరో పర్వతమున్నది. మధ్యగా దొంగలు అటూఇటూ వెళ్ళటానికి మంచివీలుగా ఉన్నది. పర్వతాగ్రాన ఉన్న ఆ వ్యక్తి ఆ దిక్కుగానే చూస్తున్నాడు. బహుశః అత డెవరో ఒకరి రాకకోసం నిరీక్షిస్తున్నట్లు కన్పిస్తోంది. అంతలో

తెల్లవారజొచ్చింది. ఆ వ్యక్తికి భయం ఆవహించింది. అతను పదిఅడుగులు మైదానం దిక్కుగా వేశాడు. ఇంతలో "వచ్చేశారు" అనే శబ్ద వినిపించింది. అతడు ఈలవేశాడు. వెంటనే గుట్టచాటున దాగుకొనిఉన్న పదివన్నెండుమంది బైటికి వచ్చారు. వాళ్ళతో "ఇప్పుడు మనం తొందరగా దిగ్గ్రిందికి వెళ్లాలి. వాళ్ళు వచ్చారు" అని అతని నోటినుంచీ వచ్చిన శబ్దంవల్ల ఆ పర్వతాగ్రాన చాలాసేపటినుంచీ విహరిస్తున్న మానిసి వీళ్ళందరికి నాయకుడని తోచక తప్పదు. ఆ వెంటనే అతడు తిరిగి ముసుగును ధరించి చాలా త్వరత్వరగా పర్వతం కిందికి దిగిపోయాడు. వాళ్ళందరూ అక్కడకు చేరుకున్న వాళ్ళను అటకాయించారు. ఒకశవాన్ని మూటగా కట్టుకొని చాలామంది ఆ లోయలో ప్రవేశించారు. వారిలో ఎవరికీ తమను ఇతరులు అటకాయిస్తారనే స్పృహకూడా లేదు. వారిని నలువైపులనుండీ జనం చుట్టుముట్టారు. వాళ్లు శవాన్ని విడిచి పారిపోయారు. శత్రువులు పారిపోయిన తర్వాత వారి నాయకుడు "ఈ శవం కిశోరిది అవునో కాదో చూడండి" అన్నాడు. అందులో ఒకడు కొవ్వొత్తి వెలిగించి చూచి "కిశోరే" అన్నాడు.

నాయకుడు కిశోరి నాడిని పరీక్షించాడు.

నాయకుడు "అరే! ఎవరో ఈమెకు మత్తుమందు పెట్టారు" అని తనసంచిలోనుంచీ ఒకమందు కిశోరికి వాసన చూపించాడు. ఆమెకు వెంటనే స్పృహ వచ్చింది. కిశోరిని తీసుకొని వారక్కడనుంచి వెళ్ళిపోయారు. వాళ్ళక్కడి నుండీ వెళ్ళిపోయిన తర్వాత అక్కడ దాగుకొన్న మనుష్యుడు

బైటికివచ్చాడు. అతడు "నేను మొదటే ఇక్కడకు వస్తే ఎంత బాగుండేది ? నాకు కిశోరిని తీసుకొనిపెళ్ళిన వారెవరో తెలుసు. వాళ్లు నన్ను తప్పించుకొని వెళ్ళలేరులే. నాకు వీళ్ళిద్దరూ ఒకటి. వాళ్ళు తీసుకొనిపోయినా నేను కష్ట పడవలసేవచ్చేది. సరే ఇక సాధువును వెదకాలి. అతడిక్కడే కలుస్తానని చెప్పాడు" అని ఆ వ్యక్తి ఆ సాధువును వెదక సాగాడు.

ఇంతలో బాగా ప్రొద్దెక్కింది. అతనివలెనే సాధు వేషంలోఉన్న ఒకవ్యక్తి కి ఎదురుపడ్డాడు. ఆ రెండవసాధువు "నేను నామార్గానంప్రకారం వచ్చాను. మనమిద్దరం దాదాపు ఒకే వేషంలో ఉన్నామే. సరే నా వెంటరా! అని" ఇద్దరూ అక్కడనుంచి వెళ్లిపోయారు.

# 4

కిశోరి కన్ను తెఱచి చూచేసరికి తానొక దోమతెర కట్టిన మంచంమీద పండుకొనిఉన్నట్లు గమనించింది. అక్కడ విలు వైన వేషభూషణాదులు ధరించిన స్త్రీలుకూడా ఉన్నారు. కిశోరి వాళ్ళను మొదట ఏ రాజపుత్రికలో అనుకొన్నది. కాని తరువాత వాళ్ళ మాటలనుబట్టి పరిచారికలని తెలుసుకొన్నది. ఆమెకు తా నిప్పుడు ఏ రాజాధిరాజు గృహంలో వున్నానో అని అనుమానం కలిగింది. కిశోరి మేల్కాంచిన తర్వాత ఇద్దరు ముగ్గురు పరిచారికలు అక్కడనుండి లేచారు. కిశోరి వా రావిధంగా లేచివెళ్ళటం తాను మేలుకొన్నసంగతి యెవ రికో తెలియజెప్పటంకోసమే అనుకొన్నది.

ఆమె సంభ్రమాశ్చర్యభరిత దృష్టులతో నలు వైపులా పరికించసాగింది. అది చాలా అందమైన గది. గోడలపైన చక్కని నగిషీబొమ్మలున్నాయి. ఇంటి కప్పున అందమైన బంగారు లతలు వ్రేలాడుతున్నాయి. ఇంతలో ఆ వెళ్ళిన పనికత్తెలు వచ్చి "మహారాజ్ఞీ సమేతంగా మహారాజు గారు విచ్చేయుచున్నారు" అన్నారు రాజూ, రాణీ అక్కడకు వచ్చారు. కిశోరికి వారెవ్వరో తెలియదు. మహారాజుకు దాదాపు ఏభై సంవత్సరాలుంటాయి. అతని ఆకృతి మహా రాజు పదవికి సరిపోవునట్లు రూపొంది ఉన్నది. రాణి వయస్సు దాదాపు ముప్పై సంవత్సరాలుంటుంది. అయినా ఆమె నవ యౌవనంలో కన్నులు మిరుమిట్లు గొల్పుతోంది కిశోరి వారిని చూచి మంచంమీదినుంచి లేచి నిలబడింది. మహారాజ్ఞి కిశోరి సౌందర్యానికి ముగ్ధురాలైంది మహారాజు ప్రేమపూరిత హస్తాలతో కిశోరి వీపు నిమురుతూ "తప్పకుండా ఈ కన్యారత్నమే నా కోడలై ఉంటుంది" అన్నాడు.

రాజు నోటినుండి వెల్వడినమాటలు కిశోరిని ఆనంద సాగరంలో ముంచెత్తాయి.

## 5

ఇంద్రజీతసింహునిద్వారా విశేషాలు తెలుసుకొన్న మీదట ఆనందసింహుడు తత్కాలకర్తవ్యాన్ని గురించి ఆలో చించసాగాడు. సోదరులిద్దరూ దాదాపు చిక్కుల్లో పడ్డారు. తారాసింహుని బైటికి పంపుదామా అంటే గయరాజ్యంలో

ఎవరూ లేకుండాపోతారు. ఈసంగతి తెలిస్తే వీరేంద్ర మహా రాజు దుఃఖిస్తాడు మధ్యాహ్నానికి బదరీనాధ పండితుడూ, భైరవసింహుడూ, జగన్నాధ జ్యోతిష్కుడూ అక్కడికి వచ్చారు. వారిరాక రాజకుమారులకు ఆనందకారణమైంది.

ఆనంద:- ఇక్కడకూడా శత్రువులు చాలా ఎక్కు వయ్యారు. విన్నారా?

జ్యోతిష్యకుడు:- అయితే మనలనేంచేస్తారు?

ఇంద్ర:- భైరవసింహా! ఇక్కడనుంచీ నీవు వెళ్ళిన తర్వాత ఏం జరిగిందో చెబుతావా?

భైరవ:- మాకు త్రోవలోనే కిశోరి అక్కడ లేదని తెలిసింది.

ఇంద్ర:- ఆసంగతి మాకూ తెలిసింది.

భైరవ:- అయితే నాకు వర్తమానం అందించినవ్యక్తి మీదగ్గరకుకూడా వచ్చాడన్నమాట.

ఇంద్ర:- అవును. తర్వాత ఏం జరిగింది?

భైరవ:- అయినా నేనక్కడకు వెళ్ళాను. బదరీనాధునీ జ్యోతిష్కులవారినీ తీసుకొని పని ప్రారంభించాను. వీరు అప్ప టికే రెండువందలమందిని తీసుకొని పనికి సిద్ధులై ఉన్నారు. అప్పుడు అగ్నిదత్తునితాలూకు వారిని ఇద్దరుముగ్గురిని పట్టు కొని చునారగఢానికి పంపించారు. మాధవిసంగతి మాకు తెలియలేదు. అగ్నిదత్తునివల్ల బాధపడుతున్న ప్రజలు మాకు త్వరగానే రాజగృహాన్ని అప్పగించారు. ఇప్పు డక్కడ రెండువందలమంది మనుష్యులనూ, పన్నాలాలునూ ఉంచి ఇక్కడకి వచ్చాము.

బదరీనాథుడు:- సరే. ఇక్కడ మీసంగతులు చెప్పండి.

ఇంద్ర:- ఇక్కడ విశేషాలు భైరవసింహుడు మీకు చెప్పేఉంటాడు. అంతకుమించి రాత్రి ఇక్కడొక విచిత్ర సంఘటన జరిగింది.

తారాసింహుడు ఆరాత్రిజరిగిన విశేషాన్ని చెప్పాడు. ఇంతలో కావలామనిషి అఖండనాథుడనే సాధువు వచ్చాడనే వర్తమానం తెచ్చాడు. అతడు లోనికివచ్చినతర్వాత ఇంద్రజీతసింహుడు గుర్తుపట్టగలిగాడు. అతనిని తారాసింహుడు కూడా గుర్తుపట్టాడు. అతడు ఫల్గుణానదిమధ్య మిట్టమీద ఉండే సాధువు. ఇంద్రజీతుడు సాధువుకు ప్రణమిల్లాడు. అది చూచి అందరూ గౌరవపురస్సరంగా లేచి నిలబడ్డారు ఇంద్రజీతుడు కిశోరి ప్రాణాలు దక్కించిన సాధువు ఆయనే అని తక్కినవారికి పరిచయం చేశాడు.

సాధువు:- ఆ తర్వాత ఏం జరిగిందో మీరు తెలుసుకొన్నారా ?

ఇంద్ర:- లేదు. ఆ సంగతినిగురించే ఆలోచిస్తున్నాము.

సాధువు:- అయితే వినండి. కిశోరిని వెదుకుతున్నయిద్దరు స్త్రీలెక్కడకు వెళ్ళారో నాకు తెలియదుగాని కిశోరి సంగతి నాకు తెలుసు. నాహరసింహునితో మీరు పోట్లాడుతున్నప్పుడు అక్కడే దాగివున్న భీమసేనుని మనుష్యులు కిశోరిని అపహరించి శివదత్తగఢకు ప్రయాణమైపోయారు. కాని వాళ్లు శివదత్తగఢానికి చేరుకోలేకపోయారు. మార్గమధ్యంలో రోహితగఢంలోని ఐంద్రజాలికులు కిశోరిని వారివద్దనుండి పోట్లాడి లాగికొని రోహితగఢం తీసుకొని వెళ్లారు. రోహితగఢంరాజు కిశోరి

యొక్క సౌందర్యాన్ని విని ఆమె తనకోడలుగా చేసు
కోవాలని అభిప్రాయపడుతున్నాడు. అందుచేతనే అతడు
కిశోరిని తన ఐంద్రజాలికులతో వెదికించాడు. వారు సఫలీకృతు
లయ్యారు కూడా. మీరిప్పుడు త్వరపడకపోతే కిశోరిని వదులు
కోవాలసివస్తుంది. రోహితగడాన్ని వశపరచుకోవటం పెద్దసంగతి
కాదు. అయినా మీరు కొంత శ్రమపడవలసివస్తుంది. ఒక వేళ
కిశోరికోసం కాకపోయినా ఎప్పటికైనా మీ రా కోటను వశ
పరచుకోవటం మంచిది. నేనుకూడా మీకు సాధ్యమైనంత
వరకు సహాయం చేస్తాను"

ఇంద్ర:- రోహితగఢాన్ని గూర్చి మాకు బాగా తెలుసు.
దానిని వశపరచుకొనే అవసరం ఇప్పటికి కలిగింది.

సాధువు:- ఒక గ్లాసెడు మంచినీళ్లివ్వండి.

నీళ్లు వచ్చాయి. సాధువు గడ్డాన్ని పీకి ముఖం కడు
క్కున్నాడు. అతడు దేవీసింహుడు అందరూ ఆశ్చర్యపోయారు.

ఫల్గునానది మిట్టపై ఉన్న సాధువుతో దేవీసింహుడు
కలసికోవటం పాఠకులు గుర్తుంచుకోవాలి "రేపు నేనీ స్థానంలో
ఉండను" అని సాధువు దేవీసింహునితో చెప్పిన మాటకూడా
మీరు గుర్తుంచుకోవాలి. కనుక సాధువు వెళ్లిపోయినతర్వాత
దేవీసింహుడు ఆస్థానాన్ని ఆక్రమించాడన్న మాట మాధవి
వచ్చి మాకు సహాయంగా భీమసేనుడు వచ్చాడని చెప్పినప్పుడు
అక్కడ ఉన్నది దేవీసింహుడే. తర్వాత ఇద్దరు సాధువులు ఒక
చోట కలిశారు గదా! అందులో ఒకడు నిజమైన సాధువన్న
మాట. అతడే దేవీసింహునికి రోహితగడాన్ని గురించి చెప్పాడు.

దేవీసింహుడు తన వృత్తాంతాన్ని రాజకుమారులకు విన్నవించి రోహితగఢంపై దండెత్తవలసిందని చెప్పాడు.

ఇంద్ర:- అది సరేకాని, నాహారసింహునితో ఎట్లా ప్రవర్తించనుంటారు?

దేవీ:- నాహారసింహు డెవరు?

ఇంద్ర:- అక్కడ నాతో కుస్తీపట్టిన వీరుడు. అతడు నా వల్ల ఓడపోయి నాకు దాస్యం చెయ్యటానికి అంగీకరించాడు.

దేవీ:- అటువంటి వీరునిపై తప్పకుండా దయచూపవలసిందే. అయినా నేను ఇవేళ పరీక్షిస్తాను. అతనికి ప్రత్యేకించి యిల్లూ, సౌకర్యాలూ చేకూర్చండి.

ఇంద్రజీతసింహుడు నాహారసింహునికి ప్రత్యేక సౌకర్యాలు చేకూర్చి తన సేనాపతిగా చేసుకొన్నాడు. భీమసేనుని ఖైదులో వెయ్యవలసిందిగా ఆజ్ఞాపించాడు.

సగంరాత్రి అయింది అంతా నిశ్శబ్దం. కావలావాళ్లు హెచ్చరికలు చేస్తున్నారు. నాహారసింహుడు ఏదో చదువుకొంటున్నాడు. అతని చేతిలోఉన్నది ఒక విచిత్ర సంపుటం. అతడొక పుటనువిప్పి చిత్రాలను చూస్తున్నాడు. ఆ చిత్రాలలో పెద్దపెద్ద రణరంగాలు చిత్రితాలై ఉన్నాయి. అతడా చిత్రాలనుచూచి ఉత్తేజితుడై పోతున్నాడు. చివరికి కొద్దిసేపటికి నిద్రపోయాడు. అంతకుముందే ఆ యింటిలో ప్రవేశించిన ఒకవ్యక్తి నాహారసింహుడు నిద్రపోయిన తర్వాత అతని దగ్గఱకు వచ్చాడు. అతడు ముసుగువేసుకొని ఉన్నాడు. నాహారసింహుని కేదో వాసన చూపించాడు. అతడు స్పృహతప్పి

పోయాడు. అతడు నాహారసింహుని బంధించినతర్వాత స్పృహ తెప్పించి ముసుగుతీసి ఎదురుగా నిలబడ్డాడు. నాహారసింహుడు కన్నులు తెరచేసరికి శివదత్తుడు కనిపించాడు.

శివదత్తుడు:- నాహారసింహా! ఒక విపరీత విపత్కర పరిస్థితులలో నిన్ను నా కుమారునివెంట పంపిస్తే నీవు నా కుమారుని శత్రువుల వశంచెయ్యటం ధర్మమేనా?

నాహారుడు:- ఇంద్రజీతసింహునితో ఓడిపోనంతవరకు నేను మీ కుమారునికి సహాయపడుతూనే వచ్చాను. ఆ తర్వాత నా వాగ్దానంప్రకారం నేను ఇంద్రజిత్తుని వశమై పోయాను.

శివ:- నీవు చేసినపనికి శిక్షించాలనే నే నిప్పుడు వచ్చాను.

నాహార:- అంతా భగవంతుని దయ.

శివ:- ఇప్పటికైనా నీవు మాపక్షానికొస్తే వదలివేస్తాను.

నాహార.- ఆవిధంగా ఎప్పటికీ జరగదు; మహాప్రతాప శాలియైన చక్రవర్తిని విడిచి విశ్వాసఘాతుకులచెంత నే నెప్పుడూ చేరను.

శివ:- అయితే ప్రాణాలు పోగొట్టుకోదలచా వన్న మాట.

నాహార:- సంతోషంగా.

శివ:- బాగా ఆలోచించుకో.

నాహార:- నీవు నాకు చెప్పవలసిన పనిలేదు. నీవు నీపని చూచుకో.

శివదత్తుడు ఎంత ఒత్తిడిపెట్టినా నాహారుడు మానలేదు.

చివరికి శివదత్తు ప క త్తిని దూరంగావిసిరి "భళే పిచుడవయ్యా! నేను శివదత్తుణ్ణి కాను. దేవిసింహుణ్ణి" అని అతనిని బంధ విముక్తుణ్ణి చేశాడు.

మరునాడు దేవిసింహుడు చునారగఢం వెళ్ళిపోయాడు. అతడు రోహితగఢంపై దండయాత్రకు ఏర్పాట్లుచేసి తిరిగి వస్తా నన్నాడు. ఆ తర్వాత కిశోరికోసంశోకసంతప్తుడై ఉన్న ఇంద్రజీతు నికి భైరవసింహుడు రోహితగఢంలో కిశోరివివాహం జరగకుండా ఆపుతానని వాగ్దానం చేశాడు. అదెట్లా? అని ఇంద్రజీతుడు ప్రశ్నించాడు.

పెళ్ళికొడుకునే ఎత్తుకొనివస్తానన్నాడు భైరవసింహుడు.

భైరవసింహుడు ఒంటరిగా వెళ్ళిపోయినతర్వాత అతడు వెళ్ళిన పనినిగురించి ఇంద్రజీతుడు బదరీనాథ పండితునికి చెప్పాడు. బదరీనాథ పండితుడు సామానులన్నీ తీసుకొని త్రోవలోనే భైరవసింహుని కలిశాడు.

రెండురోజులూ నడచి వా రిద్దరూ రోహితగఢం చేరు కొన్నారు. పర్వతాగ్రానఉన్న కోటలో ప్రవేశించారు. ఆ పర్వతంమీద చిన్నచిన్న సెలయేళ్లు చెరువులూ చాలా ఉన్నాయి. పై కెక్కటానికి సన్నని యిరుకైన త్రోవ ఒకటే ఒకటి ఉన్నది. ఆ త్రోవలో ఒక్కసారి అయిదారుగురు మను ష్యులకంటే ఎక్కువమంది వెళ్ళలేరు. చుట్టూ ఘోరారణ్యం. మారువేషాలతో వెళ్ళిన ఐంద్రజాలికులు కోటను చేజిక్కించు కోవటం కష్టమని అనుకొన్నారు. అక్కడ ప్రతివస్తువునూ అతి జాగ్రత్తగా పరిశీలించసాగారు. అత్యంత సుందరంగా నిర్మించినఒక దేవాలయంలోనికి మధ్యాహ్నం వెళ్లారు. ఆ దేవా

లయంలోని సభామంటపంలో చాలాసుంది కూర్చుండవచ్చు. అక్కడ పూజారులు ధూపదీపాదులు సమర్పిస్తున్నారు. ఇంద్ర జాలికు లిద్దరూ వారిదగ్గరకు వెళ్ళి "జమునా మాతాకీ జై" అన్నారు. పూజారులు వారిని కూర్చుండబెట్టి సంభాషించ సాగారు

ఒక పూజారి:- ఎవ్వరు దయచేశారు?

బదరీనాథుడు:- ఇప్పుడిప్పుడే వస్తున్నాం. కొండయెక్కే సరికి మా గొంతు లెండిపోయాయి. భంగు త్రాగితేగాని ప్రాణాలు కుదుటపడవు.

పూజారి:- దానికేం. తీసుకోండి ఇవిగో సామానులు.

అక్కడనుంచీ వారంతా భంగు తయారుచేసుకొని త్రాగారు. వారిమధ్య స్నేహం ఏర్పడింది. పూజారులు వారిని అక్కడే రెండుమూడురోజులు ఉండమని కోరారు. రాజకుమా రుని దర్శనం ఇప్పిస్తా మన్నారు. బదరీనాథుడు అందుకు సమ్మతించాడు.

ఆ దేవాలయం కోటగోడకు దగ్గరగా ఉంది. దేవాలయ నికి వెనుదిక్కునఉన్న ఇరుకవాకిలిగుండా కోటదాటి అడవిలో ప్రవేశించవచ్చు. సాయంకాలం రాజకుమారుడువచ్చి పూజాది కాలు చాలాసేపు చేశాడు. రాజకుమారుడు వెళ్ళేవరకు ఒకే ఒక పూజారి ఉన్నాడు. ఇంద్రజాలికులు రాజకుమారుణ్ని బాగా చూచారు. కాని, ఆనాడు పరిచయం చేసుకోలేదు. ఆరాత్రి అంతా ఇంద్రజాలికులు అక్కడే ఉన్నారు. పూజారికీ పర్వతం దిగువభాగాన ఒక మహాత్ముడు వచ్చిఉన్నాడని అత నిని చూడవలసిందనీ చెప్పాడు. పూజారి అందుకు సమ్మతిం

చాడు. మరునాడు సాయంకాలం రాజకుమారుడు దేవాలయానికి వచ్చి వెళ్ళినతరువాత ఆ మహాత్మ్యాన్ని చూపించటానికి పూజారిని ఐంద్రజాలికు లిద్దరూ తీసుకొని వెళ్లారు. త్రోవలో పూజారికి మత్తుమందు ఇచ్చి ఒక పొదలో దాచిఉంచారు.

బదరీనాథుడు:— ఇక ఇప్పుడేం చెయ్యాలి ? అని ప్రశ్నించగా భైరవసింహుడు "మీ రిక్కడ ఉండండి నేను రాజకుమారుణ్ని ఎత్తుకొనివస్తాను" అన్నాడు.

భైరవసింహుడు పూజారి వేషంతో తిరిగి దేవాలయం చేరుకొన్నాడు. రాజకుమారుడు దేవాలయానికి వచ్చాడు. మారువేషంలో ఉన్న భైరవసింహుడు పూజారి లోనికి వచ్చిన తర్వాత తలుపులు వేశాడు. రాజకుమారుడు పూజముగించి పూజారిఇచ్చిన పుష్పాలను వాసనచూచుకొంటూ వెనక్కు తిరిగాడు. అంతలో రాజకుమారుడు వికారంపొంది స్పృహ దప్పి నేలపై పడిపోయాడు. భైరవసింహుడు అతనిని మూటగా కట్టుకొని దేవాలయం వెనుకవాకిలి దిక్కున పారిపోయాడు. రెండుగంటలలో బదరీనాథుణ్ని చేరుకొన్నాడు. అక్కడనుంచి వారిద్దరూ "కళ్యాణసింహ" యువరాజును తీసుకొని వెళ్ళిపోయారు.

# 6

కిశోరి ఇంద్రజీతసింహుల మానసిక పరిస్థితులు డోలాందోళితాలై ఊగిసలాడిపోతున్నాయి. ఇప్పుడు వీరిద్దరూ ఒకరిని విడిచి మరొకరుఉంటున్నారు. వియోగభారంలో ఇద్దరూ ఉన్మత్తులైనారు;

రోహితగఢంలోని అంతఃపురంలోని దాసదాసీజనం అంతా కిశోరీ పర్యవేక్షణలో నిమగ్నమైఉన్నా ఆమె క్షేమాత్రం విశ్రాంతి లేకుండాఉన్నది. నిజానికామె కక్కడ ఏవిధమైనకష్టం లేదు. ఆమె మొట్టమొదట తనను వీపు నిమురుతూ "ఈమె నా కోడలు" అన్న వ్యక్తి యెవరో యిప్పుడు తెలుసుకొన్నది. అందుచేత ఆమెకు మరి జీవితం దుర్భమనిపించింది. ఆమె మనస్సును రంజింపజెయ్యాలని మహారాజు ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు. దాసీబృందంతో కిశోరిని వనవిహారానికి పంపించేవాడు. అక్కడి ప్రకృతిసుందరితర దృశ్యాలు కిశోరిని ఏమాత్రం సంతృప్తిపఱచలేకపోయాయి. అందరికీ తాపహారమైన శీతల మారుతం ఆమె హృదయతాపాన్ని మరింత అధికంచేసింది. ఆమెకు రంగురంగుల పూలకన్నెల విప్పారితవదనాలు తనను అవహేళనచేస్తున్నట్లు కన్పించాయి. భ్రమరఝంకారాలు కర్కశధ్వనులుగా శ్రవణపుటాలను బ్రద్దలుకొట్టాయి. మెత్తని ఆ పచ్చికబయళ్ళపై పాదాలు బొబ్బలెక్కిపోయినట్లు ఆమె నొచ్చుకొంటోంది. ఆ విధంగా ఆమెకు సర్వప్రకృతి పిశాచరూపంగాకట్టెదుటనిలబడి విభ్రాంతిని క్షణక్షణం ఆమె మనస్సు ఇంద్రజీతసింహునిదర్శించాలనే తీవ్రసంకల్పంలో అలసిపోసాగింది.

ఆ రాత్రి ఆమె తానిక ఇంద్రజీతుని కలుసుకోలేనని అధైర్యపడ్డది. చివరికి మరణించి అయినా అతనిలో చేరిపోవాలని ఆలోచించుకొని ఉదయాన లేచింది. అప్పుడే బయట ఆమెకు విచిత్రమైన ఆందోళన కన్పించింది. ఆ ఆందోళనకు కారణాలు తెలుసుకొన్న కిశోరిముఖంలో ఆశారేఖలు పొడసూపాయి. రాజకుమారుని ఎవరో ఎత్తుకొనిపోయారని విని ఆ యెత్తుకొనిపోయినవారు వీరేంద్రసింహుని ప్రజాలికులే అని నిశ్చయించుకొన్నది.

# 7

అప్పుడు అర్ధరాత్రికంటె ఎక్కువే గడిచింది. కిశోరి మంచంమీద పడుకొని ఆలోచిస్తోంది. గదివెలుపల ఏదో శబ్దం వినబడింది. కిశోరి తలుపుతెరచి చూచింది అది యెవరో యేడుస్తున్నశబ్దం. వసారాలో ఒక స్తంభాన్ని ఆనుకొని ఒక కన్య యేడుస్తున్న దృశ్యం కిశోరి చూచింది.

కిశోరి;— ఎందు కేడుస్తున్నావు ?

కన్య:— ఏమని చెప్పను.

కిశోరి ఆమెను తనగదిలోకి తీసుకొనిపోయి కూర్చుండబెట్టింది. ఆ యువతికి పదహారుసంవత్సరాలు ఉంటాయి. ఆమె వేషభూషణలుకూడా ఉన్నతవంశాన్ని సూచిస్తున్నాయి.

కిశోరి:— ఎందుకేడుస్తున్నావో! హృదయం విప్పిచెప్పు

కన్య:— నేనూ నీ అవస్థలోనే ఉన్నాను.

కిశోరి ఆశ్చర్యపడింది

కన్య:— నేను పారిపోవాలని ప్రయత్నంచేసి బైటికి

వచ్చాను. నీవుకూడా నా వెంట వస్తే పారిపోవచ్చు. ఈ రాజ్యంలోని ఒక గొప్పవాడు మనకు సహాయంచేస్తాడు అన్నది.

కిశోరి బైటపడవచ్చుననే సంతోషంతో వేరుమాట మాట్లాడకుండా ఆమె చెయ్యి పుచ్చుకొని బయులుదేరింది. అంతలో ఆ గదిలోకి ఒక స్త్రీ ప్రవేశించింది. ఆమె ఇరవైసంవత్సరాల యువతి. చాలా అందమైంది. ఆమె ప్రవేస్తూనే నారింజపండును తీసి చూపింది. దానిని చూచి అంతకుముందు వచ్చిన కన్య నేలమీదపడిపోయింది కిశోరి ఈ మర్మం తెలియక నిశ్చేష్టురాలైపోయింది. ఆ మొదట వచ్చిన కన్య కుందనం అయితే తరువాత వచ్చిన యువతి లాలి అనుకొందాం.

# 8

రోహితగఢం కోటకు ఎదురుగాఉన్న పర్వతానికి కొంత దూరంలో వీరేంద్రసింహుని సైన్యాలు విడిదిచేశాయి. సైన్యంలోనివా రందరూ తమతమ పనుల్లో నిమగ్నులై ఉన్నారు. సైన్యాలకు మధ్య వీరేంద్రసింహుని శిబిరం ఉన్నది. ఆ శిబిరానికి ఇరువైపులా యువరాజుల శిబిరా లున్నాయి. ఎదుటనూ, వెనుకదిక్కునా వీరాధివీరుల శిబిరా లున్నాయి. యుద్ధ సామగ్రులు రాసులురాసులుగా ఉన్నాయి. ఇంద్రజీతసింహుడు, ఆనందసింహుడు, తేజసింహుడూ, దేవీసింహుడూ, బదరీనాథుడూ, భైరవసింహుడూ, తారాసింహుడూ, జగన్నాథజ్యోతిష్కుడూ, నారసింహుడూ, ఫతేహాసింహుడూ మొదలయిన వారందరూ వచ్చారు. పన్నాలాలు గయరాజ్యంలో

ఉన్నాడు. రామనారాయణా, చున్నీలాలూ చునారగఢంలో ఉన్నారు. ఈసేనకు నాహరసింహుణ్ని సేనాపతిగా వినియోగించారు. మూడవనాడు మరికొంత సైన్యంకూడా వచ్చి చేరింది. మొత్తం అయిదుజండాలను ఏభైవేలసైన్యానికి గుర్తుగా ఎగురవేశారు. యుద్ధవీరు లందరూ ఉరకలు వేస్తున్నారు. కాని వీరేంద్రుని సైన్యానికి ఒక కష్టం సంఘటిల్లింది. ఆ సంగతి ముందుముందు తెలుసుకొందాం.

వీరేంద్రసింహునివద్దకు దిగ్విజయసింహునివద్దనుంచి ఉత్తరం తీసుకొని ఒక ఐంద్రజాలికుడు వచ్చాడు. ఆఉత్తరంలో

"మాకు మీతో ఎప్పడూ శత్రుత్వం లేదు. అయినా మీరు మాపై ఎందుకు దండెత్తివచ్చారో తెలియటంలేదు. ఏది ఏమైనా ఏభైసంవత్సరాలు పోట్లాడినా మా కోటను పట్టుకోలేరు. మేము యుద్ధానికి సంసిద్ధులం. ఇంత సైన్యనష్టం జరగకుండా మీవీరులూ, మా వీరులూ ద్వంద్వయుద్ధంచేసి బలాబలాలు తేల్చుకోవచ్చు. మా కుమారుడు ఇప్పుడు లేడు. అతడేగనక ఉంటే మీ యిద్దరికొడుకులనూ జయించగలిగేవాడు.

దానికి సమాధానంగా వీరేంద్రుడు

"మీరు మా రాజ్యంలో ప్రవేశించి కిశోరిని ఎత్తుకొనిపోయారు. అందుకు మేము మీపై యుద్ధం చేయవలసిందే కదా! ఇప్పటికయినా కిశోరిని మా కప్పగిస్తే యుద్ధం మానుకొంటాం. లేకపోతే మీరు గర్వంగా ప్రశంసించుకొంటున్న మీ కోటను నేలమట్టం చేస్తాం. ద్వంద్వయుద్ధం చేయటానికైనా మేం సంసిద్ధులమే. మీ కొడుకు మాదగ్గర బంధితుడై

ఉన్నాడు. మీరు కిశోరిని అప్పగిస్తే మేము మీ కుమారుణ్ని విడిచిపెడతాం అంతే."

ఈ ఉత్తరానికి సమాధానంగా రోహితగఢం కోటలో ఫిరంగి ప్రతిధ్వనించింది. ఇక యుద్ధం జరుగుతుందనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఇరుపక్షాల ఐంద్రజాలికులూ, బలప్రదర్శనోల్లాసంలో మునిగిఉన్నారు.

రోహితగఢం కోటబురుజులపై ఎక్కి అంతఃపురస్త్రీలంతా యుద్ధ భీభత్స దృశ్యాలను అవలోకిస్తున్నారు. కిశోరి కూడా వీరేంద్రసింహుని సైన్యంలోకి తనదృష్టిని ప్రసారించి ఇంద్రజీతసింహునికొరకు వెదుకుతున్నది.

కిశోరికి సంరక్షణగా లాలిఉంది. ఆమెకు కిశోరి అంటే చాల దయ. చాలసార్లు లాలిని కిశోరి నారింజపండు రహస్యం చెప్పవలసిందని అడిగింది. కాని ఆమె చెప్పలేదు ఆరోజు తర్వాత కుందనంకూడా చాలాసార్లు కలిసింది. ఆమెకూడా నారింజపండుసంగతి చెప్పలేదు. ప్రతిదినం కుందనం, లాలీ కలసి సంచరిస్తున్నా వారిమధ్య శత్రుత్వం కన్పించలేదు. అదిచూచి కిశోరి ఆశ్చర్యపడుతూ ఉండేది. ఈసమయంలో కిశోరిదగ్గర లాలిమాత్రమే ఉంది. వీళ్ళిద్దరూ వీరేంద్రుని సైన్యాలను జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు. కిశోరికి తిరిగి నారింజపండు గుర్తుకు వచ్చింది.

కిశోరి:- లాలీ! ఆవేళ కుందనం ఎంతపని చేసింది?

లాలి;- ఆమె చెప్పినదాంట్లో అంత అబద్ధంకూడా లేదు

కిశోరి;- అయితే ఆమె మాటల్లో కొంత సత్యముందంటావా?

లాలి:— అవును.

కిశోరి:— ఏమిటది ?

లాలి:— నిన్ను ఈ కోటలోనికి ఎందుకుతీసుకొవచ్చారో ఆమెనూ అందుకే తీసుకొనివచ్చారు.

కిశోరి:— అంటే రాజకుమారునికిచ్చి పెండ్లి చెయ్యటానికా ?

లాలి:— అవును.

కిశోరి:— ఇంకా ఆమె మాటల్లోఉన్న నిజమేమిటి ?

లాలి:— ఈ సంగతులన్నీ తెలుసుకొని యేం చేస్తావు. ఈ రహస్యం బైటపడిందంటే అంతమంచిది కాదు.

కిశోరి:— నా ముద్దుల లాలీ నే నింకెవరికీ చెప్పను. ఆమె సంగతి నాకు పూర్తిగా చెప్పు.

లాలి:— ఆమె నీ కింకెప్పుడూ చెరుపు చెయ్యదు.

కిశోరి:— అయినా దయచేసి......

లాలి:— సరే చెపుతాగానీ, యెవరితో చెప్పబోకేం.

కిశోరి:— ఎవరికీ చెప్పను.

లాలి:— కుందనంవిషయంలో నేను మొదట చెప్పిన మాట కాక మిగతావన్నీ అబద్ధాలే. ఆమె అంతఃపురంనుంచి పారిపోదలచుకోటం లేదు. ఆమెకు రాజకుమారుణ్ణి చేసుకోవటం యిష్టం నీవు పట్టపురాణివవుతావేమో అని భయం అందుచేత నిన్ను చంపదలంచింది. కాని ఇక నిన్నేమీ చెయ్యదు.

కిశోరి:— మరి నారింజపండు సంగతో ?

లాలి:— ఆ సంగతి నేను చెప్పను. ఆమెనే అడగక పోయావా ?

కిశోరి:- అడిగాను.

లాలి:- ఏమని చెప్పింది ?

కిశోరి:- ఆ నారింజపండులో ఎన్నో తొనలున్నప్పటికీ అవన్నీ కలసి నారింజపండుగా రూపొందినట్లు మనంకూడా కలసి ఉందాం అని దాని అర్థం అన్నది.

లాలి:- మరి నిజమేకదా ?

కిశోరి:- ఊఁ-హూఁ, నువ్వూ నన్ను వంచించాలనుకొంటున్నావా ?

లాలి:- (నవ్వి) ముందుముందు తెలుస్తుందిలే! గాబరా పడకు.

ఇంతలో మెట్లపై ఎవరో వస్తున్న సవ్వడిఅయింది. కుందనం వచ్చి లాలితో "ఒకమనుష్యుడు నిన్ను వెదుకుకొంటూవచ్చాడు. నువ్వేదో రక్తలిఖితపుస్తకం అపహరించావట" అన్నది

కుందనం చెప్పినమాటల్లో ఏమి అర్థముందో గాని లాలి ముఖం వివర్ణమైంది. ఆమెకు పట్టరానికోపం వచ్చింది. ఆమె చేతులు జోడించి కుందనం నన్ను క్షమించు. నావల్ల చాలా తప్పు జరిగింది. నేను మీకు శాశ్వితదాసిగా ఉంటాను.

కుందనం:- నాపైటకొంగుమీద దాసిగా ఉంటానని దస్తావేజు వ్రాస్తావా ?

ఈ మాటలను లాలి భరించలేక నిలువునా క్రింద కూలిపోయింది. కుందనం అక్కడినుంచి వెళ్లిపోయింది. కిశోరికి మాత్రం ఏమీ అర్థంకాలేదు. ఇంతకుముందు మిగిలిపోయిన నారింజపండు రహస్యానికి తోడు ఇదొకటైంది. ఆమె లాలి

ముఖంమీద నీళ్లు చిలకరించింది. లాలి మేల్కొంచి తనచోటికి వెళ్లిపోయింది.

కిశోరి నివసిస్తున్న చోటు ఒక సుందరోద్యానవనంలో ఉన్నది.ఆ తోటను నాలుగుమూలలా నాలుగు భవనాలున్నాయి. ఒకభవనములో కిశోరిని కనిపెట్టవలసినవారు ఉంటారు. వారికి నాయకురాలు లాలి, రెండవభవనం లాలి నివాసం, మూడవ దానిలో కుందనం ఉంటుంది. నాలుగవగది తాళంవేసిఉన్నది. కాని ఆ భవనంచుట్టూ కావలామాత్రం ఉన్నది. ఆ తోట రాజవాసపు స్త్రీలుండే చోటికి మధ్యగా ఉన్నది. అక్కడకు వెళ్ళటం చాలా కష్టం.

## 9

అర్ధరాత్రి సమయం అంతా నిశ్శబ్దం. వీరేంద్రసింహుని సైన్యంలో పహరావాళ్ళు తప్ప అందరూ నిద్రపోతున్నారు. దాదాపు వెయ్యిమంది గాఢనిద్రలో ఉన్నారని చెప్పవచ్చు. చలికాలం కావటంవల్ల సైన్యానికి చాలా కష్టంగా ఉన్నది. వీరేంద్రసింహుని శిబిరాన్ని పతహసింహుడు కావలా కాస్తు న్నాడు. ఇంద్రజీతసింహుని శిబిరాన్ని కాంచనసింహుడు, ఆనందసింహుని శిబిరాన్ని నాహరసింహుడు పరిరక్షిస్తున్నాడు.

ఇంద్రజీతసింహుని శిబిరద్వారందగ్గరకు ఒకమనుష్యుడు వచ్చి కాంచనసింహునికి నమస్కరించాడు ఆ వ్యక్తి ఆజాను బాహుడు కాంచనసింహుడు. "ఎవరు నువ్వు?" అని ప్రశ్నిం

చాడు. "నేను రోహితగఢ నివాసిని. కిశోరీదేవిదగ్గరనుండి వర్తమానం తెచ్చాను.

కాంచనసింహుడు:- ఏమిటా వర్తమానం?

మానిసి:- "యువరాజుగారికి తప్ప ఇతరులకు తెలియకూడదని ఆజ్ఞ.

కాంచన:- యువరాజుగారు నిద్రిస్తున్నారు కదా?

దూత:- నన్ను శిబిరంలోనికైనా తీసికొనివెళ్ళండి. లేకపోతే వారిని లేపనైనా లేపండి.

కాంచ:- నీ పేరేమిటి?

దూత:- నేను చెప్పను. యువరాజుగారు నన్నెరుగుదురు.

కాంచనసింహుడు ఆ వ్యక్తిని శిబిరంలోనికి తీసుకొని వెళ్ళాడు. ముందుగా కాంచనసింహుడు నడుస్తున్నాడు. వెనుక నడుస్తున్న ఆ వ్యక్తి త్రుటిపాటులో కాంచనసింహుని శిరస్సు ఖండించి రక్తసిక్తమైన ఆ కత్తిని తిరిగి దాచుకొని నిద్రిస్తున్న ఇంద్రజీతసింహునివద్దకు వెళ్ళాడు. అక్కడ యువరాజుకు మత్తుమందు వాసన చూపి అతణ్ణి మూటకట్టుకొని బైటకువచ్చాడు. అక్కడనుండి పారిపోయాడు. సైన్యానికి కొద్దిదూరంలో ఒక రథం ఉన్నది. వాడు ఆ రథంలో ఇంద్రజీతసింహుని పండుకొనబెట్టుకొనిపోతున్నాడు. వెనుకనుంచి ఎవరో గుఱ్ఱంమీాదనుంచి వస్తున్న శబ్దమైంది. అతడు రథాన్ని వేగంగాతోలాడు. తెల్లవారేసరికి రథం ఒక భయంకరారణ్యంలో ప్రవేశించింది. ఇంతలో వెనుకనుంచివస్తున్న వ్యక్తి చేతిలో బల్లెంవుంది. అతడు బల్లాన్ని సారథిపై విసిరాడు. సారథి నేల గూలాడు. గుర్రాలు పోతూనే

ఉన్నాయి. వెనుకవ్యక్తి గుర్రాలనుకూడాపొడిచాడు. గుర్రాలు పడిపోయినాయి. రథంలో ఉన్న వ్యక్తి కత్తిదూసి అతనిపై దూకాడు. ఆముసుగుమనిషి అతనినికూడా చంపి గుర్రాన్ని దిగాడు. ఇంద్రజీతసింహుని రథంలోనుంచి దింపాడు. ఒకచెట్టు క్రింద పరుండబెట్టి స్పృహ తెప్పించాడు.

ఇంద్రజీతుడు కలవరపాటుతో చూచాడు. ఎదురుగా ముసుగుమనిషి కత్తి తీసుకొని నిలబడి ఉన్నాడు.

యువరాజు:— నీవు నన్ను ఇక్కడకు తీసుకొనివచ్చావా?

ముసుగుమనిషి:— లేదు. ఎవరో తీసుకొనిపోతుంటే విడిపించాను.

యువరాజు:— అయితే కత్తితీసుకొని ఎదురుగా నిలబడ్డావెందుకు ?

ముసుగు:— మీరు గొప్ప వీరులని విన్నాను. మీతో యుద్ధము చేయాలని ఉన్నది.

యువ:— అయితే ఆయుధాలు లేకపోయినా సిద్ధమే కాచుకో.

ముసుగు:— మిమ్మల్ని ఎత్తుకొనివచ్చినవాడి ఆయుధాలున్నాయి. ఇవిగో.

యువరాజు వాటిని తీసుకొని యుద్ధానికి తలపడ్డాడు. ఆ ముసుగుమనిషి శత్రువులాగా పోరాడటంలేదు.

యువ:— నీవు యుద్ధంచేస్తున్నావా ? లేదా ?

ముసుగు:— మీతో మాకు శత్రుత్వం లేదు.

యువ:— అయితే ఈ యుద్ధం ఎందుకు ?

ముసుగు:— మీకు ఉద్రేకం కలిగించాలని.

యువ:- అయితే నీవు మా స్నేహితుడివా ?

ముసుగు:- అదికూడా నేను చెప్పలేను.

యువ:- శత్రువుల బారినుండి రక్షించిన నీవు నాకు స్నేహితుడవే.

ఆ ముసుగుమనిషి రాజకుమారుని తనవెంట తీసుకొని రథందగ్గరకు వెళ్ళాడు. అక్కడ "చూడండీ! ఈ రథంమీదే మిమ్మల్ని తెచ్చారు. అతనే మిమ్మల్ని దొంగిలించినవ్యక్తి. ఈ బ్రతికిఉన్న గుర్రంమీద ఎక్కండి".

యువ:- చాలా కృతజ్ఞుణ్ని. నీకేం కావాలో కోరుకో.

ముసుగు:- ఇప్పుడు నాకేమీ అవసరంలేదు. అవసరం వచ్చినప్పుడు అడుగుతాను.

యువ:- ఏదీ నీ ముసుగును తొలగించు చూద్దాం.

ఆవ్యక్తి ముసుగు తొలగించాడు. యువరాజుకు ఆశ్చర్యము కలిగింది. ఆమె ఒక సుందరాంగి. కిశోరినితప్ప అంత అందగత్తెను ఎవరినీ అతను చూడలేదు: అందుచేత ఆ రాజకుమారుడు కన్నార్పకుండా ఆమెవంక చూస్తూఉండిపోయాడు. ఆమె అతనిని విడిచిపెట్టి ఆడవిమార్గం పట్టింది. యువరాజు కొంతసేపైనతర్వాత గుర్రాన్నిఎక్కి ఆమె వెళ్ళినవైపుగా వెళ్ళాడు. మధ్యాహ్నందాకా అనేక కష్టాలుపడి ప్రయాణం చేశాడు. కాని ఆమె అతనికి కన్పించలేదు. అతనికి విపరీతమైన దాహంవేస్తోంది. సమీపంలో ఎక్కడా నీటిబొట్టు లేదు. అతడావిధంగా ప్రాణాలను బిగపట్టుకొని ప్రయాణం చేశాడు. చివరికి ఒక విశాలమైదానం చేరాడు. ఆ మైదానానికి చుట్టూ అడవి ఉన్నది. ఆ వనంమధ్యంలో ఒక చక్కని సరస్సు ఉన్నది.

ఆ చెరువునడుమ ఒక సుందరభవనం కనిపించింది. ఆ యింటి ముందు కొద్దిగా ఖాళీస్థల మున్నది. ఆ స్థలానికి నాలుగు మూలలా నలుగురు స్త్రీలు ధనుష్పాణులై నిలబడి ఉన్నారు. వారు బాణాలు విడవబోతున్నట్లు కన్పిస్తున్నారు. ఇంటి కప్పు మీద చిన్న అరుగొకటి ఉంది. ఆ అరుగుమీద ఒక స్త్రీ తల క్రిందులుగా ఉన్నది. ఇంద్రజీతుడు చాలాసేపటివరకు చూచిన తర్వాతగాని ఆ స్త్రీమూర్తులు బొమ్మలని గ్రహించలేదు. ఆ అరుగుకి తాడుకట్టి ఒక చిన్నపడవ నీటిలో ఉంది. దానినిబట్టి ఆ యింటిలో ఎవరో ఉంటున్నారని ఆ పడవను రాకపోకలకు వినియోగిస్తున్నారని తెలుస్తున్నది.

యువరాజు గుర్రాన్ని దిగి చెరువులో అడుగుపెట్టాడు. అక్కడ కాళ్ళూ, ముఖమూ కడుగుకొని దప్పితీర్చుకొని యింటిదిక్కు చూడసాగాడు. అతనికి ఈదుకుంటూ ఆ యిల్లు చేరాలనిపించింది.

సూర్యాస్తమయం కాబోతోంది. ఆ యింటిలోనుండి ఒక కాంత వాకిట్లోకి వచ్చినిలబడి యువరాజువైపు చూడ సాగింది. ఆమె యువరాజును అక్కడనుంచి వెళ్ళిపొమ్మన్న ట్టుగా చెయ్యివిసిరింది. ఆమె మరియెవరో కాదు. అతన్ని మృత్యుముఖంనుంచి కాపాడిన మిత్రసే.

## 10

కొద్దిగా ప్రొద్దుపోయింది. రోహితగఢం కోటలో కిశోరి చింతాసాగరంలో మునిగిఉన్నది. ఆమెదగ్గర ఎవరూ లేరు. అంతలో లాలివచ్చి నమస్కరించి "క్షమించండి. నేను మీ అనుమతిలేకుండా వచ్చాను". అన్నది.

కిశోరి:- నేను పరిచారికలను ఇక్కడనుంచి వెళ్ళిపొండని ఆజ్ఞాపించాను. ఒకవేళ లాలి రాదలుచుకుంటే ఆటంకపరచ వద్దని చెప్పాను.

లాలి:- నేనంటే మీకు చాలా దయ.

కిశోరి:- కాని నేనంటేనే నీకు దయ తక్కువగా ఉంది.

లాలి:- అట్లాఅనకండి. మీకోసం ఏంచెయ్యటానికైనా సిద్ధంగా ఉన్నాను,

కిశోరి:- నీదంతా నటన. లేకపోతే మీ యిద్దరి రహశ్యాలు నా కెందుకు తెలియనివ్వరు?

లాలి:- నిజమే. మీకు ఆశ్చర్యం కలిగిఉండవచ్చు. కాని కుందనంవచ్చి అప్పుడు అన్నమాటలకు పూర్వం ఆ మాటల అర్థం ఆమెకు ముందుగా తెలియదు. ఒకవేళ తెలిస్తే నేను నారింజకాయ చూపించినప్పుడు ఆమె ఆమాటలు ఎందుచేత అనకుండా ఉంటుంది? దీనినిబట్టి ఈ ప్రదేశంలో ఇతరులెవరో ఉన్నారని అర్థమవుతోంది. వాళ్ళు నా రహస్యాలను కుందనానికి చెప్పిఉంటారు. ఇక కుందనంబారినుండే నన్ను నేను రక్షించుకొనటం కష్టం.

కిశోరి:- ఆ రహస్యాలమూలమేమిటో చెప్పరేం?

లాలి:- ఇవ్వేళ రాత్రివరకూ నన్ను క్షమించండి. ఇప్పుడు నా కొక సహాయం చెయ్యండి.

కిశోరి,- ఏమిటది?

లాలి:- నా కిప్పుడు బ్రతుకుతాననే ఆశ ఏమాత్రం లేదు. అయినా నేను బ్రతకటానికి ప్రయత్నంచెయ్యకతప్పదు.

నేను చాపటానికి ముందుగా కుందనాన్ని చంపితీసుతాను. కాని ఆమెను ఏమీ చెయ్యలేకుండా ఉన్నాను. కుందనం రహస్యాలను తెలుసుకుందామనుకుంటాను. ఈ కోటకు ఆమూల తాళంవేసిన గదిలోకూడా ప్రవేశించాలనుకొంటున్నాను. ఈ విషయాల్లో మీరు నాతో సహకరించాలి.

కిశోరి:— ఆ యింటిలో ఏమున్నదో నీకు తెలుసా ?

లాలి:— కొద్దిగా తెలుసు, మిగతాది తెలుసుకోవాలనుకొంటున్నాను. మన మిద్దరంకలసి ఆ గదిలో ప్రవేశించి తిరిగి రాగలిగినట్లయితే మీకు ఇక్కడనుండి విడుదలకూడా దొరుకుతుంది. కానీ ఆ గదిలోకి వెళ్ళి తిరిగి రావటమే కష్టం.

కిశోరి:— నా ప్రస్తుత జీవితంకంటే మరణమే మంచిది. నావల్ల నీ వేమి సహాయం పొందదలచుకొన్నావో అంతా చేస్తాను.

లాలి ఒక చిత్రపటాన్ని కిశోరికి చూపి కొద్దిసేపైన తర్వాత కుందనం ఇక్కడకు వస్తుంది. అప్పుడు ఆమెకు యీ చిత్రపటం మీరు పనిగట్టుకొని చూపించినట్టుగాక దాని అంతటికి అదే చూచేట్టు చేయండి. అప్పుడు కుందనం నోటినుండి వెలువడే మాటలనూ, ముఖలక్షణాలనూ నాకు తర్వాత చెప్పండి" అని ఆ చిత్రపటాన్ని కిశోరి కిచ్చింది. ఆ పటంలో ఒకానొక గుహ చిత్రితమై ఉంది. ఆ గుహలో ఒకవ్యక్తి తల క్రిందులుగా వ్రేలాడుతున్నాడు. ఆ వ్యక్తిని ఒకస్త్రీ గాయపరుస్తోంది. దగ్గరగా ఒకయువతి నిలబడి ఉన్నది. దగ్గరలో ఒక గొయ్యికూడా ఉన్నది.

ఈ సంఘటన లోగడ ఒకసారి జరిగిందేకాని కిశోరికి

మాత్రం తెలియదు. కిశోరికి ఆ చిత్రంలోని దృశ్యం కంపం పుట్టించింది.

లాలి వెళ్ళిపోయిన తర్వాత కుందనం ప్రవేశించింది. కిశోరి చిత్రంచూడటంలో నిమగ్నురాలై ఆమెరాకను గమనించ లేదు.

కుందనం:— ఏమిటండీ చూస్తున్నారు?

కిశోరి:— (ఆశ్చర్యంతో) "నీ వెప్పుడు వచ్చావు?

కుందనం:— ఇప్పుడే. ఏమి టాచిత్రం?

కిశోరి:— దీని నెప్పుడైనా చూచావా?

కుంద:— చాలాసార్లు చూచాను. బహుశః ఈచిత్రాన్ని నాకు చూపమని లాలి మీా కిచ్చిఉంటుంది. ఈ చిత్రాన్ని చూచి భయపడేదాన్ని కానని చెప్పండి. నేను బదులు తీర్చుకోకుండా ఉండిపోయేదాన్ని కాదు. ఇక్కడనుంచీ పారిపోవటానికి సర్వసన్నాహాలు చేసుకొన్న కార్యక్రమాన్ని లాలి విఘ్నపరచింది. నాకు సహాకరించేవారిని సహితం బంధించింది. నామీాద చాడీలుచెప్పి నాపై మీాకు నమ్మకంలేకుండా చేసిందికూడా. అయినా నేను మీాకు చెరుపుచెయ్యను. దాని కుతంత్రాల నుండి మిమ్మలను మీారు కోరినా, కోరకపోయినారక్షిస్తాను.

కిశోరి:— ఓరి భగవంతుడా! ఇదంతా నాకేమీా అర్థం కావటంలేదు. ఈ గందరగోళంలో నాకు శత్రువు లెవరో, మిత్రు లెవరోకూడా తెలియరావటంలేదు" అని వలవల ఏడ్వసాగింది.

కుందనం ఆమె చేతులుపట్టుకొని "నాప్రియమైన కిశోరిదేవి! నిజానికి మీా కిక్కడ శత్రువు లెవ్వరో, మిత్రు లెవ్వరో

మీరు తెలుసుకోలేకుండా ఉన్నారు. కాని లాలిమాత్రం మీకు శత్రువని ఘంటాపథంగా చెప్పగలను. నన్ను కూడా యువరాజు కిచ్చి పెండ్లి చెయ్యటానికి తీసుకొని వచ్చారని లాలి నీతో చెప్పి ఉంటుంది. కాని అదంతా అబద్ధం. నిజానికి లాలియెవరో నాకు తెలియదు నే నెవరో కూడా లాలికి తెలియదు. కాని మీపై కన్నిన పన్నుగడ లన్నిటినీ నేను గమనిస్తూనే ఉన్నాను. ఒకానొకప్పుడు మిమ్మల్ని లాలి ఆ తాళంవేసిన గదిలోకి తీసుకొని వెళ్ళినా ఆశ్చర్యపడనవసిన పనిలేదు. ప్రస్తుతం అక్కడ కాపలా కాస్తున్న ఆడవాళ్ళతో ఆమె స్నేహం చేస్తోంది. దాని తాళం తియ్యటానికి దొంగతాళం చెవిసకూటా తయారు చేస్తోంది, మిమ్మల్ని ఆగదిలోనికి ప్రవేశ పెట్టిననాటితో ఆమెకు మీపైగల శత్రుత్వం పరాకాష్టనందుకొంటుంది. అప్పుడు మీరిక ప్రాణాలను రక్షించుకోలేరు. ఆమె ఆవిధంగా చెయ్యటానికి కారణం కేవలం మీమీది శత్రుత్వమేకాక ఈరాజ్యం మీది శత్రుత్వంకూడా కారణమే.

కిశోర:- ఆ యింటిలో ఏమున్నది ?

కుందన:- ఆసంగతి నాకు తెలియదు.

కిశోర:- ఇక్కడివారి కెవరికైనా తెలుసా ?

కుందన;- ఎవరికీ తెలియదు, బహుశః ఈ రాజుకుకూడా తెలియకపోవచ్చు.

కిశోర:- దాని నెప్పుడూ తెరవలేదా ?

కుందనం;- నాకు తెలిసినంతవరకు ఎప్పుడూ తెరవలేదు.

కిశోరి:- అయితే దానిలో ప్రవేశించి తిరిగి రాలేరని ఎట్లా చెప్పగలవు ?

కుందనం:- ఆ సంగతి తెలుసుకోవటం ఏమంత కష్టం కాదు. కాని మీరు ఈ విషయంగూర్చి ఆలోచించండి. అది ఎప్పుడూ మూసే ఉంటుంది. అయినప్పుడు అందులో ప్రవేశించే వారు తిరిగి ఎట్లా రాగలుగుతారు. అంతేగాక దాని వాకిలి మీద 'దీనిలో ప్రవేశించినవారి తల దాని అంతట అదే తెగిపడుతుంది' అని వ్రాసి ఉండటం మనం గమనించాలి. అయినప్పటికి లాలి మిమ్మల్ని దానిలో ప్రవేశింప పెట్టాలని చూస్తోంది.

కిశోరి:- పోనీ యీ చిత్రపటం సంగతి చెప్పు.

కుందనం:- చెబుతాను వినండి. ఇంద్రజీతసింహుని మోసంచేసి మాధవి తీసుకొనిపోయినప్పుడు వారిని వెదుకుతూ ఆనందసింహుడు బయలుదేరాడు. త్రోవలో అతడు ఒక మహామ్మదీయ యువతివల్ల వంచితుడై చెఱలో ఉండిపోయాడు. ఆమె తన్ను పెండ్లిచేసుకొమ్మని అతన్ని బలవంతంచేసింది. దాని కతడు అంగీకరించక మూడురోజులు అన్నపానాలు లేకుండా ఖైదులో ఉన్నాడు. చివరకు దేవీసింహుడు అతనిని విడిపించాడు. ఆ సంగతి ఇప్పటివరకూ ఆనందసింహునికి తెలియదు. ఆ తర్వాత కుందనం ఆనందసింహుడు ఈ చిత్రపటం లోని దృశ్యాన్ని చూడటమూ అక్కడనుంచీ అతనిని స్పృహలేకుండా చేసి చునార్గఢంవరకూ నేర్పించటమూ చెప్పింది.

కిశోరి:- ఈ విషయాలన్నీ నీ కెట్లా తెలుసు ?

కుందనం:- నాతో దేవీసింహుడు చెప్పాడు.

కిశోరి:- దేవీసింహునితో నీకేమి సంబంధం?

కుందనం:- కొద్దిగా తెలుసుగాని యీ చిత్రాన్ని గురించి లాలి నీతో ఏమైనా చెప్పిందా?

కిశోరి:- లేదు.

కుందనం:- అడిగి తెలుసుకోండి ఏమి చెబుతుందో? నేను వెళుతున్నాను.

కిశోరి:- కాస్త ఆగు.

కుందనం:- ఇప్పుడు నన్ను ఆపవద్దు. తిరిగి త్వరగానే కలుస్తాను.

కుందనం వెళ్ళిన తర్వాత కిశోరి పూర్వంకన్నా ఎక్కువ ఆలోచనలోపడింది. ఒకొక్కసారి ఆమె లాలిమాటలు విని ఆమె మాత్రమే తన స్నేహితురాలనుకొంటోంది. మరొకసారి లాలిని సందేహించి కుందనంవైపు మొగ్గుతోంది. ఇలా డోలాందోళిత చిత్తంతో ఆమె సతమతమైపోతోంది లాలిగాని కుందనంగాని తమ తమ రహస్యాలు ఆమెతో చెప్పలేదు. అందుచేత ఆమె ఇప్పటివరకూ ఎవరిని నమ్మాలో ఒక నిశ్చయానికి రాలేకుండా ఉన్నది.

ఆ నాడు లాలి తిరిగి కిశోరిని కలిసి కుందనం చిత్రపటాన్ని చూచి ఏమన్నది? అన్నది.

దానికి సమాధానంగా కిశోరి ఈ చిత్రపటాన్ని గూర్చి కుందనం అసలు ఆలోచించనైనా లేదు. నేనే స్వయంగా అడిగితే తనకు ఈ చిత్రపటం సంగతి అసలు తెలియదనీ ఇంతకు పూర్వం అసలు చూడలేదని చెప్పింది.

కిశోరి మాటలు విని లాలిముఖం వెలవెలపోయింది. ఆమె అక్కడనుంచి వెళ్ళిపోయింది. కిశోరి "నీవైనా ఈ వటం సంగతి చెప్పు" అని అడిగింది. దానికి లాలి సమాధానం ఇవ్వకుండా వెళ్ళిపోయింది.

ఈ సంఘటన జరిగిన చాలాదినాల తర్వాత ఇంద్రజీత సింహుడు సైన్యంలోనుండి కన్పించకుండా పోయిన వర్తమానం అంతఃపురంలో కూడా తెలిసింది. కిశోరికూడా ఆ సంగతి తెలిసింది. కిశోరికూడా ఆ సంగతి తెలిసి చాలా విచారించింది.

ఆమె ఇంద్రజీతుని పరిస్థితులనూ లాలీ కుందనాల నడవడులనూ గురించే తలపోస్తూ ఒకనాటిరాత్రి పండుకొనిఉన్నది. ఆమె మనస్సులో హఠాత్తుగా స్వయంగా తనకోసం తాను ఏదైనా సాహసం చెయ్యాలనే భావం పొడసూపింది. కాని ఆమెచేతిలో ఏ విధమైన ఆయుధాలు లేవు. ఆమె గదినుండి వెలుపలికి వచ్చింది. పరిచారికలందరూ నిద్రపోతున్నారు. ఆ చీకటిరాత్రిలో ఆమె కుందనం ఇంటిదిక్కుగా నడకసాగించింది. ఆ యింటికి కొద్దిదూరంలో ఉండగానే ఒక నల్లనిగుడ్డలు ధరించిన వ్యక్తి కుందనం వసారాలో చేరుకున్నట్లు కన్పించింది. కిశోరి ఒక చెట్టుచాటున దాగుకొన్నది. కొద్దిసేపటికి కుందనం కూడా బైటికివచ్చి ఆ వ్యక్తితో కలసి చెట్లగుబుర్లలోనికి వెళ్ళింది. అక్కడే ఒక చెట్టుచాటున కిశోరి ఉన్నది.

ముసుగుమానిసి:- ఇక నువ్వు వెళ్లు. ఇంకా ఎక్కువ సాగించటం అంత మంచిదికాదు.

కుందనం:- ఇక అయిదారుదినాలదాకా నారింజకాయ అవసరం ఉండదు.

ముసుగు:— కిశోరిని మాత్రం జాగ్రత్తగా చూస్తూ ఉండు.

కుందనం:— ఆ సంగతి మీరు చెప్పనవసరంలేదు.

అక్కడనుంచి కుందనం తనయింటికి వచ్చేసింది.

కిశోరికూడా తిరిగి తనగది చేరుకొని వాళ్లు మాట్లాడిన విషయాలనుగురించి తలపోయసాగింది. మొట్టమొదట కిశోరి లాలినే నమ్మింది. కాని యిప్పుడామెకు ఆ నమ్మకంపోయింది. తిరిగి కిశోరి గదివెలుపలకు వచ్చింది. ఇప్పుడామె లాలి ఇంటి దిక్కుగానడకసాగించింది. లాలి ఇంట్లో ఎవరో మాట్లాడుకొం టున్న సందడి వినబడింది. ఆమె చాటునఉండి "మీరు నిశ్చిం తగా ఉండండి. నేను జీవించి ఉన్నంతకాలం కుందనానికిగాని కిశోరికిగాని చెరుపుకలగనివ్వను. వారిని ఇతరు లెవ్వరూ తీసు కొనిపోలేరు. కిశోరి ఇంద్రజీతుసిహాక్కు. అతడే ఆమెను పొంద గలడు" అనేమాటలు విన్పించాయి.

ఆ మాటలు లాలి చెప్పినవని కిశోరికి తెలుసు. ఆమె కా రెండవ వ్యక్తి యెవరో తెలియదు. ఆ వ్యక్తి మెట్లు దిగి వెళ్ళి పోయాడు. ఇంతలో దొంగదొంగ అనే అరుపులు విన్పిం చాయి. ఆ అరుపులు కుందనం వేసినట్టివని కిశోరి గ్రహించింది. ఆమె తనగదిలోనికి వెళ్లిపోయింది. దొంగల రాద్ధాంతం అధికం కాజొచ్చింది.

కిశోరి గదిలో ప్రవేశించి తన అనుభవాలను సమీ క్షించుకోసాగింది. ఆమెకు లాలీ కుందనం పరస్పరం తెలిసి ఉన్నవారే అని నిర్ధారణ అయింది. ఏ కారణంచేతనో రహ స్యంగా ఈ ప్రదేశంలో ఉంటున్నారనుకొన్నది. వారికి తెలిసిన

ఒకొక్కవ్యక్తి గుప్తంగా వచ్చిపోవటంకూడా ఆమె చూచింది. ఉభయులూ తనను సంరంక్షించాలనే కుతూహలపడుతున్నట్లుగా ఆమెవిన్నది. కాని కుందనంపై ఆమెకెందుకో అవిశ్వాసం కలిగింది. కుందనం సమయంకాని సమయంలో దొంగ దొంగ అని అరచింది. ఇలాగే రకరకాలుగా భావిస్తూ కిశోరి ఆ రాత్రి గడిపింది. తెల్లవారిన తర్వాత కుందనం వచ్చి "రాత్రి సంగతి తెలిసిందా" అన్నది?

కిశోరి:- అంతా తెలుసు. నీవేగా గందరగోళంచేసింది.

కుందనం:- (ఆశ్చర్యపడి) ఏమంటున్నారూ?

కిశోరి:- అనేదేమిటి. నీ గొంతు శుభ్రంగా విన్పిస్తే.

కుందనం:- నాకేం తెలుసు? నేను తర్వాత వచ్చి అందరితోపాటు అరచాను.

కిశోరి:- (నవ్వి) అంతేనేమోలే.

కుందనం:- ఇందులో మీకింకా అనుమానం వుందా?

కిశోరి:- ఏమీలేదు. అదిగో లాలి వస్తోంది.

కుందనం:- అదే ఇదంతా చేసింది.

లాలి వచ్చి కుందనంతో ఇలా అన్నది. "నీ దెబ్బ తప్పిపోయిందే?"

కుందనం:- (గాబరాపడి) ఏమిటది?

లాలి:- పోనీలే నా సంగతి నీకు చాలా తక్కువ తెలుసు. రెండుగంటలపూర్వం నీ సంగతి పూర్తిగా తెలుసుకొన్నాను.

కుందనం:- (వణుకుతూ!) నీవు ఒట్టేసుకొని......

లాలి:- అవునవును. నాకు బాగా గుర్తున్నది. నేను మఱచిపోను.

కిశోరి:- ఏదో ఒకటిలే. అయిదారురోజులదాకా నాకు నారింజకాయతో పనిలేదు.

కిశోరిమాటలకు లాలీ కుందనమూ కూడా ఆశ్చర్య పడ్డారు. లాలిముఖంలో కొద్దిగా హాసరేఖలు పొడసూపినా కుందనం ముఖం పూర్తిగా విషణ్ణమయింది. ఆమె మారు మాట్లాడక తనయింటికి వెళ్ళిపోయింది.

లాలి:- బహుశః రాత్రి మీరు ఇంద్రజాలం చేసినట్టు న్నారే ?

కిశోరి:- అవును. కుందనం ఇంటికి రహస్యంగా వెళ్లాను.

లాలి:- అయితే మీకు కుందనం మోసకత్తెయని అర్థమై ఉంటుంది.

కిశోరి:- మొట్టమొదట బాగా తెలియలేదుగాని నీ యింటిదిక్కుగా వచ్చిన తర్వాత నీవు ఎవరితోనో మాట్లాడు తుండటం విని నీవే నాకిక్కడ శరణ్యమనే నిశ్చయానికి వచ్చాను.

లాలి:- మీ కింకా కుందనం పూర్తిసంగతి తెలియదు. ఇక మనమిద్దరం ఇచ్చటినుండి పారిపోయే సమయం అసన్న మైంది. మీరు నన్ను పూర్తిగా నమ్ముతున్నారా ?

కిశోరి:- నిస్సందేహంగా నీవల్ల నాకు మేలు జరుగు తుందనే ఆశఉన్నది. కుందనం చాలా చెడ్డది.

లాలి:- అది నన్నింకేమీ చెయ్యలేదు.

కిశోరి:- ఆమె నీ సంగతి యితరులకు తెలియజేస్తే?

లాలి:- ఆ విధంగా చెప్పదు. ఆమె నా చేతిలో ఎలా

చిక్కుకొని ఉన్నదో నేనూ ఆమెచేతిలో అంతగా చిక్కుకొని ఉన్నాను.

కిశోరి:— ఇప్పటికైనా నీ ఏ రహస్యాన్ని చెప్పవుగదా ?

లాలి:— భయపడతావెందుకు ? నెమ్మదినెమ్మదిగా అది తెలుస్తుంది. ఆ తర్వాత రెండుగంటలలో తిరిగివస్తానని లాలి వెళ్లిపోయింది.

# 11

అర్ధరాత్రి. నలుదిక్కులా చీకట్లు అలముకొన్నాయి. ప్రచండంగా వీస్తున్న గాలితాకిడికి రాలిపడిన ఎండుటాకులు నిశ్శబ్దాన్ని భంగపరుస్తున్నాయి. ఆ సమయంలో లాలి తాడును తీసుకొని తనయింటి వెనుకదిక్కుగా యెవరికంటా పడకుండా ఆ తాళంవేసిఉన్న యింటివద్దకు వెళ్లింది. ఆ యింటికి త్రాడూ విసిరి కప్పుపైకి ఎక్కింది. కప్పుమీాద నాలుగువైపులా ఎత్తయినగోడలు ఉన్నాయి. లాలి ఇంటికప్పును తొలిచి, త్రాడుసహాయంగా లోనికి దిగింది. రెండుగంటలతర్వాత ఒక పెట్టెవంటి వస్తువును తీసుకొని కప్పుమీాదకువచ్చి కిందకు దిగింది. రాచమహాలులో ప్రవేశించే వాకిలిఉన్న తూర్పుదిక్కు భవనం లోకి వచ్చింది. అక్కడనుంచి భవనంలో ప్రవేశించింది. ఆ మహాలులోనే రెండువందలమంది దాసీజనంతో మహారాజ్ఞి నివసిస్తోంది. ఎన్నో వసారాలూ వాకిళ్లూ దాటి లాలి ఒకచిన్న గదిదగ్గరకు చేరింది. ఆ గదివాకిలి చప్పుడు చేసింది. ఒకవృద్ధ స్త్రీ తలుపుతెరచి మళ్లీ తలుపు వేసుకొన్నది. ఆ స్త్రీకి ఎనభై సంవత్సరాలుంటాయి ! ముఖాకృతినిబట్టి ఆమె దయగలదిగా

కన్పిస్తుంది. గది చాలా చిన్నది. అందులో మరీ అవసరమైన సామానులు మాత్రమే ఉన్నాయి. గదిలో ఒకేఒక చిన్నచాప ఉన్నది. దానినిబట్టి ఆ వృద్ధస్త్రీ చాలా దారిద్ర్యంతో ఉన్న దని అర్థమౌతున్నది.

లాలి ఆ ముసలికి ప్రణమిల్లింది. లాలిని ఆమె ఆశీర్వదించి చాపపై కూర్చుండబెట్టింది.

లాలి:— ఇదిగో అని తాను తెచ్చిన పెట్టెను ఆమె ముందుంచింది.

ముసలిది:— ఆఁ తీసుకొనివచ్చావా! అవును. ఇదే. ఇంకముందు జాగ్రత్తగా పనిచెయ్యి. చివరక్షణంలో నాకు అపవాదు కల్పించబోకు.

లాలి:— నా శక్తికొలదిగా తెలివిగానే ప్రవర్తిస్తాను. మీ ఆశీర్వాదబలంవల్లనే కృతకృత్యురాలను కాగలనను కొంటున్నాను.

ముస:— ఆ భగవంతుడు నీ మంచితనానికి ప్రతిఫలం చూపించునుగాక. అక్కడ నీకేమీ భయం కలగలేదా?

లాలి.— గుండె రాయిచేసుకొని దీన్ని తెచ్చాను. కాని అక్కడ చూసిన దృశ్యాన్ని నేను మరవలేను. మరొకదృశ్యాన్ని చూడాలి కాబోలు కర్మ! అమ్మయ్య ఇంకా నా గుండెలు కొట్టుకొంటూనే ఉన్నాయి

ముసలి:— అవును. అక్కడ అంత ఆశ్చర్యకరవస్తువులే ప్రోగై ఉన్నాయి. భయం విడు. ఈశ్వరుడు నీకు సహాయ పడతాడు.

లాలి ఆ చిన్నపెట్టెను తీసుకొని తనయింటికి వచ్చి జాగ్రత్తపరచి శయనించింది. ఉదయాన్నే కిశోరి యింటికి వెళ్లింది.

కిశోరి:— రాత్రిఅంతా నువ్వే గుర్తుకొచ్చావు. బైటికి వెళ్లి చూస్తే ఏదో గోల విన్పించింది.

లాలి:— దేవునిదయవల్ల నా పనికి ఎటువంటి ఆటంకమూ జరగలేదు.

కిశోరి:— నీ వల్ల బైటికి పోగలుగుతాననే విశ్వాసం నాకు బాగా కుదిరింది.

లాలి:— నేనుకూడా ఇప్పుడు గట్టినమ్మకంతో ఉన్నాను.

కిశోరి:— చిన్నపెట్టెదొరికిందా?

లాలి:— దొరికింది. పగటిపూట వీలుండదని అప్పుడే ముసలి అవ్వకు చూపించి వచ్చాను. ఆమెకూడా అదే పెట్టె అన్నది. అక్కడ అటువంటి రంగులో చాలా చిన్నపెట్టెలున్నాయి. అవ్వ చెప్పిన గుర్తులనుబట్టి దానినే తేగలిగాను.

కిశోరి:— నాకుకూడా ఆ పెట్టెను చూడాలని ఉన్నది.

లాలి:— నిన్ను తీసుకొనివెళ్లి ఆ పెట్టెను చూపించాలని ఉంది. కాని దానిని చూడటంవల్ల నీ కేమీ లాభంకలగదు. నిన్ను విడిపించటానికి చేసే నా ప్రయత్నాలలో నీవు నా యింటికి రావటంవల్ల ఆటంకాలు కలిగినా కలగవచ్చు. అందులో ఆ పెట్టెలో చూడదగ్గ వస్తువుకూడా ఏమీలేదు. అది మామూలు చిన్నడబ్బాలాంటిది. దాని తాళం తియ్యటానికిగానీ పగలగొట్టటానికి వీలులేదు.

కిశోరి:— దాన్నెట్లా తెరవాలి? అందులోని తాళం చెవి మనకు కావాలి గదా?

లాలి:— దానికి ఆకురాయితో కన్నం పెట్టాలి.

కిశోరి:— చాలా ఆలస్యం కాదూ?

లాలి:— అవును రెండురోజులన్నా పడుతుంది. రాత్రి పూట తప్ప చెయ్యకూడదు.

కిశోరి:— నాకు మాత్రం క్షణాలు యుగాలుగా గడుస్తున్నాయి.

లాలి:— ఇన్నాళ్ళపాటు ఉన్నదానివి, రెండురోజులు ఆగలేవా? అని అక్కడనుంచీ వెళ్ళిపోయింది.

ఇది జరిగిన మూడవనాటి అర్ధరాత్రివేళ కిశోరి యింటికి వచ్చింది. కిశోరి మందిరంవద్ద కాపలావాళ్ళున్నారు. కిశోరి మాత్రం మేలుకొనేఉన్నది. లాలి చేతిలో ఒకచిన్నమూట పుచ్చుకొని వచ్చింది.

కిశోరి:— ఇవ్వేళ చాలాకష్టంగా గడచింది. రాత్రిం బగళ్ళు ఒకటే భయం.

లాలి:— ఎందుకని?

కిశోరి:— ఎవరైనా నీవు ఆ యింటికవ్వాన పెట్టినకన్నం చూస్తే?

లాలి:— ఎవడు చూస్తాడులే! కానీ.....

కిశోరి:— నేను సిద్ధంగానే వున్నాను. ఏమీ తీసుకోవలసిన అవసరంలేదు.

లాలి:— అవసరమైనవన్నీ తీసుకున్నానుగాని, నీవు నా వెంట నడువు.

ఇద్దరూ అక్కడనుంచి బయలుదేరి చెట్ల చాటునుంచి తాళంవేయబడిన యింటిదగ్గరికు వచ్చారు. తాడుసహాయంగా ఇద్దరూ పైకెక్కారు. అదే తాటిసహాయంవల్ల లోనికికూడా దిగారు. అక్కడి అద్భుతదృశ్యాలు కిక్కిరిసి భయంలో ముంచెత్తాయి. ఆమె ఆలోచనలు మనోదిశగా వెళ్లాయి. వాళ్లు ఇంటిలో ప్రవేశించగానే బైటినుంచీ ఎవరో పిల్చిన శబ్దమైంది. చాలామంది త్రాడుసహాయంగా పైకెక్కారు. పట్టుకోండి! పట్టుకోండి! వెళ్ళనివ్వకండి? అనేమాటలు విన్పిస్తున్నాయి.

## 12

ఇంద్రజీతసింహుడు చెరువుఒడ్డున నిలబడి ఆ విచిత్ర భవనాన్ని ఆ సౌందర్యమూర్తిని అవలోకిస్తున్నాడు. అతనికి ఈదుకొని వెళ్ళాలని ఉన్నదిగాని ఆమె వద్దని అక్కడనుంచే సౌంజ్ఞ చేసింది. అయినా అతనిని అక్కడికి వెళ్ళాలనే కోర్కె త్వరపెడుతోంది. ఆమె అతడు ఎలాగైనా వస్తాడని అనుమానం కలిగి "నావవేసుకొని వస్తున్నా ఆగ"మని కేక వేసింది. ఇంద్రజీతుడు ఆగిపోయాడు. ఆమె పడవ నడుపుకొంటూ చెరువుకు వెనుకదిక్కుగా వచ్చి అతన్ని పిలిచింది. యువరాజు సంతోషంతో బాటు పడవలో ఎక్కాడు. ఆమె అతనిని తీసుకొని ఇంటిలోనికి వెళ్లింది.

ఆ చిన్నయిల్లు చక్కగా అలంకృతమైఉన్నది. నిత్యావసర వస్తువులన్నీ అక్కడ ఉన్నాయి.

నడుమగదిలో గోడలకు రంగురంగుల అద్దాలు, నేలపై కాశ్మీరు శివాచీలు ఉన్నాయి. పాలరాతి చిత్రాలమీద

గులాబీపువ్వుల జాడీలు ఉన్నాయి. రకరకాలైన వాయిద్య పరికరాలుకూడా ఉన్నాయి. గోడలపై సమర్థులైన చిత్రకారులు చిత్రించిన చక్కని చిత్తరువులున్నాయి. ఆ గదిప్రక్క మరో గదికూడా అలంకృతమై ఉన్నది. ఆ గదిలో శయనించటానికి మంచమున్నది. దానిపక్కనున్న గది స్నానాల శాల. ఈ అన్నిటికీ మధ్యగా ఒకతొట్టి ఉంది. ఆ తొట్టిలోనికి చెరువులో నుంచి నీళ్లు వచ్చిపడుతుంటాయి. మరో వైపునుంచీ నీళ్ళు పోయే ఏర్పాటుంది. వీటికిమించి ఇంకా కొన్ని గదులు ఆ భవనంలో ఉన్నాయిగాని ఆ ఏకైకయువతి ఎన్నిటినని వాడు కొంటుంది?

రాజకుమారునికి ఆ ఒంటరిగానున్న సుందరిని చూడగా ఆశ్చర్యం కలిగించింది. చూడటానికి ఆ భవనం కేవలం ఉండ్వటానికి వదుగురుగాని చాలదు. దినమంతా అలసిసొలసిఉన్న ఇంద్రజీతసింహునికి ఆ భవనం చాలా హాయిని కలిగించింది. అపురూపలావణ్యవతియైన ఆ రమణి రూపసంపదకు అతడు మోహపరవశుడయ్యాడు. అతనికి వెనుకటి గాథలేవీ గుర్తుకు రావటంలేదు. ఆ యువతి యువరాజును ఒయ్యారంగా వెంట తీసుకొని సింహాసనంపై కూర్చుండబెట్టి తాను ప్రక్కగా కూర్చున్నది.

యువరాజు:- నీవు చేసిన సహాయానికి శాశ్వతంగా నేను కృతజ్ఞుణ్ణి.

రమణి:- సరే కాని మీరు మాత్రం నాకు అవమానం కలిగించే పనేదీ చెయ్యకండి.

యువ:- అదేమిటి అట్లా మాట్లాడుతున్నావు?

రమణి:— ఒంటరిగాఉన్న ఆడదానియింటికి మీారీవిధంగా రానటం నిజానికి అవమానం కొని తెచ్చేది కాదా ?

యువరాజు కొంత ఆలోచించి "నీవెంత అందంగా ఉన్నావు. నీ సర్వాంగసౌందర్యం నన్ను ఉన్మత్తుణ్ణి చేస్తున్నది. అయినా నే నిక్కడనుంచి వెళ్ళిపోతాను. అవమానం జరుగు తుందనుకొన్నదానివి నన్నిక్కడి కెందుకు తెచ్చావు ?

రమణి:— నేను మొదట మిమ్మల్ని వెళ్ళిపొమ్మని చెప్పాను. కాని నా మాట వినకుండా చెరువులో దూకాలని ప్రయత్నంచేశారు. అప్పుడు చూస్తూ నేనూరుకోలేక మిమ్మ ల్నిక్కడికి తెచ్చాను. స్వయంగా ఒకదుష్టుడి చేతినుండి సంరక్షిం చుకొని వ్యక్తి తిరిగి ప్రమాదంలో చిక్కుకోబోతుంటే ఏ విధంగా ఉపేక్షించేది ? ఈ చెరువులో ఈదుకొని ఎవరూ ఇక్కడికి రాలేరు. చెరువునిండా వలలువన్ని ఉన్నాయి. చెరు వులో దిగినవారు వలలో చిక్కుకొని చావవలసిందే. అందు చేత మిమ్మల్ని పడవలో ఎక్కించుకొనివచ్చాను.

యువ:— దీనికికూడా నేను కృతజ్ఞుణ్ణి. ఇక్కడకు నేను వచ్చి మీాకు నష్టం కల్గించినందుకు క్షమించండి. ఇక నేను వెళతాను. దయచేసి మీా నామధేయమైనా చెప్పితే గుర్తుం చుకొంటాను.

రమణి:— (నవ్వి) నేను నా పేరు చెప్పదలచుకోలేదు. అయినా మొదలో వచ్చినవారు నా అతిథ్యాన్ని స్వీకరించైనా వెళ్ళండి.

యువ:— ఔరా! మీా యిష్టంవచ్చినట్లు మీారు నన్నొక

సారి పొమ్మనీ మరొకసారి అతిథిగా ఉండమనీ అడుగుతా రేమిటీ?

స్త్రీ:- సరే. ఆ సంగతులన్నీ విడిచిపెట్టి ముందుభోజనం చెయ్యటానికి లేవండి.

యువ:- ఇంకా స్నాన మదీ చేయలేదుగాని ఇది ఏమిటీ దాసీ లెవరూ కన్పించరూ?

స్త్రీ:- నేనున్నాను చాలదూ. కూర్చోండి అని ఆమె వక్కగదిలోనికి వెళ్ళింది. ఆమె వెళ్ళినతర్వాత, యువరాజు అటూఇటూ తిరిగి అక్కడఉన్న వస్తువులను చూస్తున్నాడు. అతనిదృష్టి పూలకుండీ క్రిందవున్న కాగితంమీద పడింది. అతడా చీటీని తీసి చదవసాగాడు అందులో.

"మీరు చెప్పినట్లు కార్యక్రమాలన్నీ సరిగానే జరుగు తున్నాయి. లాలి కుందనాలతో ఘర్షణం బాగా పెరిగింది. కిశోరికూడా చాలాభాగం మోసపోయింది కిశోరికి కావలసిన వ్యక్తి ఇక్కడే ఉన్నాడు. అతనికి కిశోరిపై చాలా విశ్వాస మున్నది. నేనుకూడా బహుకృతి పొందగలిగినపని చేశాను. ఇప్పుడు లాలి కొత్తయెత్తు వెయ్యదలచింది. మిగతావి రెండు మూడు రోజుల్లో......

మీ దాసి,
"తార".

యువరాజు ఆ ఉత్తరాన్ని చదివి మళ్ళా అక్కడ పెట్టి సింహాసనందగ్గరకు వెళ్ళి అక్కడ కూర్చున్నాడు. ఆలోచనలు ఉవ్వెత్తుగా కలిగాయి. అతని ముఖాకృతికూడా మారిపోయింది. ఏదో ఉపాయం తట్టినట్టు తలపంకించాడు. అంతలో ఆ యువతి

వచ్చి "స్నానం చెయ్యండి" అని చెప్పింది. యువరాజు స్నాన
సంధ్యాదులు ముగించుకొన్నాడు. ఆమె అతనికి కొన్ని ఫలా
లను సమర్పించింది. అతనికి పక్కగదిలో ఇద్దరు స్త్రీలు మాట్లా
డుకొన్నట్లు అర్థమైంది. అతని కాశ్చర్యం కలిగింది. యువ
రాజు ఫలాహారాన్ని స్వీకరించి [illegible] వెళ్ళటానికి లేచాడు.
ఎదురుగానున్న గదిలో అతనికి ఇద్దరు స్త్రీలు కన్పించారు.
అతడు "అరే! ఈ యిద్దరూ ఇక్కడున్నారేమిటి?" అను
కొన్నాడు.

## 13

ఒక విశాలమైన మైదానంలో అర్ధరాత్రిసమయంలో ఇద్దరు
స్త్రీలు పరస్పరం సంభాషించుకొంటూ నిల్చొనున్నారు. వారె
క్కడికో తొందరగా వెళ్లాలనే ఆతురతను ప్రకటిస్తున్నారు.
అందులో ఒకతె కిన్నెర మరొకతె కమల.

కిన్నెర:— కమలా అదృష్టముంటే మనదే ఒకదెబ్బలో
గయలో పని పూర్తిచేశాను.

కమల:— సాధ్యమైనంతవరకు నువ్వు కిశోరిని జాగ్రత్త
గానే కాపాడావు. అదిగో! ఆ పాడువడిన గోడలు కన్పిస్తు
న్నాయి చూడూ!

కిన్నెర:— అవును. వచ్చేశాము.

వాళ్ళు ఆ శిథిలగృహానికి చేరుకున్నారు. దాని పడి
పోయినగోడలూ, విశాలమైన వాకిళ్లూ పురాతన వైభవాన్ని చాటి
చెబుతున్నాయి. ఇంకా కొన్నివసారాలు గదులోని వాస
యోగ్యంగానే ఉన్నాయి. ఇద్దరూ ఆ యింటిలో ప్రవేశిం